## ఇందులో

౪

* గురుపుత్రి విజయం

* మగువ ప్రతిజ్ఞ

* కాసిబియాంకా

* శిథిల శిల్పం

* తమ్ముడు

* వీరవనిత

* కరిగిపోయిన కల

* అమరాన్వేషి



# శాంతిఘోష

పాత్రలు :

అశోక చక్రవర్తి

బౌద్ధ భిక్షువు

అమాత్యుడు

సామ్రాజ్య సేనాని

కళింగరాజు

వృద్ధజనని

[ భారతదేశ చరిత్ర ఎంత ప్రాచీనమైనదో అంత విభిన్నమైనది. సామాన్య సంఘజీవుల జీవన విధానమునకు, పరిణామమునకు చరిత్రలో ప్రాధాన్య మివ్వబడకుండుట గమనార్హము. యుద్ధ మదాంధులు, అధికారులైన కొలదిమంది వ్యక్తుల విధానములతో చరిత్ర నిండి యున్నది. చరిత్ర లిఖింపబడుటయు వారి హస్తగతమగుటయే కారణము.

నాణెములు, లోహపాత్రలు, శిథిలకట్టడములు, పురాతన శాసనములు, విదేశయాత్రికుల వర్ణనలు, సారస్వతములో పేర్కొనబడిన దేశీయాచారములు చరిత్ర విపులీకరణమునకు ఆధారభూతములైనను క్రీ. పూ 7 శతాబ్దమునకు ముందు జరిగిన చరిత్ర విస్పష్టమని తెలియుచున్నది.

చైతన్యరహితమైన చరిత్ర మానవాభ్యుదయ కారకము కాజాలదు. చరిత్రానుభూతులు మానవుల లోపములను సంస్కరించి, శాంతి మార్గమునకు మార్గదర్శి కావలసి యున్నది. ఇది చరిత్రకారులయు, కారకులయు సమిష్టి

ధర్మము. సహృదయ విమర్శద్వారా చరిత్ర పునర్నిర్మితమైన, సజీవఖండమై, ప్రయోజనము కల్గించును.

చంద్రగుప్తుని మనుమడగు అశోకవర్ధనుడు క్రీ. పూ. 273 లో సింహాసన మధిష్టించెను. రాజ్యాభిలాషియై సోదరుడైన 'సుసీమా'తో పోటీపడెను. అశోకుని రాజ్యములోని మగధ దక్షిణ బీహారు ప్రాంతము. అశోకుని పూర్వపాలకుడైన బింబిసారుడు, జైనమత స్థాపకుడు. మహావీరునికి, బౌద్ధమత కారకుడు గౌతమ బుద్ధునికి, సమకాలికు డగుటచే, జైన, బౌద్ధములు అశోకునికి పూర్వము ప్రాబల్యము పెంపొందించుకొనుచు, నిలసిల్లుచు, వానిదృష్టి నాకర్షించినవి. శైశునాగులు, నందులు, మౌర్యులు మగధను వరుసగ పాలించిరి.

బౌద్ధము నేడు లోకములో గొప్ప మతమై వర్ధిల్లుటకు అశోకుని కాలములో జరిగిన మహాపరివర్తనమునకు విశేష ప్రాధాన్య మివ్వవలసి యున్నది. అశోకుని జీవితములో క్రీ. పూ. 261 సం॥ జరిగిన కళింగయుద్ధము, విశిష్టమైన చారిత్రకాంశము. హిందువైన అశోకుని బౌద్ధునిగ మార్చుటయేగాక బౌద్ధ వ్యాప్తికి దోహద మిచ్చినది. బంగాళాఖాత తీరమున ఆంధ్రదేశమున కుత్తరమున నున్న ఒరిస్సా, పూర్వపు కళింగము. ఆ సమరములో దాదాపు లక్షమంది హతులు క్షతగాత్రులగుటయు, లక్షన్నరమంది బందీలగుటయు సంభవించెనని చరిత్రకారులు వ్రాసియున్నారు.

ప్రస్తుతము అశోకుని రాజ్య విస్తీర్ణతను గురించిగాని, వాని ఆర్థికదళ ప్రభావమును గురించిగాని చర్చించుట

మానవ పతనమును నిరూపణముచేయు యుద్ధరంగమును గర్హించుటంత ముఖ్యముకాదు. మానవులు నిర్మించి యిచ్చిన రాజరికము, వారిని నిర్మూలించుటకు దోహదకారకమైన, అంతకుమించిన శోచనీయ ముండునా? అశోకుని తదనంతరము విదేశములలో విజయ విహారము సల్పిన బౌద్ధము, వాని స్వదేశములో ప్రచ్ఛన్నముగ నుండుటను, చరిత్రకారుకు విన్సెంట్‌స్మిత్ "The Change to puranic Hinduism has made India a sadder land" అనుచు విమర్శించినాడు. ఈ విమర్శయందలి నిగూఢత నరయవలయును.

సమరములో నిహతుడైన తనయుని దలంచి, ఏ చరిత్ర కందని జనని చేయు హృదయ స్పందనము, అశోకుని దయాంతరంగుని చేసినదో, ఆ సగపాపత్య ఉద్దీపనమే చరిత్ర సాహిత్యక్షేత్రములో సమగ్ర వ్యవసాయము చేయు కృషీవలుల ఉద్యమమైనగాని, బౌద్ధము చైతన్యవంతమై, మనము చరితార్థులము కానేరము. ]



# ప్రథమాంకము

(కళింగయుద్ధ సైనిక గుడారము - సంధ్యాసమయము)
(భారముగా మహతీశృతులు)

అశో:- (ఉద్వేగముతో ... సామ్రాజ్య విస్తరణ!... కళింగ సాధన! ...

[దూరమునుంచి అస్పష్టముగ సైనిక పహరా హెచ్చరికలు - గుర్రపు డెక్కల చప్పుడు... పరిచారకుల సందడి

చీకటి తెరలు దశ దిశలను వ్రాలుచున్నవి. ఆక్రమింపబడినది నా మానసము. (ఆలోచనా పరంపరలతో... ప్రక్కకుచూచి) ... ఏమా కాంతి ?...

[కరండదీపికతో బౌద్ధభిక్షువు ప్రవేశించును]

అశో: (సాదరముతో కూడిన ఆందోళనతో)...భిక్షూ !... నా సఖా!...

భిక్షు: అంధకారమావరించె ప్రభూ...జ్యోతిని వెలిగింతు...

అశో: వలదు...వెలుగు నా సైనిక తంత్రములకు అంతరాయము... నిశీధమునందే నా నిశితబుద్ధి !...

భిక్షు: భ్రాంతి...ప్రశాంత చిత్తములేని జీవి సకలైశ్వర్య సంపన్నుడయ్యు పరమ నిరుపేద...రాజ్యమునకుహద్దులుండునుగాని ఆశకు అవధులు లేవు...ఆహా...

అశో: (కళవరపడి)... మిత్రమా... నా విడిదిలో మీకు సకలోపచారములు సక్రమముగ జరుగుచున్నవా?...

పరాధీనముతో నేను స్వయముగ, మిమ్ముల పర్య వేక్షించకుండిన సైరింతురుగాక!...

భిక్షు : భారత చక్రవర్తీ...కలిమి లేముల నధిగమించిన వానికి, నిరంతరానందము... బౌద్ధమున్న తావుల క్లేశము మనజాలదు... నా శాంతిఘోషతో మిమ్ము నిర్మలచిత్తులను చేయునంతదాక, నా కొరత శమియింపదు...

అశో : (చిరునగవుతో)... మీరు నా శ్రేయోభిలాషులు. (అనురాగముట్టిపడు స్వరముతో) నిక్కువము ... అయినను, సమరము రాజధర్మము కాదో? ...మీరు త్యాగులు... నేను భోగిని...ప్రతి జీవికిని వానికనిర్వ ర్తించుధర్మములున్నవని ఎరుంగరో! ఆర్య!అభిప్రాయ భేదము లున్నంత మాత్రమున మిమ్ము తిరస్కరించు నంత సంకుచిత మనస్కుడను గాను.నాకనుసన్నలలో మెలగు విజయలక్ష్మి అనతికాలములో నా సన్నిధిమున వినమిత శిరస్కయై విహారము సల్పు సమయమున, నాతో నృత్య గాన వినోద వేడుకలలో పాల్గొనవల యునని అర్థించుచున్నాడ...

భిక్షు : (సాదరముగ)... భిన్న మార్గావలంబులయ్యు మీ హృదయము మహోన్నతము...కాని...లోక పీడనల నధిగమించిన నా మనో సామ్రాజ్యము, శాశ్వతమై, సుస్థిరమై,మీకు విస్మయకారకము కాగలదు ... నే నధిష్ఠించి యుండు గద్దెయు, సతతము శాంతికన్య నా

కనుసన్నలలో చేయు విన్యాసము మీకు దృగ్గోచరము...ఓ సహయాత్రికా! విశ్వసింపుము ... నా ఆగమన నిర్గమనములు – ఆహ్వాన తిరస్కారములకు అతీతములు.(బౌద్ధారామమునుండిగంటలు).ప్రార్థనకు పోయెద. (నిష్క్రమించును.)

అశో: (భారముగా) ఏమి ఈ వ్యక్తి? నాకుగూడ అగ్ని పరీక్షయా? (పచారులు చేయుచుండును) (తటాలున ఆగి) ... కోరకరాని కోయ్యవా, కళింగా, నీవు నాకు?...సామంతమునకు అవకాశమిచ్చినను తిరస్కరించితివికదా, తర్కరహితా! ... ఎవరూ?... అమాత్యులా!...

[తెరనుండి విజయధ్వానము."అంతిమ, కళింగ సైనిక శ్రేణి శిథిలమైనది మహావిజేతా"]

అమాత్యుడు: (ప్రవేశించి) ఇంక, కళింగ, అలభ్య కాదు. మీ అరచేతి స్వర్గము!... సామ్రాట్ ... సామ్రాజ్ఞ్ సేనాని గజదళము! వెనుకపాటుగా శత్రువుల ముట్టడించినది...మన ఆశ్వికదళము విజృంభించి, నిశ్చేష్టితులైన వైరులను,చుట్టుముట్టి నిరాయుధులను జేసినది.

అశో:(తృప్తిగ)...ఆహా! అద్భుత సైనిక ప్రజ్ఞానిర్వహణ!...

అమా: సుసీమా సోదరునితో సింహాసనమునకు పోటీ పడినప్పటికంటె,కళింగసాధన,మాకెక్కుడు ఆందోళనకారకమై,నన్ను ఉన్మాదుని చేసినది...ఇది శుభాంతము... అప్రతిహతమైన, మీ విశ్వ విజయారోహణమునకు

ప్రథమ సోపానము సిద్ధమైనది నేడు...ఏమి ఆజ్ఞ... మీ రాశించు మరియొక స్వర్గసీమ?...

అశో: (పరాకుగా)... స్వప్నసీమ!

పరిచారకుడు: ప్రభూ...సైన్యాధ్యక్షుడు సాహ్రిమ్..

అశో: అవశ్యము...

సాహ్రిమ్: (ప్రవేశించి) మహార్యవంశాలంకారా, భారత భాగ్యవిధాతా! ... ఇదో మా సైన్యము సాధించిన కళింగపతాక! ... సమర్పింప అనుమతి వేడుకొను చున్నాడ... (మోకరిల్లి సమర్పించును...)

అశో: (స్వీకరించుచు) సేనానీ...నీ నైపుణ్యము గర్వకారణము. విధి నిర్వహణము ప్రశంసార్హము ... ఐనా ఈ పతాకకొర కెంత సంరంభము?...

సాహ్రి: ఈ పతాక అసామాన్యము...రాజా...దీనినిమిత్తము లక్షమంది నిహతులు, క్షతగాత్రులైన కళింగులు, వారి లక్షన్నరమంది బందీలు. మరి మీకు చరిత్రలో శాశ్వతకీర్తి రచనా ప్రదానము!...

అశో: (నివ్వెరపడి) చరిత్ర! ... ఎంతటి మూల్యము? (తేరుకొని)...మరచితి... నేను లబ్ధ మనోరథుడను కదా?... సాహ్రిమ్!...నీకేది బహూకరింపవలయు? (ఆలోచించి) ఇదో గ్రహింపుము. నా రత్నరంజిత కరవాలము!...

సాహి: ధన్యుడను. శెలవు. (సాహిమ్ స్వీకరించి నిష్క్రమించును.)

అమా: (ఆత్రిముగ)... పాలకా...ప్రసాదింపరాని రాజ్య లాంఛనము మీ కరవాలము...మన్నింపుడు.

అశో: (సాలోచనగా) అమాత్యశేఖరా ... సమయవిశేషములో సాంప్రదాయము పాటింపబడకుండిన నేమి? ఈ మనో సంచలనముతో నూతన శకారంభమయినట్లున్నది.

అమా: ఈశుభసమయములో సుమంగళులు మంగళహారతులతో, మీకు విజయ కుంకుమ తీర్చనున్నారు. ప్రత్యేక సభా మంటపములో కళాకారులు మిమ్ము నృత్యగాన వినోదములతో కొలువనున్నారు. (నృత్యగాన వాద్యఘోషమందముగావిన్పించుచుండును.)

అశో: (అస్పష్టముగా) ... పతాక కెంతటి మూల్యము! (మెల్లగా) ఈనాటి సంజ చీకటులలో ఏలనో నా బాల్యస్మృతులు గోచరించుచున్నవి. ఏలనో నాలోని విజేతవాంఛితము కల్లోలపడుచున్నయది! నా చిన్నతనమున, తండ్రితాతల శౌర్య గాథలు "అమ్రి జాకు" గురువర్యులు వర్ణించు చుండువారు. మీకు జ్ఞప్తియున్నదా?

అమా: అవును...గురుదేవులు ప్రవచించు వేదాంతవిచారణకు విముఖత్వము ప్రదర్శించి,సాహసగాథలు విన కోరెడివారు...నిలువెల్ల శౌర్యపు పులకలు రేకెత్తు

చుండ- "శత్రువుల నిశ్శేషము గావించెద ......
విశ్వమునుజయించెద!..." అనిఉద్ఘాటించు మీబాల
మూర్తి, ఇప్పుడు కళ్ళకు కట్టినట్లున్నది.

అశో: (భారముగా) ఆచార్యులు వచించినదిసత్యము.(మృదు సంగీతము) ... ఏల హృదయాంతరాళమునుండి శోక గీతము పెల్లుబికి వెలువడుచున్నది ?...ఏహో ఆర్త నాదములు నా చుట్టును ప్రతిధ్వనించుటేల? ... ఆ వీణియ గుండె దర్పించెనా యనునట్లేల మందధ్వనుల వెలువరించుచున్నది ?...

అమా: స్వాగతధ్వానములు వినిపించుటలేదారాజేంద్రా?...

అశో: లేదు...(పరధ్యానములో)మన బౌద్ధభిక్షువులెచ్చట నుందురు ? ప్రధానీ...

అమా: కబురంపెదను...రణరంగముసామీప్యమున ప్రార్థన చేయుచుండుటను చూచితిని.

అశో: వలదు...నేనే వారిని దర్శింతును...

అమా: అకాలములో సమరభూమి పర్యటనమా? అలసట జెందితిరి. ఉపశమనార్థము పానీయముస్వీకరింపుడు...

అశో: వ్యర్థము... ఇవన్నియు అశాశ్వతము. (బయలుదేరి పోవును...)

అమా: (చప్పటులుచరచి)...ఎవరక్కడ ?...కాగడాలు వెలిగింపుడు ... ప్రభువును అనుగమింపుడు ......
(భటుల "బహుపరాక్" హెచ్చరికలు)



# ద్వితీయాంకము

[కళింగ రణరంగములో – క్షతగాత్రుల
ఆక్రందన ధ్వనులు...]

(అశోకుడు, అమాత్యుడు, సాహ్రిమ్ సేనాని)

అశో : ఎంత దారుణము? ... ఎంతటి చట్టబద్ధమైనఘోర హత్యాకాండ: ... వినజాలను ఈ దీనారావములను! వీక్షించజాల హృదయ విదార దృశ్యములను ; ఈ యుద్ధభూమి యందు నిలువజాల:. (సమీపమున మూలుగు) ఎవరీ అభాగ్య క్షత గాత్రుడు? . ఈ మణి మయమకుట మేల భూపతన మైనది?... సేనానీ ... కరదీపిక.

సాహ్రిమ్ : (పరిశీలించి)... దేవా...... ఈ ధీరుడు కళింగ భూపతి !...

కళింగరాజు ; (వ్యధతో)... దాహము !...

అశో : (బాధతో) పాపము శమియించుగాక!...... (భారముగా) నృపతీ...మీ కెంత దుర్గతి!...ఇదేజలము! ... సాహ్రిమ్ ... కళింగ శౌర్యధనుని పరిచర్యలకు ఆయత్తపడుము. ప్రధానీ! నిలువకుము. క్షతగాత్రులకు అత్యవసరవైద్యసహాయము.

క. రా : (ప్రత్యర్థి అశోకుడని గ్రహించి... ఆగ్రహముతో) ప్రత్యర్థి అశోకా !...

అశో : ఇప్పుడు కాదు...

క. రా. అశోకా...కళింగాధీశుడనైనను నీవైరినే... అస్వతంత్రుడనైన నాకు జీవితేచ్ఛయా ? దేశ ప్రతిష్ఠకొరకు అసువు లర్పించిన నా సామాన్యసైనికునివలె, నేనును వీరస్వర్గ మలంకరించెద...ఒక స్వతంత్ర రాజ్యముపై దురాక్రమణ జరుపు దోపిడి యిచ్చు జలస్వీకారము, ఆపత్సమయము నైనను తిరస్కారపాత్రము...నా దేశ ప్రజల ప్రతినిధిగా, దేహముకంటె దేశమునే ప్రేమింతు...

సాహ్రిమ్ : (వ్యంగ్యముగా) స్త్రీయ ప్రసంగము !..

అశో : దండయాత్రను రాజనీతిగ యెంచితిగాని మీపై వ్యక్తిగత వైరములేదు...దాహము తీర్చకొని నా మానవత్వమును సమర్థింపుడు.

క. రా: దుర్లభము!...

సాహ్రి: అనివార్య మృత్యుతల్పమున వ్యర్థవాదము, ప్రభూ... పరాజితులకు పౌరుషము తగ్గలేదు !...

క. రా : అంతియేకాదు, ఈ నా క్షతబాహువులు నేలవారిన ఖడ్గమును తళుకెత్తింప ఆరాట పడుచున్నవి...(ఖడ్గ మును స్వీకరించుటకు ప్రయత్నించి, వాలి పోవును) (భారముగా మహాతి) కళింగా) నీ ప్రియ పుత్రుడనై! చేనచేసి తరించితి...స్వేచ్ఛాజీవిని...దేవీ!...నీ తల్ప మున శాశ్వత విశ్రాంతి ... అఖండ శాంతి ... (మరణించును)

అశో : కళింగరాజా... మహాత్మా!... అంజలి...(మోక రిల్లి)మీ మహాదాదర్శమునకు మోకరిల్లుచున్నాడ!... స్వేచ్ఛ జీవితేచ్ఛను జయించినది. నా కల కరిగిపోవు చున్నది. కళింగకు అపజయములేదు. కళింగులు స్వేచ్ఛాజీవులు... ఏమి నా వితరణ?... చరిత్రకు వెచ్చించునది ఆడంబరము. హృదయము ఆశించునది అనురాగము... సాహ్రిమ్! ... ఈ నా సోదరునకు రాజమర్యాదలతో దహన సంస్కారము చేయుము. భిక్కూ...నన్ను అనుగ్రహింప వచ్చితివా?...

భిక్కూ : (ప్రవేశించి)... మీ విజయము పరాజయము!... రాజనీతి ధురంధరా! ... మీకు తెలియవలసినది తెలి యదు! ... (నవ్వి) విశ్వములో జయించునదియు, జయింపబడునదియులేవు...స్వేచ్ఛ సహజధర్మము... పీడనప్రకృతివిరుద్ధము ... మానవుడు జయింపవలసి నది......ఒక్కటియే... అదే మానసము...

అశో : నా కేదిదారి... భిక్కూ! ...

భిక్కూ : దృక్పథము అంతర్ముఖము కావలయు. అనతి కాల ములో నా పునరాగమనము—

అశో : సఖా...మరల ఎందుబోయెదవు ?

భిక్కూ : మీకు బాహ్యసమరము సమాప్తిఅయినది.కానినాకు అంతర సమరము ప్రారంభమైనది. పునర్దర్శనమున మిమ్ము సంపూర్ణముగ స్వీకరింతు...
(నిష్క్రమించును)

అశో : సుస్థిరత లేని భవిష్యత్తున కాశించి, ప్రస్తుతమును శోకమయము గావించు యుద్ధమును నమ్మితి. ఎంత వెఱ్ఱిని!... హా... లోభమా... నన్ను వీడిపొమ్ము... అంతర్హితసత్యమా! నన్ను స్వీకరింపుము. ఇంక నీవు ద్వేషాగ్నులు శేకెత్తించే భీకరమూర్తివి కాదు ... శాంతి చంద్రికలు వెదజల్లు దివ్యమూర్తివి...... ప్రధానీ! నా శాంతి సందేశమును చాటింపుము. ప్రజలకు స్వాతంత్ర్యము... అందరకు సమధర్మము. అనుచరులారా... భిక్షూ! ఆశీర్వాదము పొంది వచ్చెద.

సాహ్రి: రాజా!...నిరాయుధులు మీరు..ఒంటరిగా. ...

అశో. ఆయుధపాణులకు ఎట్టి దుర్గమదుర్గమందైనను ప్రమాదము ఉండవచ్చుగాని, నిరాయుధులకు సాటిలేని ఆత్మబలము, సహారక్షయై యుండును... ఆదేశముల నిర్వర్తింపుడు .. నా వెంట రావలదు... ఇది నా ఆజ్ఞ.

[ పోవును... ]

తెరవెనుక ఘోష:- అసతో మా సద్గమయ.

(కొంత దూరము పోయి...) ఈ ప్రళయ రాత్రిలో.., కదనభూమిలో .. నిర్భీతిగ సంచరించు వృద్ధమూర్తి ఎవరూ?.. భిక్షూ....

(ప్రవేశము వృద్ధజనని)

జనని : అయ్యా - నేనొక నిర్భాగ్యురాలను - నా ఏకైక పుత్రుని కళేబరముకొరకు గాలించుచున్నాను-అదియు

నిష్ఫలమైనది-నిర్జీవముతో గృహోన్ముఖినగుచుంటిని.

అశో : అయ్యో - జననీ___

జనని : బాలకా - నాలోని "జనని"యు గతించినది - నేనొక జీవన్మృతను-

అశో : మాతా- ఊరడిల్లుము-నేనును తల్లిని గోల్పోయిన విషాదమయుడను- కీర్తికాయుడైన నీ కుమారుని స్థానములో నిలిచి, మిమ్ము కొలిచెద- అనుగ్రహింతువేని ఇచ్చటనే నిలిచిపోయెద. ఆశీర్వదింపుమమ్మా!

జనని: కీర్తి! దానికొరకు ఏతల్లియు తనయుని వెచ్చింప జాలదు_ కీర్తి మిథ్య - వంచన - దీనుల అరణ్యరోదనదానికి వినిపించదు. నిర్జీవమైనది కీర్తి. మహనీయునివలె ప్రవచించితివిగాని విధివలె పుత్రశోకము అనివార్యము... అనుల్లంఘనీయము. వైభవోపేతుడగు అశోకు డెన్నడైనా ఊహింపగల్గునా ఈ వ్యథ ?...

అశో : కాదు...తల్లి! కఠినవాక్కులు పలుకదలచితివా?...

జనని : ఆ దుశ్శీలుడు అశోకునికి నేను వెరువను. నాకెదురుగా "దోషి"గా మాత్ర మతడు నిలువవలసియుండును..

అశో : (పరితప్తుడై) అశోకుని క్షమించు విశాలహృదయము మీకున్నది...

జనని : ఉదారశీలి!...ఉత్తమ భావన వేరు-తదాచరణ వేరు. ఆ దురాశాపరుడు, అశోకుడు ఏ నాటికైనను, పశ్చాత్తాపముచే పాప పరిహారార్థము, నా అపచార క్షమ

నార్థము సమస్తరాజ్యము త్యజించి...క్షమాభిక్ష వేడ గలడేని ... నిశ్చయము ... శమియింపదు ... నా ఆ వేదన...

అశో : ఘోర పరాజితుడు...నీ శిథిల మాతృహృదయమున కొంచవడదా కరుణ?

జనని : ప్రిచ్ఛన్నుడా... పవిత్రమైన మాతృహృదయమును సంస్మరించి నా అనురాగపాత్రుడవైతివి. జీవితాంత మున నాకు మిగిలియున్నది ఒక్క కోరిక మాత్రము...

అశో : (ఆత్రముగ) మాతా...మీ కోరిక నిర్వర్తించు భాగ్యము నైనను ప్రసాదింపుము...అశోకుడు చక్రవర్తి అయ్యు నాకు పరమమిత్రుడు. సన్నిహితుడు... ఎట్టి ఆదేశమునైన నిర్వర్తించెద.

జనని : ధర్మదూరులైన రాజులచే రాజరికము కళంకమైనది. రాజులకు మానసత్వము నశించినది. వారు అక్రమ నిర్ణయవిధాత లైరి...వారి రాజకీయపు ఎత్తులలో ప్రజలు చదరంగపు పావులు... ఎంత అక్రమము... ఇదంతయు నీకు నివేదించిన లాభ మేమి? ... గాలికి కొట్టుకొని పోవును...సరియే...నూతనుడా ... నడి రేయి...కాలాతీతము...ఈ తప్తహృదయను వీడి ఎందైన విశ్రమింపుము...పొమ్ము సత్వరముగ...

అశో : ఈ నూతనుడు విశ్రమించునది మీ పాదపద్మముల చెంతనే...

జనని : బిడ్డా...జీవమేల నాలో పునః ప్రవేశము చేయుచున్నది?... నీవు నా పుత్రుడవైతివా? (నిస్పృహతో) ఏమి నా దురాశ. అస్వతంత్ర కళింగను విడిచి దూర దేశమందు మనుము. లేనిచో నీవును అశోకుని సైనికుడవై ఏ దూరదేశముననో, వధింపబడెదవు...మరల మరల పుత్రశోకమేల నాకు ?

అశో : ఓ శ్రేయోభిలాషి...అటులైన పరదేశములు ద్రిమ్మరుచుందును...మీలో...నా అనువారు లేక స్మృతి కంటకవిచికలు మనోలోకమున తుఫానులు రేపుచుండ ఏకాంతమున నిరీక్షించుచుందును.

జనని: (దృఢముగ) నిరీక్షించను... అన్యాయమున ఊరక అసహాయనై ఆక్రందించను. నాకు పునర్జన్మ...

అశో : పునర్జన్మా ?...

జన : అవును...సుతుడు నేలకొరిగిన వార్తవిని మొదట స్తంభించితిని. గుండె బ్రద్దలగునని తలంచితి కాని, హతాశులైన మాతల విలాపముల విని నిర్విణ్ణురాలనైతిని...ప్రతీకారము పెల్లున ఉబికినది...అశోకుని..

అశో : అఖండశక్తిసంపన్నుడు కదా ?

జనని : అయిననేమి ? – నా సత్యవాణికి ఎదురు లేదు – ప్రతిధ్వనించెద, అశోకుని ముఖాముఖిని సందర్శించువంక ! నదులు, ఎడారులు, గిరులు లెక్కజేయను.

అశో : (హాస్యముగా) ఎందులకు ?...

జనని : వేచికొని యున్నాము... కొందరు తల్లులము – "రణరంగమునుండి పుత్రులు క్షేమముగ ఎప్పుడు తిరిగి వత్తురో" అని... మౌనముగ దురపిల్లుచుంటిమి.

వారి జీవముల నిష్కృతికి ? అశోకు నెదుర్కొని...
"మా జన్మహక్కును అపహరించిన హంతకా...?
యని గర్జించెద. ఆ పై బెబ్బులి చందమున వానిపై
బడి ప్రతిఘటించెద...

అశో : (దుర్భరుడై) భరింపజాల... దేవీ... లోకము చక్రి
వర్తిని చేసిన అశోక శరణార్థిని... శిక్షింపుము...
ఇదో సిద్ధము...

జనని : (అప్రతిభయై) హా... అశోక ప్రభూ !

అశో : (శోకరిల్లి) ... నా పరితాప బాష్పములు సము
ద్రమై లోకమును ముంచివేయును గాని... మీ తప్త
జ్వాలను సమీపించలేదు... నా కరవాల మిప్పుడు
ధర్మదాసమైనది... ఆగమింపుము. విశ్వజ్యోతి...
బుద్ధదేవా... నీ సందేశమే శరణు... నా మతము !
త్యాగీ... ప్రకటించుచున్నాడ, నా ఏకైక జీవితా
శయమును... విశ్వమునకు "అహింసయే పరమ
ధర్మము..."

తెర వెనుక నుండి బౌద్ధ భిక్షుల ఘోష }
బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

జనని : చరితార్థుడవైతివి... కుమారా, అశోకా...

(ప్రవేశము భిక్షు)

భిక్షు : మహీపాలా !... నీ ఆహ్వానమునకు అతీతుండనై
నా సహాయార్థికునిగ నిన్ను స్వీకరింప వచ్చితిని ...

అశో : బౌద్ధాచార్యా... పునరాగమించితిరా ?... గురూ! అనుగమించెద మీ గమ్యమునకు.

భిక్షు : జ్ఞానీ... నా సహయాత్రికా... పునీతమైన శాంతి ఘోషతో నీ జన్మ తరించెను... ఆహా ఈ జగ మెంత ఆనందమయమై శుభప్రదముగా గోచరించుచున్నది ?

అశో : నేడుకదా నన్ను పరిపూర్ణముగ స్వీకరించితిరి... నా కెంతటి సిద్ధి ? నా జన్మం బెంత ధన్యమయ్యెను!

భిక్షు : నా సఖా! శాంతి పథమున పయనింపుము.



# పుష్పాంజలి

**పాత్రలు :—**

* కవి    * చీమ    * పుష్ప

కవి : ఎంతో శోభాయమానంగావుంది నా జీవిప్రకృతి... ఈ సౌందర్య సందేశం మానవుల్ని ఇంకా దైవ స్వరూపుల్ని చేయదేమో అనిపిస్తుంది. ఆకులో ఆకునై పూవులో పూవునై వాటితో తాదాత్మ్యం పొందితే ?... ఎందుకు వరాలూ స్వర్గాలూనూ... అదిగో దేవత – ఆరాధించవేం? అన్నట్లు చూస్తోంది నా వంక. ఈ లోకాలనే మరచే పరిశాంతతను పొందమని ప్రబోధిస్తుంది. వస్తున్నానమ్మా, నిన్ను పూజించడానికేగా పుట్టింది... అలా చూస్తావేం ? పూజాద్రవ్యాలు లేవనా ? నీకు చక్కటి పూలు కావాలని కదూ ?... సరే...

... ... ...

—కవి పూచెట్టు సమీపించి, పుష్పను కోయబోతున్నాడు. చీమ పుష్ప అంచున దాగి కుట్టింది—

చీమ : కవీ... కవీ ! ఆగు.

కవి : అబ్బా ఎలా కుట్టేశావు చీమ ! చెయ్యి కందిపోయేట్టుగా...

చీమ : క్షమించు. సఖా! నొప్పి కలిగించా ? నా చిన్ని కుసుమను నా నుంచి ఎడతీస్తావా ? అందుకనే మేం ఒకళ్ళం లేంది ఒకళ్ళం జీవించలేం...

కవి : అయితే నీ ఉద్దేశ్యం ?

చీమ : మా నేస్తం వేరు చేయకు... నీ ఇనపహస్తాల్లో ఎలా వణికిపోతోందో చూడు ఆ పువ్వు? పూ చెల్లీ! భయపడకమ్మా- నా ప్రాణం వుండగా నిన్ను వదలను...

కవి : అబ్బో చీమా! ఎంత దర్పంగా చెపుతున్నావు .... నీ బలంతో ఎంతనుందిని ఎదిరించగలవేం ?

చీమ : కవీ.... నువ్వూ చదువుకొన్నావు...స్వతంత్రుడివి కానిసయని బలహీనయని అరక్షురాలనికదూ నీధీమా? ఈ బలంలో లేదు బలం .... ఈ నైతికబలంముందు ఏ లోకం నిలవలేదు... నీ కన్న బలవంతుడి చేతిలో నువ్వెంత ఆలోచించు.... జీవించి నిర్ణయించుకునే హక్కు మాకు మటుకు లేదా ?

కవి : మరి దేవతా పూజ ఆగిపోవలసిందేనా ?

చీమ : నీ హృదయకమలం అర్పించు-అది శాశ్వతం. నీ కీ పూలు కావాలిసొస్తే, మా పూజకు ఏం కావాలి ? ఒక్క భౌతిక బలమేనా నీ సమాధానం.

కవి : పువ్వుకి పూజ ద్వారా సాఫల్యం కలుగుతుంది.

చీమ : నీ సిద్ధాంతాలు నీ స్వార్థానికి అన్వయిస్తాయ్. నీ సిద్ధాంతం సృష్టిజాలాని కంతా వర్తిస్తే దాని సత్యాదర్శపు విలువ సుస్థిరంగా వుంటుంది.

కవి : నిజం చీమా ... నీ త్యాగంలో సౌందర్యం గోచరిస్తోంది.... నీ ప్రేమ బలిదానం నాకో సందేశం—

చీమ : కవీ! ధన్యురాల్ని. పూ చెల్లి ఆనందంతో వూగుతోంది... కన్న పూవా! కవికి ఏం చెప్పమంటావు?

కవి : మానవుల్లో కూడా నేటికి మంచి వుందని తెలుసుకుందిట .... తానేమో నిరంతరం సౌరభాన్ని లోకానికి కానుకగా ఇస్తూనే నుందిట. సౌందర్యాను

భూమి తన రూపు ద్వారా కలగజేస్తునే వుంటదట ....
తుమ్మెదను తియ్యని తేనె యిస్తూనే వుంటదట- కాని, తన తల్లి ఒడిలో నిద్రపోవడం ఏ మానవుడికి యిష్టం లేదుట ....

కవి : అన్నీ యదార్థాలే— వీటినిగురించి మానవుడు ఆలోచించలేకున్నాడు రానురాను భౌతికావసరాలతో, తాత్త్వికజ్ఞానం విస్మరిస్తున్నాడు... స్వర్గం యిక్కడ వుంది ఆచరిస్తే... ఎందుకమ్మా పూచెల్లి తలవంచుతోంది... ?

చీమ : గుండెలో సూదులుగుచ్చి ఊలుదారాలతో కట్టి ముచ్చటముడుల్లో అలంకరించే తమ్ముని చూసి లోకం హర్షిస్తుంటే, ఆ బాధని అపహాస్యాన్ని, భరించటం దుర్భరంగా వుంటుంది...

కవి : విజ్ఞానం అజ్ఞాతంగా వుంటుంది... సత్యాకృషి ప్రతి విషయం తరచి పరిశోధించాలి... సౌకర్యం సత్యం ప్రతి సమస్యలోను పోరాటం సల్పుతాయి...మానవుడి నైతికబలం విజయం నిర్ణయించాలి. పూచెల్లి రెక్కలు అల్లాడిస్తుంది. ఏమంటుందేం ?...

చీమ : వచ్చిన తుమ్మెదని 'పనివుంది-తరువాత' రా అని పంపింది...మాకు...ఎంతటి అతిథిసత్కారమో...

కవి : చెప్పమ్మా అన్నీ వినిపోతాను.

చీమ : తమరక్తాన్ని అత్తరులో చేర్చి ఎలామురిసిపోతారో మానవులు అని ఏడుస్తోంది...

కవి : మానవదౌర్భల్యం... అనేక విధాలుగా పతనం చెందుతోంది... దాన్ని అర్థంచేసికొని అరికట్టడంలో వుంది...జీవన సాఫల్యం...

చీమ : పరీక్ష-పై... పూలు చల్లుకోని తొక్క-వేస్తూ, బయట పారవేసేవారికి, తమవిజ్ఞాపన తెలియజెయ్యమని వేడుకొంటోంది.

కవి : కవికి ఒకధర్మం వుంది... ఆ ధర్మంకోసం ఆతడు మరణాన్నైనా ఎదుర్కొంటాడు. నీ బాధని నా గానంలో, నీ వాక్కుని నా పాటలో ప్రతిధ్వనింపజేస్తానమ్మా.

చీమ : కవీ! నీలోంచి బుద్ధులు బయలుదేరి అశాంతితో అల్లల్లాడే ఈ కల్లోల ప్రపంచానికి శాంతి భిక్షని ప్రసాదించేట్లు చెయ్యి...

కవి : ధన్యుణ్ని...నీ త్యాగప్రేమ, పుష్ప విశ్వప్రేమ నా ఉద్యమ నిర్మాతలు.

చీమ : కవీ! రిక్త హస్తాలతో వనదేవత దగ్గరికిపో......మా కన్నీటి కణాలనే కానుకగా అర్పించు.

కవి : నావి రిక్త హస్తాలయితేనేం? ఈ నిండుగుండెకు ఇంక కరువు లేదు...నేను అర్పించే కుసుమాలు వాడిపోవు.. వాటి సౌరభం తగ్గిపోదు...ఈపుష్పాంజలి శాశ్వతము.

చీమ : విశ్వనిర్మాతా...నిజము. ఈ లోకం ఒకనాడు నీకు శరణుజొస్తుంది...నీ శాంతి సందేశం మానవాళికి వర ప్రసాదం...నీదే గెలుపు...ఎప్పటికైనా...

కవి : నా దేవత నేడు సంతోషిస్తుంది... ఆ పెదవులపై ఉద్భవించే చిరునవ్వు...మసిపోదు!...పోతున్నానమ్మా సెలవు...

చీమ : ఈ మా ప్రేమాంజలి స్వీకరించు కవీ-చిరంజీవివై.

32

# మేవాడ పతనం

పాత్రలు :

| | | |
|---|---|---|
| అమర సింహుడు | : | మేవాడ రాజు |
| గోవింద సింహుడు | : | మేవాడ సర్దారు, సేనాని |
| అజిత సింహుడు | : | గోవిందసింహుని కుమారుడు |
| కల్యాణి | : | గోవిందసింహుని కూతురు |
| మానసి | : | అమరసింహుని పత్ని |
| మహబత్ ఖాన్ | : | రాజపుత్రులను వీడిన మొగలు సేనాని. |

# మేవాడ పతనం

## ఉపశ్రుతి

అమర సింహుడు, మేవాడని ఏలుతున్న కాలంలో తురుష్కుల దాడికి మేవాడ గురి అయింది. రణసింహుడనే రాజపుత్రుని, అమరసింహుని జ్ఞాతిని, రాజ్య బహిష్కారం చెయ్యబడిన వానిని, గోవిందసింహుడు ఔదార్యంతో చేర దీస్తాడు. ఆ సమయంలో కళ్యాణి అతడిని ప్రేమిస్తుంది. కాని తురుష్కులు రాజ్య కాంక్షని రెచ్చగొట్టి తమ మతంలో కలుపుకొని రణసింహుని 'మహాబత్ ఖాన్'ని చేస్తారు. మహాబత్ ఖాన్ విశ్వాస ఘాతకుడై పవిత్ర కళ్యాణి ప్రేమను పరిత్యజించి మాతృదేశం; మేవాడ పైకి దండెత్తుతాడు.

ఆనాటి ఘోర సమరంలో మేవాడ వీరులు అరవీర భయంకరులై వీరోచితంగా పోరాడారు. మేవాడ పతనం కావచ్చు. కాని చరిత్రలో ఆ వీరుల మాతృదేశ పుణ్య, పవిత్ర సంస్మరణకి పతనం లేదు ఎప్పుడూ!

[గోవింద సింహుని భవనము. నిశీధ సమయము. అజిత సింహుడు, గోవింద సింహుడు]

గో : (వేదనతో) నాయనా! ఇవ్వాళ ఎందుకో నా ఆందోళనకి మేర లేకుండా వుంది. ఎన్ని రాత్రులు నిద్ర లేకుండా వేదనతో గడపాలో కదా.

అ : తండ్రీ! ఇంత అనాలోచితంగా రణసింహుడు వెళ్ళి పోతాడని కలగన్నామా? అయినా ఎక్కడికి వెళ్ళాడో? (నిదానంగా) ఒకవేళ వేటకని వెళ్ళి ఆ వుత్సాహంలో ఇల్లు మరచి పోలేదు కద!

గో : అది సాధ్యం కాకపోయినా ఇన్ని రోజులు వుండటం అసంభవంగా తోస్తుంది. ఒకవేళ.

అ : అవును. ఒకవేళ ఏ పులివాతనన్నా బడ్డాడేమో?

గో : (ఆత్రుతతో) అయ్యో రణసింహా! కన్న కుమారుడిలా పెంచిన నిన్ను పులివాత బడ్డావని అనుకోడానికి ఒళ్ళు పులకరిస్తోందయ్యా?

అ : అదికాక ఇంకో కారణం కూడా లేకపోలేదు. ఎంత చెడ్డా అమరసింహుడి పినతండ్రి కొడుకే వాడు. నేను చేరదీయ వద్దని ఎంత ప్రార్థించినా విన్నారు కాదు. చివరకి.

గో : నేను రక్షణ యిచ్చాక ప్రాణాలైనా లెక్క పెట్టనని తెలియదా అజిత్! ఏ కుతంత్రాన్నైనా అమరసింహుడు తలపెట్టాడంటే నేను రాజునైనా కత్తితో ఎదుర్కొంటాను.

అ : రాజభక్తి కంటేనా నాన్నగారూ !

గో : నాయనా, ఈ ముసలి వాడికి రాజభక్తికంటే దైవ భక్తి ఎక్కువే. కాకపోతే ఎవరో జ్యోతిష్కుడు, రణసింహుడు తన రాజ్యవినాశక కారుడౌతాడని చెప్పిన నెపంతో వెళ్ళగొట్ట బడిన వాడు నా దగ్గర కెలా రాగలుగుతాడు ! ....

అ : దీనికితోడు కళ్యాణి పరిస్థితి మరీ ఘోరంగా వుంది నాన్నా. నిద్రాహారాలు మాని ఒంటరిగా ఏడుస్తూ కూర్చుంటూంది. ఎవ్వరితోనూ మాట్లాడనన్నా మాట్లాడదు.

గో : (ఆశ్చర్యంగా) నిజంగానా అజిత్, నా విచారంలో దాని సంగతి మరిచిపోయాను.

[వెక్కి వెక్కి ఏడుస్తున్న చప్పుడు]

అ : అదిగో విన్నారా, కల్యాణే.... మీరు ఓదార్చకపోతే అది బ్రతకదేమో అనిపిస్తుంది.

గో : ఒక్కసారి దాన్ని పలకరిద్దాం రానాయనా.

[కళ్యాణి మందిరంలో]

గో : (ఆశ్చర్యంగా) అమ్మాయ్ కళ్యాణీ నేను చూస్తుంది నిన్నేనా ?

అ : చెల్లీ ! నువ్వింతగా బెంగపడితే నాన్నగార్ని వ్యధ పెట్టిందానివవుతావు. సర్దార్ గోవింద సింహుని కుమార్తె ఇంత పిరికిగుండెదని అంటే ఎంత అవమానం?

కల్యా: నన్ను క్షమించు నాన్నా.

గో : ఇలా కృశించి పోవడం శ్రేయస్కరం కాదమ్మా. సైనికుల్ని, గూఢచారుల్ని పెట్టి అతని జాడ కోసం చేసే ప్రయత్నాలు నీకు తెలియువివా చెప్పు! నిన్న మళ్ళీ అయిదుగుర్ని పంపించాను. ఇంక కాసేపటికి వివరాలు తెలుస్తాయ్.

కల్యా (దుఃఖిస్తూ) నామీద ఇంత ప్రేమగా వుంటూ ఒక్క మాటన్నా చెప్పకుండా పోయాడు. మళ్ళీ అవుపిస్తాడో అవుపించడో ?

సేవ : (ప్రభూ)

గో : ఎవరో కనుక్కో

ఎ : గూఢచారి నాయకుడు.

గో : (ఆత్రుతతో) ఏం జరిగిందో చెప్పు.

గూఢ; ఏం చెప్పను ప్రభూ? రణసింహుడు ఇంక మన నుండి శాశ్వతంగా విడిపోయాడు.

గో : ఏమైంది?... త్వరగా.

గూఢ: ప్రభూ, ఇలా చెప్పాల్సి వచ్చినందుకు క్షమించండి. మతధికారాన్నే కాక విశ్వాసాన్ని గూడా విస్మరించారు.

గో : ఏమిటేమిటి ? విశదీకరించు.

గూఢ: పదవీ కాంక్షలో పడి హిందూ మతాన్ని తిరస్కరించి మన శత్రువు సలీం అండ చేరాడు. ఇప్పుడు

రణసింహుడు మహాబత్ ఖాను, గోవింద సింహుని పుత్రతుల్యుడు కాడు. శత్రుసైన్య సేనాని.

కల్యా: గోవింద సింహుడా ! విజయా !!

గో : గూఢచారీ, పరిస్థితి విషమించింది. నువ్వు తగిన సిబ్బందితో వెళ్ళి వివరాలు సేకరించు.

గూఢ: చిత్తం ప్రభూ.

అ : ఛీ....రణసింహా ! ఇంత నీచుడ వనుకోలేదు కుక్క కన్నా విశ్వాసముంటుంది.

కల్యా: (విషాదంగా) ఎంత హృదయం లేనివాడివి. రాజపుత్ర రక్తం నీలో ప్రవహిస్తోందా ? ఒకనాడు చరిత్రలో నువ్వు పొందిన పతనావస్థను గురించి ఎంత పరితపిస్తావో కదా.

గో : (సంభ్రమంతో) ఇది కలా, మాయా ? నేను మతి విహీనుణ్ణయి పోతున్నాను. నాతల తిరిగి పోతోంది-అబ్బా.

అ : (కత్తిలాగిన చప్పుడు) ఇదే నా ప్రతిజ్ఞ, రణసింహా నిన్ను కత్తితో ఎదుర్కొంటాను. నీ అత్యాచారాన్ని సాధిస్తాను.

గో : (పౌరుషంగా) నువ్వు కాదు సాధించాల్సింది. ఈ గోవింద సింహుడే. ఈ లోకంలో రెండు ఆశయాలకి స్థానంలేదు. ఒక్క వరలో రెండు కత్తులా ?

కల్యా: నాన్నా, దగ్ధ హృదయంతో యీ యింట్లో ఒక్క క్షణంకూడా ఉండలేను. ముఖాముఖిని తేల్చుకుంటాను.

అ : చెల్లీ! తొందర పడబోకు. ఎలాగో యుద్ధంలో మేమున్నాంగా యెదుర్కోటానికి.

కల్యా: లేదు అన్నయ్యా. (గాద్గదికంగా) నాకు చేసిన ప్రమాణాన్ని మరచి పొయ్యాడేమో కనుక్కుంటా.

గో : అమ్మా నా వికల హృదయాన్ని మరింత క్షోభ పెట్టకు.

అ : నువ్వొక్క దానివి ఏం చెయ్యగలవని ?

కల్యా: నన్ను ఏ సేనలూ ఆపలేవు. నా సత్యాదర్శం ముందర అవి తృణప్రాయాలు.

గో : ఆగు. అనుభవం లేని దానివి. ఎక్కడికని ! ఏం చేద్దామని ?

కల్యా: నా బొందిలో ప్రాణమున్నంత వరకూ నా నిశ్చయానికి తిరుగు లేదు. మన్నించండి. నాకు శాంతి ప్రసాదించండి.

అ : చెల్లీ, చెలీ!

కల్యా: (భయంతో) ఈ చీకట్లో ఉండలేను. అదుగో వెలుగు. (వెళ్ళిపోతుంది)

అ : ఎవరక్కడ ? త్వరగా వైద్యుణ్ణి పిలవనంపండి. ఇదిగో బలేదేవ్, నాయనగార్ని ఇలా పట్టుకో. కల్యాణీ ఎక్కడికి వెళ్ళావు? వస్తున్నా. (వెళతాడు)

## 2

[అమరసింహుని దర్బారు–ఉదయము–అమర సింహుడు, అజితసింహుడు, గోవింద సింహుడు )

అమ : గోవింద సింహా, నేను చెప్పితే విన్నావుకావు. ఈ పక్కలోని బల్లెంతో నేను వేగలేక కదా నేను పరిత్యజించింది. ఏదో ఘోర విపత్తు తలపెడతాడని అనుకుంటూనే యున్నాను.

అ : తండ్రిగారు, చెవులో యిల్లు కట్టుకుని ఎంత ఘోష పెట్టినా విన్నారు కారు ప్రభూ ఇంకేం కానున్నదో!

అమ ; గోవింద్, అయిందేదో అయింది. ఇప్పుడు కార్యాచరణకు పూనుకోవాలి.

గో : నిజమే ప్రభూ, ఇదే మొదటిసారిగా పరాజయాన్ని అంగీకరిస్తున్నాను.

అ : రణసింహుడు మతం మార్చుకోవటంలో కారణమేమిటో.

అమ : ముంజేతి కంకణానికి అద్దమెందుకు! పదవీ కాంక్ష.

అ : ఇంక చెల్లెలు కల్యాణి సంగతి చూస్తే గుండె తరుక్కుపోతుంది.

గో : మళ్ళీ యీ నాటికి క త్తి తీయ్యాల్సిన అవసరం వచ్చింది. లోకమంతా ఎదురు తిరిగినా నా దృఢ నిశ్చయాన్ని సడలించలేరు.

అమ : దేశంలో పరిస్థితులు బాగుండలేదు. మన రాజ పుత్రుల్లో ఐకమత్యత పూర్తిగా నశించింది - వర్గ కలహాలు, మాటపట్టింపులూ ఎక్కువయిపోయి శత్రుత్వం దేశంలో పెరిగి పోయింది.

అ : మనలోని యీ బలహీనతని ఆధారం చేసుకొని, రెండు పిల్లుల మధ్య కోతివాటంగా, తురుష్కులు పన్నాగాలు పన్నుతున్నారు - మన రాజ్యానికి పరీక్షా సమయం వచ్చింది.

అమ : మనం అంతా చాలా ప్రమత్తతతో ఉండాలి. ప్రతీహారి.

[చారుడు ప్రవేశం.]

చా : ప్రభూ, సర్వనాశనం.

అమ : ఏమిటీ ?

చా : ఇంకేముందీ ? సలీము దక్షిణ పార్శ్వమున ఎదు రొక్కని సేనల్ని రెండుభాగాలుగా రాజధాని మీాదికి పంపిస్తున్నాడు. ఆలస్యమైతే మనం ఖైదీలయ్యే అవకాశం కూడా ఉంది ప్రభూ.

గో : మంచిది. వెదుకపోయిన తీగె కాలికి తగిలినట్లయింది. అజిత సింహా! ఇది ఎంత ఆనంద సమయం ! ఈ

పరితాప హృదయానికి ఎటువంటి అవకాశం- ప్రభూ ఇంక ఒక్క క్షణం యిక్కడ ఉండలేను.

అమ : గోవింద్ ! ఈ దేశరక్షణభారం నీ భుజస్కంధాల మీద ఉంది. (మోకరిల్లి) ఇదిగో నేనూ నీ ముందర ఒక సైనికుణ్ణే ఆజ్ఞాపించు.

గో : ఎంతమాట! నీ తండ్రి ప్రతాప సింహుడు కాలంనుంచీ యీ మేవాడ రాజ్య ప్రతిష్ఠే నా బహిఃప్రాణంగా ఎంచుకున్నాను. అజిత్, నువ్వూ అమరసింహుడూ కలసి పర్వత శ్రేణి చుట్టూ తిరిగి వెనుక వాటుగా సలీం సైన్యాన్ని ఎదుర్కోండి. నేనూ భీమపాలుడూ మహాబత్ ఖాను సైన్యాన్ని ఎదుర్కొంటాం. ఎవ రక్కడ. ఇదే నా ఆజ్ఞ! సైన్యాన్ని సిద్ధ పరచు.

అమ : సెలవు గోవింద సింహా-నీ ఋణం తీర్చుకోలేనేమో, ఇదే నా ప్రణామము. నన్ను ఆశీర్వదించు.

గో : ఔను నాయనా, నువ్వు నాకు పుత్రతుల్యుడవే. భారతావనిలో రాజపుత్ర పరాక్రమానికి నువ్వు పట్టుకొమ్మవు ఇదే నా అభిలాష, ఆశీర్వచనము వెళ్ళు అజిత్, ఇంకా ఇక్కడున్నావేం?

అ : నాన్నగారూ! మీకు కీర్తి ప్రతిష్ఠలు తేవడానికి నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను. ప్రణామము.

గో : మంచిది అజిత్ ! నీకు జయం కలుగు గాక !
(వెడతాడు)

అ : (వ్యథతో) అవును కాని ఎలా. వెళ్ళను మానసిని ! చూడండి (ప్రవేశం మానసి!)

మా : రాజకుమారులకు శుభాభివందనములు.

అ : మంచిది - రాజకుమారి ! నీ దగ్గర వీడ్కోలుకోసం ఎదురు చూస్తున్నాను.

మా : హృదయ పూర్వకంగావీడ్కోలివ్వడానికి వచ్చాను! కాని వీడ్కోలివ్వడ మేమిటి ? నేనగా యుద్ధ రంగానికి వస్తుంటే!

అ : నువ్వు! నువ్వా ? (నవ్వి) ఎప్పుడనా్న గుర్రమనా్న ఎక్కావా ?

మా : ఎక్కక పోవచ్చుగాక. కాని మీరు వెడితే నేను యిక్కడ వుండలేను. నాలో పొంగి పొరలే యీ ఉద్రేకంతో నేను చెయ్యోంది ఏముంది ?

అ : (నిట్టూర్పుతో) మానసీ !

మా : నిర్భయంగా నాకు సెలవియ్యండి. మేవాడ రాజ్యలక్ష్మికి సేవ చెయ్యనీయండి. నేను వీరపత్నినికదా! శెలవు. (వెళుతుంది.)

అ : మానసీ వెళ్ళిపోయావా ! అవును. (నిస్పృహాలో) వెళ్ళాలిసిందే. చెల్లీ, కల్యాణి ! నువ్వు అప్పుడు జంకకుండా యెందుకు వెళ్ళావో అర్థమయిందమ్మా.
[వెడతాడు]

# 3

[ఇంటినుంచి వెళ్ళిపోయిన కల్యాణి తనతోటి కొంత మంది స్త్రీలను చేర్చి బలమైన చిన్న సైన్యాన్ని తయారు చేస్తూ దేశభక్తి పురికొల్పే గీతాలు పాడుతూ తిరుగుతుం టుంది. దేశంలో యుద్ధం బయల్దేరిందని తెలిసి తురుష్క సైన్యాన్ని ఎదుర్కోటానికి ఆయత్తపడుతూ త్రోవలో యుద్ధానికి వెళుతున్న మానసిని కలుసుకుంటుంది]

కల్యా: (ఆనందముతో) ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు! ఇల్లు విడిచి పెట్టింతర్వాత ఇదే మొదటి నేత్రానందం నాకు. నువ్వు కూడా యుద్ధానికా! ఏమిటా వేషం.

మా : నిజం కల్యాణీ, ఈ యుద్ధంలో మనం పురుషుల కే మాత్రం తీసిపోమని ఋజువు చెయ్యాలి. కాని యీ యుద్ధంలో యీ దుర్భర సమయంలో రణసింహు డికి శత్రువుగా నువ్వు యెలా పోట్లాడుతావో.

కల్యా: నా ప్రేమ వాస్తవికాన్ని విస్మరించేటంత స్వార్థ మైంది కాదు.

మా : కాని, స్త్రీప్రేమకు హద్దులు లేవు. నీ నిశ్చయం. నీ కార్య సాధనకి తోడ్పడితే నీ విజయం, ప్రతిష్టా నిలుస్తాయ్. ఈనాడు రణసింహుడు మతద్రోహియైన మహబత్ ఖాన్

పేరుతో చేస్తున్న అత్యాచారాలు పూర్వం రాక్షస గాథల్ని జ్ఞప్తికి తెస్తున్నయ్.

కల్యా: అత్యాచారాలా ?

మా : ఒక టేమిటి? గ్రామాల్ని దోచటం, తగలపెట్టడం, స్త్రీలని బాధించటం, పురుషుల్ని హింసించడం యీ అల్లకల్లోలాలు విని రక్తం పొంగిపోయిందంటే నమ్మ.

కల్యా: మానసీ చాలు. యీ పరాభవాగ్ని నన్ను నిలువునా దహించి వేస్తోంది ఇంక నే చలించదలుచుకో లేదు. స్త్రీ పగ రుచి ఆ ఖాన్‌కి తెలియబరిచి మరీ చస్తాను.

[రణ కోలాహలము. సేవకుడు ప్రవేశం]

సేవ : అమ్మా! ప్రమాదం. అజిత సింహ ప్రభువులు శత్రువ్యూహంలో చిక్కబడ్డారు. ఒంటరివారై పోయారు.

కల్యా:
మా : యెక్కడ ? యెటువైపు ?

సేవ : అదిగో ఆ కొండ వెనుక భాగంలో.

కల్యా : ఇంక ఆలోచించడానికి వ్యవధి లేదు. పద మానసీ.

మా : నాకెందుకో భయం వేస్తోంది కల్యాణీ! అయ్యో.

కల్యా: విత ర్కాలెందుకు మానసీ? పరుగెత్తించు గుఱ్ఱాన్ని.

# 4

[ఆ రాత్రి. మహాబత్ ఖాన్ డేరా. నిద్ర పట్టకుండా తిరుగుతూంటాడు. కల్యాణి కత్తితో హఠాత్తుగా ప్రవేశిస్తుంది.]

మహా: ఆఁ ఆ ఆగు. ఎవరు ? కల్యాణీ!

కల్యా: ఛీ ! నీచుడా. నిద్రలో దొర్లుతున్నపుడే చంపేద్దామనుకున్నాను. కాని రాజపుత్ర గౌరవానికి విరుద్ధం.

మహా: కల్యాణీ! ఎన్నాళ్ళయింది నిన్ను చూసి! నువ్వు నా పాలిటి మృత్యుదేవతవి గావు. సౌందర్య దేవతవి. గతాన్ని మరచిపో రా.

కల్యా: నీ అంత అధముణ్ణి చూడలేదు. ఇన్నాళ్ళు, నిన్ను చంపితే నా జీవితం సార్థకం చెందుతుంది అనుకున్నాను. ఇప్పుడు నీ రక్తంతో నా కత్తిని మలిన పరచ దలచుకోలేదు.

మహా: (కోపంతో) నాకు నచ్చిన అభిప్రాయం నీకు నచ్చాలని లేదు. నాకు వ్యక్తిత్వం వుంది. నిన్ను ఇప్పుడు నేను ఏమి చేసినా అడిగేదెవరు ? ఒక్క క్షణంలో నీ ప్రగల్భాల్ని అరికట్టవచ్చు. కాని ....

కల్యా: తండ్రిగారికి మతానికి, దేశానికి నువ్వు ఎంత ఘోరం చేశావు, పాపీ! ఏ తండ్రి నీకు రణవిద్య నేర్పాడో ఆయన్నే చంప చూస్తున్నావా? దేశానికీ లోకంలో శిక్ష విధించతగింది వుందా?

[రణకోలాహలం. ప్రవేశం గోవిందసింహుడు]

గో : (గర్జిస్తూ) వుంది. వుంది.

మహ: గోవింద సింహా, వచ్చావా? పులి గుహలో దూర్తావా? కాచుకో.

కల్యా: ఆఁ, నాన్నగారూ ఆగండి నేనున్నానుగా.

గో : ఆ మహాద్భాగ్యం నాకే కలగనీ. ఇదేం స్త్రీలను బంధించటం అనుకున్నావా మహబత్ ఖాన్?

మహ: కల్యాణీ (రోషంతో) అడ్డం తొలగు.

కల్యా: ఆగు రణసింహా! ఆగండి నాన్నగారూ.

గో : ఇంకెక్కడి ఆగడం (తప్పుకో కల్యాణీ అన్న గర్జన)

[కత్తుల రణగొణ ధ్వని, కల్యాణి ఆర్తనాదం. అమ్మా]

గో :
మహ: కల్యాణీ....

కల్యా: (బాధతో) శెలవు, నాన్నగారూ.

గో : అమ్మా వాడి కరకు ఖడ్గం మళ్ళీ నిన్ను పొడిచిందా తల్లీ! ఛీ పాపీ నీ రక్తంతో నా వీరమాతకీ సింధూరము పెట్టనీ.

[కత్తుల రణగొణ ధ్వని.]

మహా: (రొప్పుతూ) గోవిందా, ఆఖరుసారిగా లొంగిపొమ్మని కోరుతున్నాను.

గో : (కఠినంగా) మేవాడకు తప్ప ఈ శిరస్సు ఎవ్వరికీ ఒగ్గదు. (కత్తుల ధ్వని)

గో : నీ కత్తి విరిగిపోయింది తీసుకో దీన్ని. అధర్మయుద్ధం ఎరుగడు గోవింద సింహుడు.

మహా: సెభాష్. ఈ దెబ్బ కాచుకో. (అబ్బ అన్న శబ్దం)

గో : ఛీఛీ ఈ కుప్పిగంతులు నా ముందరా! అయినా నీవంటి అధమాధముడితో యుద్ధం చెయ్యడం నాకు అవమానకరమే. అదిగో మేవాడ నిన్ను బలి కోరుతున్నది. ఇదే, ఇదే.

[గోవింద సింహుడి వీరగర్జన. మేవాడ రాజ్యలక్ష్మీ. అబ్బా అన్న శబ్దం.]

మహాబత్ ఖాన్, ఓ మొగలు సేనానీ, నువ్వేనా నా పాదాలముందర దీనంగార క్తంకక్కుతూ మరణిస్తున్నది. తల్లీ మేవాడ రాజ్యలక్ష్మీ, నీ చేతుల్లో పెరిగి నీ గౌరవం కోసం సర్వం త్యాగం చేశాను. కొడుకు కుమార్తెల రుధిరాన్ని నీకు సింధూరమలదెను. ఈ శిరస్సు నీ పాదముల ముందర నోపి చివరిసారిగా త్యాగం చేస్తున్నాను.

సర్దార్ గోవింద సింహుడికి జై.

[ప్రవేశం అమర సింహుడు]

ఎవరది ? అమరసింహా, నువ్వేనా ! నువ్వు. హు! ఇదిగో నాయనా, నా కాలం తీరిపోయింది. నా ధర్మం నెర

వేర్చాను. చచ్చినా బ్రతికినా మేవాడ గౌరవం నిలబెట్టు. ఇదే నా సందేశం.

[గోవింద సింహుడు మరణిస్తాడు]

అమర : హా, తండ్రీ వీరమరణం పొందారా ? మేవాడ ప్రజలనీ నన్నూ అనాథులచేసి స్వర్గధామం చేరారా ఇదిగో నీ ముద్దు కూతురు కల్యాణి. రణసింహుడు మొండాలతో మీ ముందర పడటం చూసి ఎంత క్షోభించారో కదా ? ఓ అమర వీరా ! నీ రాజ్య భక్తిని త్యాగదీక్ష నిన్నూ రాజ పుత్రుల శౌర్యాం చిహ్నాన్నిగా చేసినవి. మీరే మేవాడ! మేవాడే మీరు!

[ప్రవేశం చారుడు.]

చారుడు : ప్రభూ సర్వం ముగిసింది అజిత సింహులు వ్యూహంలో చిక్కుకొని వీరమరణం చెందారు. మానసి శత్రుసేనల చెండాడుతూ అజిత సింహుని రక్షించడానికి వ్యూహంలో జొరబడి గాయపడింది. సేనలు ధైర్యంవదలి పోయి చెల్లా చెదరై పోతున్నవి.

అమర : (విరక్తితో) తండ్రీ, గోవిందసింహా! మీ సందేశం ఇంకా నా కర్ణ పుటాల్లో ప్రతిధ్వనిస్తూనే వుంది. మేవాడ గౌరవం నిలబెట్టు ఓ మహావీరా, ఆశీర్వదించండి. నా భగ్న హృదయానికి నిశ్చయత్వాన్ని ప్రసాదించండి.

[గుఱ్ఱాన్ని దౌడు తీయించి వీరోచితంగా]

రాజ పుత్రులారా! విజయమో వీర స్వర్గమో వీర విహారం చెయ్యండి.

జై! మేవాడకు జై! ధ్వనులు. తండ్రీ ఇప్పుడు ఈ అమర సింహుడితో యుద్ధం చేసే వాళ్ళే లేరా? భారత సింహాల్లారా మేవాడ గౌరవం నిలబెట్టండి! ఇదే మన ఆశయం! ప్రతీకారం!! ప్రతీకారం!!!

[హైదరాబాదు ఆలిండియా రేడియో సౌజన్యంతో]



ఇందులో పాత్రలు :

| | వయస్సు | |
|---|---|---|
| భూషయ్య | 60 సం. | మైకాగని వ్యాపారస్తుడు. |
| సులేఖ | 25 సం. | భూషయ్య భార్య. |
| వర్ధనరావు | 32 సం. | భూషయ్య దూరపు చుట్టము |
| సుధీర్ | 28 సం. | నిరుద్యోగి. |

వంటమనిషి – నౌకరు నారయ్య

# చేరలేని సీమ

[చక్కగా అలంకరించిన డ్రాయింగు రూము.... సమయం ఉదయం ....]

(రేడియోలో ఉదయకాలం సంగీతం శ్రావ్యంగా వినిపిస్తుంటుంది .... ఒక్క క్షణంసేపు ... తరువాత రేడియో కట్టివేస్తూ....)

భూ : ఓరేయ్ ... నారయ్యా ...

నా : అయ్యా.... వస్తున్నా (అడుగుల చప్పుడు).

భూ : వేణీళ్ళు కాగాయో లేదో చూడు .... ఇవ్వాళ నాకు లక్ష పనులున్నాయ్ ... వ్యాపారం లెక్కల తనిఖీ అదీను.... ఒరేయ్ .... వ్యాపారం అంటే మాటలా ?... ఎంతమందిని కట్టుకురావాలి! .... సరేగాని....మీా అమ్మగారు ఏం చేస్తున్నారురా?.... అసలు నిద్ర లేచారా? ....

నా : అసలీ మధ్య వారు సరిగా నిద్రపోతేరా బాబూ.... మేడమీాద వసారాలో కూర్చుని చదువు కుంటున్నారు ...

భూ : (విసుగ్గా) పుస్తకాలు ! .... చదువు ! .... ఆలోచనలు !....ఒక్క కానీ సంపాదించి పెడతాయా?.... అవతల నాకేం కావాలో కనుక్కో అక్కర్లే! .. ఆడది వున్నప్పుడు? ఎన్ని వుండి నాకేంలాభం?. ప్రారబ్ధం !....

"ప్రారబ్ధాబ్ధము లుజ్జగింపరుసుమీ, ప్రజ్ఞానిధుల్ గావునన్". అన్నారు కాబట్టి, ఇలా నెట్టుకు రాగలుగుతున్నా కాని !....

నా : అంతే.... బాబూ.... అంతే....

భూ : దానికేంగానీ, అగ్గిపెటె తెచ్చిపెట్టి .... వేన్నీళ్ళు సిద్ధం చెయ్యి ...

నా : (తిరిగి వచ్చి) అంతా వెతికా. ఎక్కడా అగుపళ్లేదు బాబూ .... అమ్మగార్ని అడిగితే తల నొప్పని గదిలో పడుకున్నారు. . వంటమనిషిని వాకబుచేస్తే తడిసిన అగ్గిపెట్టిని చూపించారు !.... నేను వంటింట్లోకి వస్తే మైలబడుతుందని ఇంతెత్తున లేచారు.... బాబూ....

భూ : అన్నీ అపశకునాలే.... గృహిణికి పట్టింపు లేకపోతే వంటావిడ కేం బాధ్యత ? .... ఎక్కడి కక్కడ మూటలు కట్టుకొని చేరవేసుకు పోవడమే కాని!.... అఘోరించు.... ఇదిగో అణా.... అగ్గిపెట్టె... పత్రికా.

నా : అణాకి రెండెట్లా వస్తాయ్ ... బాబూ....

భూ : (మందలింపుగా) మహాప్రౌఢివి ! అసలు త్రొక్కి నట్లు.... ఇదిగో బేడకాసు .... పికార్లు కొట్టి.... సినిమా పాటలు వింటూ ఆలస్యం చేశావా ?.... నీకు మూడింది....

నా : అగ్గిపెట్టె మామిడికాయ మార్కా దా ? జంట జింకల మార్కా దా ?

భూ : ఏదో ఒకటి బాగా వెలిగే మార్కు....

నా : తెలుగు పత్రికా ?.... ఇంగ్లీషుదా ?...

భూ : నీ మొహం ! .... అడుగడుగునా శంకలే ?.... స్వాతంత్ర్యం పొందిగూడా యింగ్లీషే ! (కుల్లిగా తనలో) చిన్నతనంలోనే ఇంగ్లీషు నేర్చుకుంటే ఎంత బాగుండేది ?

నా : మీా రెప్పుడు వంకలు పెడుతుంటే శంకలు గాక మరేమిటి ?. (వెడుతాడు)

[వంట మనిషి కాఫీతో ప్రవేశం]

వం : బాబుగారూ ! కాఫీ !

భూ : ఊఁ అక్కడ పెట్టి వెళ్ళండి. (ఆలోచనగా) ఎందుకు వయస్సు చెల్లినాక, రెండో పెళ్ళి చేసుకున్నానో ? షష్టిపూర్తి చేసుకున్నా రాయిలాగానే వున్నా, ఏదో అప్పుడప్పుడు ఆయాసం వస్తుంటుం దనుకో. (దగ్గుతూ) భగవంతుడా ! ఒక్కసారి ఆ బంగారు చేత్తో కాఫీయిస్తే కందిపోతుందా ? ఎప్పుడనా

కులాసా కుబుర్లు చెప్పడం లేదుకదా; ముళ్ళమీద కూర్చున్నట్లు ముక్తసరిగా మూడు పొడి మాటలు.

[నౌకరు నారయ్య ప్రవేశం]

నా : ఇదిగో అగ్గిపెట్టె, ఆంధ్రపత్రికా.

భూ : (చుట్ట ముట్టిస్తూ) మజాలేదు నారయ్యా! చచ్చి పోగాకు. మష్టి చుట్ట నుసినుసిగా రాలిపోవడమే కాని నిలబడి కాలందే!

నా : పసందుగా కాలుతయ్ దొరచుట్టలు కొనరాదు టండి. డబ్బున్న మారాజులు (మెల్లిగా) లోభికి ఖర్చెకువ గదటయ్యా?

భూ : పొడుపొద ఎప్పుడూ? నీకేం? వున్నది కాస్తా మతాబాలా వెలిగించ మంటావు! అనక లకా యిలూ, దివాయిలూ.

నా : అందుకే స్నానానికి గూడా బట్టలసోపు వాడు తున్నారుగా!

భూ : (సగర్వంగా) అహోరించావ్. పొదుపంటే అదేరా!

[వాకిట్లోనుంచి పిలుపు 'భూషయ్యగారూ!']

నా : అయ్యగారూ! పిలుస్తున్నారండి!

భూ : ఎవరోయ్! నారూ.

నా : మీ స్నేహితుడు సత్యరాజుగారు వచ్చాయండి.

భూ : దుశ్శకునం! సుధీరేనా? చేతి చముడు వ్యవహారం! పలకరిస్తే బాతాఖాని! అప్పు కొచ్చుంటాడు. ఇంట్లో లేనని చెప్పకపోయావ్. సరే వెళ్ళు. వేణ్ణీళ్ళు పెట్టు

మాకు, మాకు ఎన్నో లావాదేవీలు. (క్షణం విరామం.)

[ప్రవేశం సుధీర్]

సుధీ: నమస్కారం భూషయ్యగారూ!

భూ : (మూలుగుతూ) ఊఁ...

సు : (ఉద్వేగం అణచుకొంటూ) నా రాకని మీరు హర్షించరని తెలుసు.... ఆ కాలం మా నాన్నగారి తోనే వెళ్ళిపోయింది.

ఈ 'బికారికి' మీ అమూల్యకాలం వృధా చెయ్య సాహసించటం అనుచితమని తెలుసు.... అయినా....

భూ : (వారింపుగా) ఎందుకో ఉపయోగం లేని ఉపన్యాసాలు ?...

సు : ఉపన్యాసం కాదు. హృదయవేదన.

భూ : హృదయవేదన!.

సు : అవును.

భూ : ఎవరి హృదయవేదన వారనుభవించాలి. కర్మ సిద్ధాంతము చదువలేదూ ? విద్యావంతుడి వంటావ్ ?.

ఈ కాలంలో భగవద్గీత పారాయణం చేసే వాడెవడులే !. మతంలేని లోకం ! విజ్ఞానమంతా నిష్కామ కర్మలో వుంది.

సు : భగవద్గీత చదివి మానవత్వం నశించని వారికంటె చదవకుండా ప్రదర్శించేవారు లేకపోలేదు!.. మీా వ్యాపారంకూడా నిష్కామకర్మేనాండి!

భూ : అధిక ప్రసంగం !

సు : మన్నించండి. కాని వాస్తవం! జరుగుతున్న విషయం.

దానికేంగాని యిన్నాళ్ళకి నాకు మంచి కాలం వచ్చింది. మద్రాసులో ఆయిల్ కంపెనీవారు యినస్పెక్టరు వుద్యోగానికి యింటర్వ్యూకి పిలిచారు. ఈ రాత్రి ప్రయాణం. రైలు ఖర్చులకన్నా చేతిలో చిల్లిగవ్వలేదు. ఒక్కపాతిక రూపాయలు చేబదులిప్పించారంటే మొదటి నెలజీతంలోనే తీర్చుకుంటా!

భూ : అప్పా ?.. ఈ విశాలప్రపంచంలో నేను తప్ప నీకెవ్వరూ దొరకలేదూ ?

సు : అన్నిచోట్ల ప్రయత్నించాను. సత్యరాజుగారి అబ్బాయేంటి ? అప్పుకు రావటమేమిటి ? అని ప్రశ్నించేవారేగాని సమయానికి ఆదుకునేవారు కనుపించలేదు. మా నాన్నగారి సాయం పొందినవారిప్పుడు సాకులు వల్లిస్తున్నారు!

భూ : అనగూడదుకాని అప్పు స్నేహాన్ని చెడగొడుతుందోయ్. ఇంత వున్నవాడికి అప్పు పెట్టాలిగాని...

సు : నాకు నిజాయితీ వుంది.

భూ : అహఁ! పెద్దవాణ్ణి కాస్త చెప్పేదివిను. వ్యాపారసరళి వేరు; వాస్తవ దృక్పథం వేరు మంచినీ, చెడునూ, లాభాన్ని, నష్టాన్ని తూకం వేసి నిర్ణయించుకోవాలి విజ్ఞుడంటే. చూశావూ? ఈ మధ్య వ్యాపారం మందగించిందోయ్, లాభాలు రంజుగా రావడంలేదు. ఇన్‌ఫ్లేషన్. విదేశ డబ్బు మారకం! చిక్కులు బోలెడు. ఎన్నన్ని చెప్పేది? పేరు గొప్ప, వూరు దిబ్బ. ఏదో యింత మేడమిద్దె లున్నాయని నలుగురు నా దగ్గరకు చేరుతారు గాని చేతులో నాలుగు రాళ్లాడడం లేదోయ్. అంతా మిహార్చాని అప్పు పెట్టే స్తోమత కూడానా!

నా : అదేంటి బాబూ ,మీరుకూడా పేద అరుపులు! 'ఒరేయ్ నారయ్యా, ఈ సంవత్సరం పట్టిందంతా బంగారంగా వుందిరా. మామిడితోటలో విశ్రాంతి మందిరము కట్టించాలిరా, ఈ ఏడు. అవేవో ఏడుపు కండీషన్ గదులు అవీ నూ వేసవికాలం చల్లగా! అన్నారు కదు బాబూ?,

భూ : ఆపవోయ్. వెకిలివాగుడు!

నా : (భయంగా) సరే.

భూ : (నారయ్యతో) యింకా వెళ్ళవేం, రాచిప్పలాగా? శిష్యపాళం చెయ్యి సుధీర్. నాకు టైమైంది. వస్తా ఏమనుకోకేం. మరోమాట. నాది ఉదారబుద్ధని తెలిసి ఎంతోమంది విరాళాల కొస్తారా.. కాదనలేను.

సు : ఎంతటి కనువిప్పు? (ఉద్రేకంగా) అప్పు అడగటం లోకువైనా మీరు మరచి పోలేదనుకుంటాను. మా నాన్నగారు ఈ మీ మైకా వ్యాపారం చేస్తూ, స్నేహ ధర్మంలో మిమ్మల్ని వృద్ధిలోకి తీసుకు రావాలని, మీకు వాటా యిచ్చారు. నా కప్పుడు చిన్నతనం. అమ్మ చెబుతూ వుంటుంది; వారు హఠాత్తుగా గుండె జబ్బుతో పరమపదించ గానే మొత్తంస్వాహా చేసి లెక్కల తారుమారుతో అప్పు చూపించారు. ఇప్పటికీ ఆ అప్పు తీర్చుకోలేక నానా అగచాట్లు పడుతున్నాం.

ఈ నాడు ఆ మా మైకా కంపెనీ పేరు మార్చి సిరిసంపదలతో పుర ప్రముఖులై వెలుగొందు తున్నారు. దేశోద్ధారకుల్లాగా పేరు ప్రాకటానికి పార్కులు అవీ కట్టిస్తున్నారు. కాని అది కక్కిన కూడు! సాంప్రదాయం చూచుకొని తగాదా తీర్పులకు కోర్టుల చుట్టూ తిరగలేక దిగమింగాను. ఓర్పుతో కష్టాల్ని ఎదుర్కొన్నాను.

ఒకప్పుడు నాన్నగారు పోయినప్పుడు చూడటానికి వచ్చి మీరే నాకెంతో అండగా వుంటానని వాగ్దానం చేశారు. తరువాత ధనసహాయం లేదుకద. మీ కంపెనీలో గుమస్తా ఉద్యోగానికి కక్కుర్తి పడితే యిప్పుడప్పుడని వాయిదాలు వేస్తూ నిరాదరించారు. క్రమేపి 'కలలు కనేవాడు కాగితాలేం వ్రాస్తాడోయ్ కవికి లౌక్యమేం తెలుస్తుంది? అనుభవం చాలదు.'

అని నిరాకరించారు కూడా! ఆస్థులన్నిటిని ఒకొక్కటే అమ్ముకుంటూ ఏదో జీవయాత్రని సాగిస్తున్నాం. అమ్మడానికి యిప్పుడేం మిగలలేదు. ఇప్పుడే తెలుసుకోగలుగుతున్నాను; మానవత్వం నశించిన గుండెకంటె కఠినమైనది మరొకటి వుండబోదని. కానీండి. ఈ పరాజయాన్ని కూడ సహించగలను.

భూ : (కోపంగా) పరాభవిస్తే బయటికి పంపించాల్సి వుంటుంది. కాలానుగుణ్యంగా అనేకం అంటూంటాం. అంటి పెట్టుకుంటయ్యా. వ్యాపార సరళి వేరు;

[నారయ్య ప్రవేశం]

నా : స్నానానికి రండి బాబూ చల్లారిపోతాయ్.

భూ : సుధీర్ ! నువ్వెళ్ళవచ్చు. శెలవో తే!

సు : మీ నౌకరుకు క్షమించుకు ? వెడుతున్నా. (పోతుంటాడు)

భూ : పీడ విరగడైంది.

నా : అదేంటయ్యా, మతిమరపు? మేడమీదకు పోతున్నారు ? ఇటురండి స్నానాలగదికి.

భూ : ఛీ దిక్కుమాలిన పరధ్యానం. (వెడతాడు)

[ప్రవేశం సులేఖ]

సులే : (వెన్నంటుతూ) సుధీర్ ఆగు ఆగు.

సుధీర్: (ఆగి) నన్నా ? ఎవరూ ? సులేఖాదేవీ ?

సులే : (బాధగా) ఒక్కమాట!

సు : (బరువుగా) యింకెందుకు ?

సుశే : నేనింకా ఈ లోకాన్ని విడిచిపోలేదు సుధీర్!
అంతా విన్నాను.

సు : గతాన్ని త్రవ్వకు.

సుశే : (గాద్గదికంగా) అయ్యో; ఎల్లాపరిణమించింది? ఎలా వుండేవాడవు? ఆచిరునవ్వు ఎక్కడ దాచావు? నీమధుర కంఠం మారుమోగదా; నాకు మళ్ళీ ? నీ మోహాన రూపం మారిపోయిందా ? లేక కళ్ళు నాకు భ్రమ కలిగిస్తున్నాయా ? విధి. నా యింట్లో అవమానం జరిగిందని క్రుంగిపోకు. దాన్ని స్వీకరించాల్సింది నేను మాత్రమే. నువ్వు ఆనాడు నాకు దక్కలేదు. జీవితేచ్ఛ నశించింది. కాని ఎక్కడో ఏ దూరదేశం లోనో నీవూ సురక్షితంగా సుఖిస్తావని ఆశతో జీవించి వున్నాను.

సు : ఎందుకు ఆ వితరణ ? మన మధ్య అగాధాలు' జీవిత సరిహద్దుల్ని అతిక్రమిస్తున్నావు.

సుశే : కృత్రిమ అగాధాలు! ఒక వ్యక్తి జీవిత సరిహద్దుల్ని నిర్ణయించేది నిష్కళంకమైన అంతరాత్మకాని, నిజానికి నిలువని సిద్ధాంతాలు కావు.

సు : ఇంకా ఊహాచిత్రాలేనా ?

సుశే : ఎంతో ఆలోచించారు. ఏ మార్గాన పయనించినా నీ గమ్యమే గోచరిస్తోంది (కరిగిపోతూ) పోదాం.

ఒక సీమకి. అక్కడ మనల్నెవరూ గుర్తించరు. అక్కడ ఆర్థిక వ్యవస్థ అంతస్థులు వుండవు. శ్రమించి న్యాయంగా జీవిద్దాం. ఆ గుట్టక్రింద లతా నికుంజాల్లో, ఎక్కడ వుంటే ఏం? ఇసుక తిన్నెల్లో సెలయేటి కిలయికపద్ద నిర్విచారంగా పరుగులు తీద్దాం. ఆ సీమలోకి రావూ! విహరించవూ - విషాదం మరచి.

సు : అది చేరలేని సీమ!

సులే : మనకు కాదు. ఇతరులకు.

సు : సెలవు సులేఖా. అమ్మ నాకోసం ఎదురు చూస్తూంటుంది.

సులే : (యిస్తూ) ఇదిగో చేతి వుంగరం! అమ్మేసి నీ అవసరం తీర్చుకో. కాదనకు. అంగీకరించలేదు.

సు : పరాధీనులకు దానం చేసే అధికారం లేదు.

సులే : తప్పదు. తీసికో. (చేతిలో పెడుతుంది)

సు : అనర్థప్రచారానికి దారితీస్తుంది. సులేఖా క్షమించు
(ప్రవేశం వర్ధనరావు)

వ : భోజనకాలే భగవన్నామ స్మరణ. గోవిందా గోవిందా ? మీ యింటికి భోజనానికి వచ్చాను. సులేఖాదేవిగారూ ? భూషయ్యగారేరి! అరె ఎవరూ మాట్లాడరేం! (గ్రహిస్తూ) రవ్వల వుంగరం క్రిందపడిందేమిటి ? సుధీర్! ఉద్యోగందొరకలేదని వుంగరాల వ్యాపారం మొదలెట్టలేదుగదా ?

సుధీ : వ్యాపారం లాభదాయకంగా అందరూ చేయ గలిగితే పల్లకి మోసేదెవరు ? దానికి లౌక్యం వేదాంతం కావాలి. నాలాటివాడు నష్టపోయినా విచారం వుండకూడదు.

వర్ద : అందుకే నీతిశతకాలు తప్ప మరొక పుస్తకం చదవ వద్దని ఆదేశిస్తారు మద్గురువర్యులు భూషయ్యా మాత్యులు. చూడుమరీ.

సుధీ : (చిన్నబోతూ) కాని ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చింది. ప్రయాణానికి పైసా లేదు. భూషయ్యగారిని పాతిక రూపాయలు అప్పడిగాను. వీలుపడ దన్నారు.

వర్ధ : కొద్దిలో తప్పిందోయ్ సుధీర్! ఎంత దురదృష్ట వంతుడివి! చేతులో ముప్పయి రూపాయ లుంటే యిప్పుడే రెండు డర్బీ లాటరీ టికెట్లు కొన్నాను, గ్రహగతి మారి దరిద్రమన్నా వదులు తుందేమో నని. సమయానికి సాయం చేయడంలోనే వుంది సహచర్యం. ఇంతకీ నీకు సహాయంచేసే అదృష్టం నాకుమాత్రం వుండొద్దు! అందులో ఇతరుల కష్ట సుఖాలు అనుభవించి, పరిష్కారం చేయడానికి బద్ధ కంకణం ధరించాను అది నా అలవాటను; వుగ్గు పాలతో నేర్చిన విద్య అను, ఏ ఆదర్శమన్నా అను. సరేకాని జేబులో చిల్ల రేమన్నా వుందా ! కారాకిళ్ళీ వేసుకుని చాలా సేపైంది.

ఆఁనాపిచ్చిగాని, నిన్నడుగుతున్నానేమిటి - అసలే తలక్రిందు లవుతున్న వాడిని!

సుధీ : ఆచరణ ఎట్లావున్నా మీ ఆదర్శానికి నా జోహారులు. నాకు పనుంది (వెడతాడు) (అడుగుల చప్పుడు.)

సులే : (వికలంగా) వెళ్ళిపోయావా? సుధీర్.

వర్ధ : ఆఁ వెళ్ళకేం చేస్తాడు? పారబోయడానికి ఎవరి ఒళ్ళో పోసుకూర్చున్నారు గనుక? ఏమిటో ఈ లోకం! అతన్ని చూస్తూంటే జాలివేస్తోంది పాపం! దిగజారిన జీవితం. అయినా నిస్సహాయులం కదా? కాని నే నెప్పుడు ఆపత్సమయాల్లో సానుభూతి తప్పక ప్రకటిస్తుంటాను. అది నా ఆదర్శం.

సులే : ఓ ఆదర్శ సామ్రాజ్య ఛత్రపతీ! ఆదర్శాలతో పరిశోధనలు చేస్తుండండి. నేను చదువుకోవాలి.

వ : ముచ్చటగా పలకరించీ పలకరించక ముందే "చెత్త డబ్బా" క్రింద జమ కడతారుకదా! అది మీ లోపం కాదు. నాకు గొప్ప చిక్కు. విందురూ? ఈ విషాదాచ్ఛాదితమైన మీ ముఖ బింబాన్ని ఒక కళా ఖండంతో పోల్చడానికి నా మనస్సు గుర్రప్పందా లాడుతోంది. అనుమతికోసం దీనంగా వేడుకుంటున్నాను. ఏమి మీ ఆజ్ఞ?

సులే : అనుమతికేంగాని కవిత్వానికి మీ తత్వానికి బొత్తిగా సరిపడని విషయం. అలవాటు లేని అవు

పోసనతో పూరికే హైరానపడకండి. ఆయాసం వస్తుంది.

వ : (తెల్లబోతూ) నన్ను మీరు తడిపితే మాత్రం బాధ పడగలవనుకున్నారా ?... అంతేకాదు. భూషణాలు అభిమానాలు అనిపెట్టుకుంటే వ్యాపారస్థుడికి సలహాదారు ఉద్యోగం చెయ్యగలనా అంట! గాలినుండి వచ్చినమాటలు గాలికి పోక ఏం చేస్తాయి. అసలు విశదీకరించ వచ్చే దేమిటంటే జీవితానికి జిజ్ఞాస వుండాలి. విరక్తి ఒక తాత్కాలిక భావ ప్రేరణ మాత్రమే అందుకని అన్నీ వదులుకుని సన్యాసుల్లో కలుస్తామా ! అన్నిటిని కళామయంగా మార్చి పరిశీలించిన వాడికి లోకంలో విషాదం ఎక్కడా గోచరించదు. ఇది జీవితాన్ని నేను మథించి కనిపెట్టి మానవాళికి ప్రసాదింపనున్న ముక్తి సూత్రం.

సులే : రక్తి! విరక్తి !

వర్ధ : (ఉపన్యాస ఫక్కీలో) జీవనఫలం నుండి 'రక్తి' రసం పిండి ఆస్వాదించాలి. ముక్తసరిగా శెలవిచ్చారు. ఉదాహరణకు మీరు బాధపడుతున్నారనుకుందా... శోకరసం వుండే దేవుడు ఎందుకు సృష్టించి వుంటాడంటారు ? శోకాచ్ఛాదితమైన ముఖబింబాన్ని కవులచేత రమణీయంగా కవిత్వంలో ప్రవేశపెట్టి అలంకారంతో గుప్పించి వేయడానికేగాని నిజంగా శ్రమింపచేయడానికి కాదు. ఎంత విజ్ఞానం ప్రదర్శించినా భారత దేశంలో మనిషికి తగిన విలువ

నివ్వారు. అందుకే విదేశాలకు పోదామని తహతహ పడుతుంటాను. లక్ష్మీ ప్రసన్నం కాందే ఏం చెయ్యగలను ?... నిరుత్సాహ పడటం ధీరలక్షణం కాదని యత్నం మానలేదు సుమండీ.

సులే : శోకం మీకొక రసం ! మాకొక నీరసం మీకిలాటి ప్రజ్ఞ వుండబట్టే భూషయ్యగారి మైకా కంపెనీలో సలహాదారుగా రాణింప గలుగుతున్నారు.

వర్ధ : చక్కగా చెప్పారు సులేఖాదేవి ! మీరెందుకు ఎప్పుడూ నవ్వుతూ వుండకూడదు ? (మురుస్తూ) ముత్యాలు రాలిపోవుగా !

సులే : సాంఘికంగా బంధింప బడినవారికి ఆనందమా ! గతజల సేతు బంధనం కాక.

వ : బంధనా ?

సు : బాహ్యంగా గోచరించని వేదన.

వ : అర్థమయింది. పరిశోధకుణ్ణి కదా... ఇట్టే గ్రహిం చెయ్యగలను ! అవును దాంపత్యంలో ఈడు జోడూ లేకపోతే రాగంలేదు. ఈ విషయంలో మీకు తీరని అన్యాయం జరిగింది. ఈ విషయంపై విపరీత ప్రచారం జరగాలి. ప్రజావాహిని చైతన్యంతో పురోగమించాలి.

సు : మీ కడుపులో 'చల్ల' కదలనంత కాలము ఎన్నైనా చెబుతారు ! మొగ మహారాజులు.

వ : ఓ దేవి !... సావధాన చిత్తవై నా శపథమును దయాంతరంగముతో ఆకర్ణింపుము. మీ సౌంద

ర్యాన్ని అహర్నిశం ఆరాధించే ఈ భక్తాగ్రేసరుడు మీ ముందు సాగిలపడి యున్నాడు! నాకు తెలుసు ఆ అదృష్టం ఏ కొద్దిమందో అనగా నావంటి వానికి తప్ప అందరికీ లభించదని! మీరు నాజన్మ తరింప చేసే దేవతలు. నిశ్చయమూ. (ఆవులిస్తూ) అది యును గాక, మీకు మటుకు ఎవరున్నారు? వయస్సు చెల్లిన భూషయ్యగారు కాక... కావున నా అభ్యర్థన మును కరుణా కటాక్షముతో వీక్షించి నన్ను ధన్యుని చేయుము. మరియు... ఏమిటి? మీకు నిద్ర వస్తోందా?

సు : కాదు! వళ్ళు మంటుతోంది.

వ : దారిలోకి రండి. శాస్త్రకారుడు స్త్రీల కది శుభ లక్షణమని నానావిధ శృంగార విలాస విన్యాసము లలో ప్రధాన స్థాన మాక్రమించిన విశిష్ట లక్షణ మని ప్రవచించి యున్నాడు!

సరికొత్త విడుదల వేదికై పరీక్షించి మిమ్ములను ఈరోజు మొదటి సినిమా ప్రదర్శనమునకు వినమ్రతతో మోకరిల్లి ఆహ్వానించ సాహసించు చున్నాడను. భూషయ్యగారికి రావటానికి తీరిక వుండదు. ఆయనకు వ్యాపార మోజు హెచ్చు.

సు : పరుల సొత్తుపై మోజు మీకు హెచ్చు. బాధ్యతా యుతమైన ఆనందం కాదు. మీరు వాంఛించేది స్వార్థ భూయిష్టమైన వ్యామోహం!

(ఉప్పెనగా లేచి) వర్ధనరావుగారూ. మీరు నిండు

హృదయంతో నన్ను ఆరాధిస్తున్నట్లు చెబుతున్నారు... నిజమేనా ?

న : ముమ్మాటికీ .. దైవసాక్షిగా.

సు : దైవసాక్షి ? ఎద్దుపుండు కాకికి ముద్దు కాదూ ! మీ సంగతి మరిచా ననుకున్నారా ? మననం చేసుకోండి. నాలుగు సంవత్సరాల నాడు నా తండ్రి నాకూ చెల్లెలకూ ఎక్కువ కట్నాలిచ్చి పెళ్ళి చేయలేక నానా అవస్థలు పడుతుంటే, మీరు పెళ్ళి చూపులకొచ్చి ఓయ్యని కబుర్లు చెప్పి, చేసుకుంటానని వక్కాణించారు ! కాని, లగ్నాలు పెట్టుకునే ఘట్టంలో కుంటిసాకులు చెప్పి దాటవేశారు. కట్నము దర్జాలకు లోపం జరుగుతుందనేగా ! నాన్నని మనోవ్యాధికి లోను చేశారు ! అప్పుడు మీ రే సీమల్లో విహరిస్తున్నారు ? దేవతలతో షికార్లు సాగిస్తున్నారా? ఏ సినిమాలు చూస్తున్నారు? కట్నం తాలూకు నోట్లు లెక్క పెట్టే టప్పుడు జ్ఞప్తికి రాని నేను, హఠాత్తుగా ఈనాడు దేవతనై సాక్షాత్కరిస్తున్నాను కదూ ? మీకు... ప్రజ్ఞానిధులకు.

న : నా పితృవాక్య పరిపాలనకు లోనై మీతో వివాహం చెడివుండవచ్చు .... అది నా లోపమంటారా ? .... పోనీండి గతం ... వ్యర్థం ..

సు : చిలుక పలుకులకూ చేతలకూ చాలా దూరము ... ఇది కవిత్వాన్ని, ధర్మశాస్త్రాన్ని యిష్టమొచ్చినట్లు

వుపయోగించి వ్యాఖ్యానించటం కాదు. మీ ప్రజా సేవతో పట్టీలు కొడుతుండండి. నాకుమాత్రం కొంచెం దూరంగా....

వ : భయపడుతూనే వున్నాను. సందేహం తీరింది. సుధీర్ పై కన్నువేశారు! మీ మందుకు పనికివస్తాం. కాని వియ్యానికి, విరోధానికి సమానార్హత వుండా లన్నారు పెద్దలు. శాస్త్రచర్చల్లో విధినంటారు నన్ను. ఎందుకైనా మంచిది ఆ బికారి సుధీర్ని నమ్మకండి.

సు : నా అర్హత [నిట్టూర్చి] తారతమ్యాలు దృష్టిలోపం కానిసృష్టిలోపంకాదు. దయచేయండి. [నిష్క్రమణ]

వ : సులేఖాదేవీ! వెళ్ళిపోయారా? ఎవరికర్మకెవరు కర్తలు? అనుభవం! శోకరసం. సులేఖాదేవి సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తుంది.
కాని నాకు దక్కదు. దక్కలేదు. ఘోర పరా జయాన్ని ఎట్లు సైరింతువు మానసమా!

[స్నానం చేసివచ్చిన భూమయ్య ప్రవేశం]

భూ : ఏమిటి వర్ధనరావు, ఘోర పరాజయమంటున్నావు?

వ : కాక మరేమిటి? మీరింక వ్యాపారం మానేసి బైరాగుల్లో కలవవలసిందే! తప్పదు.

భూ : అసంబద్ధ ప్రలాపం! మధువు మోతాదు పెరగలేదు కదా!

వ : చచ్చిన పాముని కుళ్ళబొడుస్తారెందుకు? మీ ధర్మ

పత్ని మీకు దక్కనపుడు ఈ ద్రవ్యార్జన జంజాటం దేనికంట ?

భూ : ఇప్పుడేం ముంచుకొచ్చింది ?

వ : ముంచుకొచ్చి మునిగిపోయింది. ప్రొద్దున్నే సుధీర్ వచ్చాడు అప్పుడు చూశారుగా .... మీ రివ్వక పోయినా సులేఖా దేని రవ్వల వుంగరం యివ్వ బోవడము ఈ పాపిష్టి కళ్ళతో చూశాను.

హరి హరి! నేను వుండబట్టిగాని ఒక్క క్షణం ఆలస్యమైతే ఎగరేసుకు పోయేవాడు కదూ ! దీన్ని ఏమంటారు! యిదంతా వాడిపై 'ప్రేమ' లేకుండా చెయ్యగలరా అని! స్వాహా ! సర్వం స్వాహా! మీ కాపురానికి సిళ్ళు వదులుకోవలసిందే !

భూ : అప్రతిష్ఠ. ఎంత దుర్భరం.

వ : కాని, అనివార్యం!

భూ : ఏమిటి మార్గం?

వ : భూషయ్య అన్నగారూ! — ఏదో మీ దూరపు చుట్టాన్ని. జ్ఞాతినంటూ ఎందరు ఆరోపించినా నా భ్రాతృభక్తి సడలదు. సడలబోదు; ఎవరికి తప్పినా మీ శ్రేయస్సు నాకు తప్పనిసరిగా! అందుకే ఎంత మంది విదలించినా పట్టుకు మిమ్మల్ని ప్రాకులాడు తున్నాను. మిమ్మల్ని ఆప్యాయంగా 'అన్నగారూ' అని పిలుస్తున్నానంటే గ్రహించలేరూ, నా విశ్వా సాన్ని ? చేరదీశారు. ఉద్యోగం ఇప్పించారు. మీ కొలువులో అణకువగా మసలుతున్నాను.

భూ : ఎందుకు మళ్ళీ పాతపాట. కానీ డబ్బేమన్నా అవసరమా?

వ : (కోపంగా) అంటే డబ్బుకోసం స్తోత్రం చేస్తున్నాననేగా? ఎందుకండి నిష్ఠూరాలు?

భూ : పుల్లలు విరచకు. ఇది కార్పిచ్చు.

వ : సుధీర్‌ని, సులేఖని దూరం చెయ్యాలి.

భూ : మనస్సుల ఆలోచనలని మార్చే యంత్రం కనిపెట్టే విజ్ఞాని వుంటే నా సర్వస్వం వాడికి ధారపోయమా! కుదరని వ్యవహారమే అది!

వ : వ్యాపారంలో తారాజువ్వలాగ పనిచేసే మీ బుర్ర సంసారంలో చలిమిడి ముద్దలాగ చలనం లేకపోతోందేం?

భూ : ఏమీ పాలుపోవడంలేదు. అందుకేగా ఆపత్సమయాల్లో ఆదుకుంటావని సలహాదారు వుద్యోగానికి నిన్నే ఎరి కోరి వేసుకున్నది.

వ : భేష్! చెప్పక తప్పడంలేదు. ఒక దెబ్బకు రెండు పిట్టలు. దొంగకేసు ఒకటి సుధీర్ మీద బనాయించి జైలుకు పంపామంటే అటు వుద్యోగం వూడుతుంది; ఇటు సులేఖాదేవితో రాకపోకలు తప్పుతాయ్. వాడికి నలుగురిలో నగుబాటు! నా ప్రజ్ఞ ఎలా వుంది?

భూ : అమోఘం! కాని ఎలా సాధ్యం?

వ : దొంగ కేసులు మీకు కొట్టిన పిండే కందడీ!

భూ : ఇది వ్యాపారం కాదుగా!

వ : ఒక్క ఐదారొందలు ఇప్పించండి. అంతా అయిన తర్వాత చెబుతాను. మధ్యలో ప్రశ్నించకండి! వింటున్నారా?

భూ : ఏమో? అయోమయం!

[ప్రవేశం సులేఖ నోట్ల కట్టతో]

[విషాద సంగీతం వీణమీద భారంగా]

భూ :
వ : సులేఖా! చేతిలో ఆ నోట్లేమిటి!

సు : దొంగకేసులు బనాయించటానికి కాదు. రాజ మార్గాన్నే వెళ్ళి నా సుధీర్ కి సాయం చేస్తాను. అడ్డుపడినా నిష్ప్రయోజనం.

నేను నాలుగు సంవత్సరాలు మీ ఇంటిలో వున్నా మీకు ఎన్నటికీ చెంది యుండలేదు. నాన్నగారి అవసానదశలో వారి మనశ్శాంతికోసం నా చెల్లెలు, తమ్ముళ్ళ ఆర్థిక సహాయం కోసం. మిమ్మల్ని వివాహ మాడాను. కాని అది త్యాగభరితమైన ఆత్మవంచన. ఆ త్యాగానికి ధనంతో విలువ నిర్ణయించలేరు. నా పితృ ఋణం తీర్చుకున్నాను. వ్యాపారానికి, వ్యామోహానికి అందనిది ఒక నిర్మల హృదయమని తెలుసుకోండి. ప్రేమకు ఆత్మ సౌందర్యం వున్న దని వూహించలేని మీతో వుండలేను. అంత రాత్మ ఆదేశమే నా విజయం. అక్కడే ప్రేమకు పరిపూర్ణ సిద్ధి.

వ : ఇంటి దొంగ!... మోసం... వంచన.. కులట!...

భూ : చూస్తావేం! నోట్లు లాక్కో... నా డబ్బు.... నా నగలు....

వ : ఆ నిర్ధనుడితో లేచిపోయి, తిండికి మొగం వాచి చావ దలుచుకున్నావా?

[ప్రవేశం ఆదరా బాదరాగా నారయ్య]

నా : అన్యాయం! అన్యాయం! అయ్యగారూ; సుధీర్ బాబును పోలీసులు పట్టుకెళ్ళి పోయారు. పిలపించి షావుకారును అప్పు అడిగారట. అదేదో షావుకారు పరుషంగా కూశాడట. దాంతో రెచ్చిపోయి కుమ్ములాడి ఆ నోట్లను చించి వేశారుటండీ. బజార్లో కెడితే జనం చెప్పుకుంటున్నారు ఆ వార్త విని సుధీర్ అమ్మగారు గుండె నొప్పితో పడి పోయారుటండీ.

వ : వహ్వా! వెదుకబోయిన తీగ కాళ్ళకు తగిలింది.

భూ : కర్మ సిద్ధాంతం! భగవద్గీతా వాక్యం వృథా పోతుందా? దేవుడు దుష్టుల్ని శిక్షిస్తాడు. అవతారాలు దాలుస్తాడు. శాస్త్రాల్ని కాదనటానికి మన మెవరం?.

సు : (గాద్గదికంగా) అయింది. పరీక్ష పూర్తయింది. సుధీర్, ఎక్కడ చూచినా నువ్వే నాకు. నీ మాతృ హృదయం ఎంతగా గాయపడిందో? విజయం నాదే. వెళ్ళి నా సుధీర్ తల్లిని ఓదారుస్తాను. (నగలు ఒలిచి) ఇవిగో మీ నగలు. (వికటంగా నవ్వి) వర్ధన రావుగారూ.... రసపిపాసులు కదూ? ఈ నిరత్త్ర

భూష సౌందర్యం మీ దిక్కులు. ఎలా వర్ణించడానికి
తలపోస్తున్నారో చెప్పండి ? భూషయ్యగారూ మీ
నాలుగు సంవత్సరాల ఆతిథ్యానికి కృతజ్ఞురాలిని. ఈ
చరణదాసిని కడసారి ఆశీర్వదించండి మళ్ళీ మీకు
కనుపించను. (నిష్క్రమణ)

వ : ఉన్మాద లక్షణం. వెల్లువ కట్ట పైనుండే పారు
తుంది. మతి భ్రమణా లేక !

భూ : నువ్వు కూడా జైలుకు వెళ్ళదలచు కున్నావా ?

సు : ఇనుప కటకటాలను దాటిపోయిన నా సీమలోకి
వృథా. నన్ను అనుగమించకండి. అది మీకు చేర
లేని సీమ. ఇదిగో మీనోట్లు. (విసరి వేస్తుంది)

భూ : (గల్లంతుగా ఏరుకొంటూ) ఎగిరిపోతున్న నోట్లు !
ఏరు. ఆమెను ఆపుచేయ్. అడ్డుపడు. చూస్తావేం ?
వెంటనే.

వ : (నిష్ఫలంగా) అన్నగారూ నాకు కాళ్ళాడటం లేదు.
అప్రతిహతమైన ఆమెచూపు! అంతా నిరర్థకం. నిజమే.
అది మనము చేర లేని సీమేమో !

భూ : (హతాశుడై) అంతేనా ఆమె రాదా మళ్ళీ. శూన్య
మేనా చివరికి ?

వ : ఆ శక్తిని ఎవ్వరూ ఆపలేరు !

(మహతీ శృతులు భారంగా)

74

# విలువలేని విశ్వాసం

-: పాత్రలు :-

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణదేవరాయలు | — | విజయనగర ప్రభువు |
| తిమ్మరుసు | — | విజయనగర మహామంత్రి |
| గజపతి | — | కళింగ రాజు |
| చిన్నాదేవి | — | రాయల దేవేరి |

[ ప్రతీహారి, పరిచారిక ఇతరులు ]

# విలువలేని విశ్వాసం

## ప్రథమాంకము

[కొండవీటి యుద్ధం, కొరకరాని కొయ్యగా పరిణమించినా, రాయలు, తిమ్మరుసు కుయుక్తుల వలన, దుర్గానికి ప్రమాదం తెచ్చాడు. దాని పర్యవసానంగా గజపతి సంధి చేసుకునే అభిప్రాయానికి వచ్చాడు.]

(యుద్ధ గుడారంలో రాయలు, తిమ్మరుసు)

రాయ : మహామంత్రుల చాకచక్యమే ఈ యుద్ధ విజయం.... ఈ కల్పిత లేఖలు పుట్టించకపోతే గజపతి బలం ఇంత త్వరగా పతనమయ్యేది కాదు.

తిమ్మ : ఇది విజయానికి నాంది మాత్రమే. సుస్థిర విజయం శాంతి దాయకమూ, కల్యాణ ప్రదమూ అయి వుండాలి.

రాయ: తక్కినవన్నీ తగనుగుణ్యంగా వస్తాయనడంలో ఆశ్చర్యం లేదు.

తిమ్మ: రాజ్య తంత్రంలో అప్రమత్తులమై వుండరాదు ప్రతీకార వాంఛకి, సహేతుకత్వానికి బద్ధవైరం.

రాయ: ఈ నా రాజ్యపాలనలో మొదటిసారిగా నన్నెదిరించే శత్రువును ఎదుర్కొన్నాను. ఈ కొండవీటి వాళ్ళు ఇంత ఘటికులని తీరా దిగిందాకా తెలిసింది కాదు. ముందెలా పరిణమిస్తుందో కాని.

[ప్రవేశం ప్రతీహారి]

ప్రతీ : కొండవీటి రాయశాస్త్రి, తమకోసం- రమ్మని సెలవా.

తిమ్మ: వెతకపోయిన తీగె కాలికి తగిలింది. ప్రవేశ పెట్టించండి ప్రభూ.

రాయ: రమ్మను.

రా : మహాప్రభువులకు, మంత్రులకు అభివాదములు.

రాయ మంచిది. రాయశాస్త్రీ నీ రాక ?

రా : మీకు వేరే చెప్పాల్సిందేముంది ప్రభూ! గజపతి ప్రభువు తన మాటగా మీకు ఇలా చెప్పమన్నారు. ఈ ప్రస్తుత పరిస్థితులలో ఇంకా రక్త నదులు ప్రవించకుండా, ఉభయ దళాలు శాంతి పథకాన్ని యోజించడం అవసమరని నా మనవి.

రాయ: అప్పాజీ! విన్నారా ?

తిమ్మ:వినకేం ఒహోహో!ఎంత భేషజంగా సెలవిచ్చారు! ఒకవైపు చచ్చిపోతూ ఈ ప్రతాపాలు దేనికో! రాయశాస్త్రీ! ఈ యుద్ధంలో మీరు ఓడిపోయారు. మాకు కారణరహితంగా మీరు పరాజితులు. మా దయ వుంటే మీరు సామంతులు ? తెలిసిందా !

రా : అదే ప్రభువులకు విన్నవించుకొంటున్నాం

తిమ్మ: అదివిన్నవించుకొన్నట్లే.అసలు విన్నవించుకోవాల్సింది వున్నది. రాజకుమారి చిన్నమదేవి, ప్రభువులకు తగి వుందనడం అతిశయోక్తి కాదు. ఆ విధంగా సంబంధ బాంధవ్యాలు ఏర్పడడం.గజపతిగౌరవంయినుమడింప

బడడడమే కాగలదు. ఉభయ దేశాలకు శాంతి సౌభాగ్యదాయకం కాగలదు.

రా : మీ అభిమతం విన్నవించి వెంటనే వారి అభిప్రాయం తెలియజేస్తా.

తిమ్మ: ప్రభూ! ఈ విషయంలో మన చిత్తస్థైర్యం చెడరాదు

రాయ: రాయబారీ! మా మాటగా చెప్పు. అంతదాకా యుద్ధం సాగుతూనే వుంటుంది.

రా : చిత్తం ప్రభూ! శెలవు. (వెడతాడు)

రాయ ఒక్కసారి రాణీవాసానికి వెళ్ళివస్తాను. చాల కాలమైంది.

తిమ్మ: మంచిది ప్రభు! ఉదయాన్నే పునర్దర్శనం.

ద్వితీయాంకము

[గజపతి రాజమందిరం. బయట వాతావరణంలో సంచలనం.]

[గజపతి, చిన్నాదేవి]

గజ : ఇంకా రాయబారి రాలేదూ?

చిన్నా: వస్తారు నాన్నా! జరగవలసిన విధ్వంసన జరిగిపోయింది ఇంక చెయ్యాల్సిందేముంది? శాంతంగా ఆలోచించండి.

గజ : ఆలోచించి, ఆలోచించి రాజ్యానికీ, నీకూ నీళ్ళు వదిలాను గదమ్మా!

చిన్నా: నాన్నగారూ! నే నెప్పుడూ మీదాన్నే. నా విష

యం భయపడకండి. మీ గౌరవ ప్రతిష్ఠల కంటే నా స్వాభిమానం ఎక్కువా, నాన్నా ?

గజ : అమ్మా! నువ్వు ఉత్తమురాలివి నీ రక్తంలో కొండవీటి పౌరుషం ప్రతీకారం పొంగుతోంది. నీవు ధీర నారివి!

సేవ : (ప్రవేశిస్తూ) రాయబారి, ప్రభూ !

గజ : ప్రవేశపెట్టు.

రాయ: ప్రభువులకు వినయాంజలి. మీరు చెప్పిన అంశాలు విన్నవించాను కానీ ....

గజ : (గర్జిస్తూ) ఇంకా కానీ యేమిటి ?

రాయ: రాజకుమారి చిన్నమదేవి తమ రాణిగానిదే విజయానికి సుస్థిరత్వం ఏర్పడదట! వారి మాటలకు జీవం వుండదట!

గజ : ఛా, నీచులు! కొండవీటి రాకుమారి ఒక ఆట వస్తువుగా కనిపించిందా, ఈ రాయలకి! ఏమన్నా గాని....

చిన్నా: (ఆవేశంగా) నాన్నా! ఉద్రేక పడకండి. మీ అభీష్టమే నెరవేరుతుంది. రాయబారికి మీ అనుమతి యివ్వాలి

గజ : ఏమిటీ ? నీకూ అంగీకారమేనా ?

చిన్నా: నా అంగీకారం, దేశసౌభాగ్యం కోసం. రక్తనదులు ప్రవించే కొండవీటిని తలచుకోలేను. ఒక్క రాయల వారికి నేనే కావాల్సివస్తే, సంతోషంగా నన్నే నశించిపోనీండి. మన విముఖత్వానికి ఈ అమాయక

ప్రజలను హత్య చేయకండి నాన్నా! (ఏడుస్తూ) అంగీకరించండి! పంపండి శాంతి సందేశాన్ని.

గజ : అమ్మా! దేశం, భర్త - ఇవే సమస్యలు. దేశాన్ని వరించే వీరమాతా! శత్రుభయంకరుడు, మహా పరాక్రమ శాలి, ఈ గజపతే నీకు మోకరిస్తున్నాడు తల్లీ! కానీ ఈ ప్రతీకారం నా దేహానికి జీవం. అదిలేంది నేను నిర్జీవుణ్ణి.

చిన్నా: మీ ఆజ్ఞానువర్తిని. రహస్యంగా రాయబారిని పంపండి నాన్నగారూ!

గజ : (విచారంగా) రాయభారీ! రాయల షరతులకు అంగీకరించామని చెప్పు యుద్ధాన్ని నివారించు.

రాయ: చిత్తం ప్రభూ! (నిష్క్రమణ)

చిన్నా: నాన్నా! అలా కుమిలిపోకండి. చూడండి! విర క్తితో, రక్తదాహంతో గుడ్డికీర్తి అపకీర్తితో విర విగే రాయల్లో నేను ప్రియుణ్ణి చూడలేను. ఆ హంత కుడికి పక్కలో బల్లాన్నిగా నిలిచిపోతాను.

గజ : నిజంగానా, చిన్నా! అయితే వినూ! ఒక్క వరలో రెండు కత్తులు నిలువలేవు. ఏ శయనాగారం తనకు స్వర్గతుల్యమని, విజయ శంఖారావమని గజ పతి పతన ప్రథమసోపానమని భావిస్తాడో, ఆశయనా గారమే అతడి మృత్యు మందిరం కావాలి.

చిన్నా: (దృఢంగా) జాతి ప్రతిష్టకి, మా విజయానికి కారణ మైతే తప్పకుండా అవుతుంది. ఈ తప్త హృద

యీాగికి అలమటించే ఆత్మకి ఆ రక్తం, దాహం తీర్చి నివాళియిస్తుంది నాన్నా!

గజ : ధన్యుణ్ణి తల్లీ! ఈ నాడు గజపతికి విజయం పొందాడు. విజయం పొందాడు.

చిన్నా: ఎక్కడికి, నాన్నా!

గజ : ఇంక నిలువలేను. చుట్టూ విజయఘోషలు వినిపిస్తున్నయ్!

చిన్నా: నాన్నగారికి మతిపోయింది. వుండండి.

గజ : ఈ ఆనందానికి హద్దులు లేవు. గజపతి విజయం పొందాడు. (వెళ్ళిపోతాడు)

[ప్రవేశం, పరిచారిక]

పరి : అమ్మా, చిన్నాదేవీ! ఏమిటి యీా విపరీతం!

చిన్నా: (అయోమయంగా) ఆఁ! ఏమన్నానో? ఏం చేస్తున్నానూ?

పరి : అమ్మా! ప్రతీకారంకోసం ఆత్మవంచనకు కూడా పాల్పడ్డారా?

చిన్నా: ఆత్మ వంచనా?

పరి : అవును దేవీ! రాయలు ఒకప్పుడు నీ ఆరాధ్య దైవము... పదిం రోజుల క్రితం దండయాత్ర ప్రారంభించక పూర్వం - ఆ చిత్తరువును చూచి ఎంతిగా మురిసిపోయేదానివో నాకు తెలుసు. రాయలవారిలో ఒక ప్రియుడు బదులు శత్రువు గోచరిస్తున్నాడా? ఇంత త్వరలో మనస్సెలా మార్చుకొన్నావ్?

చిన్నా: నాకు స్వలాభం కంటే, జాతి గౌరవమే ప్రధానం.

పరి : క్షమించు రాజకుమారీ ! జాతి గౌరవం, రాణుల కలల్లో జీవిస్తోంది. దానికోసం కేవలం గర్వ మాం సాలంలో జీవించే ప్రాణికోటిని బలిచేసి మీరు నిల బెట్టేదేమిటి? ప్రజల హృదయాంతరాళాలలో ఎలు గెత్తి ఘోషించే ఆర్తనాదం శాంతిభిక్ష ప్రతీకారం కాదు.

చిన్నా: ఉద్వేగ హృదయాల్లో శాంతి భిక్షా ! అది పిరికి పందలు లోకాన్ని మోసగించాలని వేసే ముసుగు.

పరి : ప్రజల సౌకర్యాలతో కించిత్తయినా నిమిత్తంలేని, ఒక రాచమర్యాద కోసం రాయలలో ప్రభువు తల వడ్డారని, అంతరంగికంగా మాతో మనవి చేయ సియుండి. ఆ రాచమర్యాద, భయంకరమైన అశాం తికి దారి తీస్తుందని తెలిసి, నీవు నమ్మిన విశ్వా సాన్ని ప్రభువు చెప్పకపోయారా ? ప్రభువులో, తండ్రిని చూసి, నీ ఆత్మ విశ్వాసాన్ని బహిరంగ సత్యాన్ని విస్మరించావు దేవి !

చిన్నా: మాలిసి చాలు !

పరి : క్షమించు దేవి !

చిన్నా: ఛీ! వెళ్ళిపో యిక్కడినుంచి! అబ్బా నా తల తిరుగుతోంది.

## —♦ తృతీయాంకము ♦—

[గజపతి వాంఛకి విరుద్ధంగా, చిన్నాదేవికి, రాయలకి వివాహం జరిగింది. ఇది రాజసౌధంలో శయనాగారం]

[రాయలు, తిమ్మరుసు]

తిమ్మ: మహాప్రభూ! రాజ్యలక్ష్మి, విజయలక్ష్మిని సవతి చేసుకొన్నది.

రాయ: అంతా మీ చల్లని చూపే అప్పాజీ!

తిమ్మ: కాదు. అంతా దైవ నిర్ణయం. ఇది శత్రు రాజ్యం. ప్రతీకారాన్ని సవాలు చేసే రాణి! ఇది మీ జీవితాన్ని నిర్ణయించే పరీక్షా సమయం.

రాయ: అప్పాజీ! ఈ అగ్ని గుండంలో, తెలిసీ, రాయల ప్రతిష్ఠకోసం దూకుతున్నాను. విజయుణ్నై వస్తానని ఆశీర్వదించండి.

తిమ్మ: విజయ ప్రాప్తిరస్తు! సైనికుల్ని, గూఢచారుల్ని అంతటా బందోబస్తు చేశాను. శయనాగారంలో రానున్న ఘోర ప్రమాదాన్ని ఎదుర్కోడానికి మీ రూపు అద్భుతంగా చేయించి అలంకరించాను. అప్రమత్తతతో మెలగండి. మీ పిలుపు దూరంలో, దూసిన కత్తులతో సిద్ధంగా వున్నాం. శుభం! శెలవు ప్రభూ!

రాయ: మంచిది అప్పాజీ.

[రాజమందిరంలో గజపతి, చిన్నాదేవి]

గజ : అమ్మా! నీలో అఖండశక్తి గోచరిస్తోంది. అఖండ తేజం ఉప్పొంగుతోంది నీలో రాక్షస సంహార ఉద్రిక్తమైన కాళికాన్తాత ప్రళయ నృత్యం చేస్తూ గోచరిస్తూంది.

చి : (నిశ్చయంగా) కొండవీటి ప్రతిష్ఠను చిరస్థాయి చేయడానికి దైవం నాకీ అవకాశాన్ని కలిగించాడు నాన్నా!

గజ : చిన్నా! ఇదిగో! కొండవీటి కత్తి. రక్తదాహం కోసం అలమటించిన ఆయుధం. ఏ రక్తధార కొండ వీటికి నేత్రానందం చేకూరుస్తుందో, కొండవీటి పరాభవ కళంకాన్ని కడుగుతుందో....

చి : ఒక వీర రాచకుమారి బలాత్కరింప బడదని రాయలకి తెలియాలి. ప్రచ్ఛన్నంగా అంతఃపురంలో మారువేషాలతో ప్రవేశించి నన్ను చూచి మాట్లా డించిన, ఈ రాయల, తిమ్మరుసులనా కనికరం చేది? నాన్నా! ఇంక ఆగలేను శెలవియ్యండి!

గజ : పో, తల్లీ! ఇది న్యాయమో, అన్యాయమో ఆలో చించే వ్యవధి లేదు. కొండవీటిని లోకం జయించ లేదని ఋజువు చెయ్యి. చిన్నా! ఇదే నీకు నా ప్రేమాంజలి!

## —• చతుర్థాంకము •—

[శయనాగారంలో]

[రాయలను పోలిన ప్రతిమ, నిద్రపోయే భంగిమలో పాన్పుపై అలంకరించబడి వుంది. చిన్నాదేవి సర్వాభరణ భూషితయై, సర్వాంగ సుందరంగా ప్రవేశిస్తుంది.]

చిన్నా: అదుగో రాయలు! ఏమిటో ఆ నిద్రలో కూడ రాజసం, ఆ ముఖంలో ఆ గంభీరత, ఆ చెయ్యి తల క్రింద ఆనించి, తల పైకెత్తి పడుకుంటే, నేనే విజయుణ్ని ఈ లోకానికి, అనే భావం ద్యోతకమౌతుంది. ఆ కాలు కొంచెం మడిచారు. రారాజునైనా తలదన్నే గర్వం.

ఏమిటీ ఈ అసందర్భ ఆలోచనలు? నాలో నిగూఢంగా వున్న ప్రేమకి సమయా సమయాలు తెలియవా? (దృఢంగా) రాయలు సర్వగుణ సంపన్నుడు. మహారాజే కావచ్చు. కాని కొండవీడా అతడి క్రీడాస్థలం? తండ్రిగారికి అవమానం కల్గించాడు. బలవంతంగా నా వివాహం తలపెట్టడానికి నేను ఆటబొమ్మనా? నాకు జీవం వుంది. భావం వుంది. వాంఛ, ప్రేమ, ప్రతీకారం, నా బ్రతుకు రాయలకి .... ఈ రాజకుమారి, ఎవ్వరూ సమీపించనంత దగ్గరగా వచ్చి, చేసే ప్రళయ శంఖారావం. ఒక్క క్షణం... ఆగను... ఆగలేను.

(కత్తితీసి పొడుస్తుంది. ఎర్రగా రక్తం చిదటం చూసి

విహ్వాల చిత్తంతో 'కొండవీటికి బలిదానం' అంటుంది.)

[ఆ నినాదాన్ని ఉప్పెనగా ముంచేస్తూ రాయల ప్రళయాట్టహాసం.]

రాయ: రాజకుమారీ! (ప్రశాంతంగా) పాపం! ఈరాయలు నీచేత పొడవబడేగా, ఇంకా మాట్లాడే అవసరం వచ్చినందుకు చింతిస్తున్నాను. అయినా నిద్రపో తున్న వాడిని పొడవటంకంటె, సజీవంగా ఆ కత్తి పోటును ఆహ్వానించే నన్ను పొడవరాదూ? ఇదిగో హృదయం. నీ చుంబనాన్ని .... కాదు, కత్తిని ఆహ్వానిస్తోంది.

చిన్నా: (కుంగిపోయి) కొండవీటిని మీరు ఏ రాజనీతితో జయించారూ? గజపతి మహారాజును ఎలా వంచించిచారు? ఈ రాజకుమారిని ఆటవస్తువుని చేశారు! కాని దానికి జీవం వుంది. ఆమెకు ఎప్పుడూ పరాజయం లేదు.

రాయ: ఇద్దరి భవిష్యత్తులను నాశనం చేశావు. నాలో నిరంతరం నీ కోసం తొంగిచూసే దయార్ద్ర హృదయుడు, పవిత్ర ప్రణయజీవి అయిన ప్రియుణ్ణి చూడలేకపోయావు. ఒక్క క్షణం నీ మనస్సుకు దాసురాలవై, నన్ను నీ ఆటవస్తువుగా చేసుకొనే అమూల్య అవకాశం పోగొట్టుకున్నావు.

చిన్నా: మీరా నా ఆటవస్తువు?

రాయ: దురదృష్టంగా అవును! ఈ ఒక్క లోపం బట్లెంతో ప్రణయయాత్ర సాగించలేను. ఈనాడు రాయలు తన పరాజయాన్ని అంగీకరిస్తున్నాడు. ఏ ప్రేమ ఉద్వేగంకోసం కొండవీటిని, గజపతిని ధారపోయ డానికి ఉంకించానో ఆ అమృతప్రేమ నీ కత్తి నెత్తుటిలో లీనమై హాలాహాలం అయింది.

చిన్నా: ఇంతగా ప్రేమించారా నన్ను?

రాయ: అదంతా గత చరిత్ర. నీ కోసం రాచసుర్యాదని సైతం అతిక్రమించి ఆనాడు అంతఃపురంలో అప్పాజీ సమేతుడనై వచ్చాను. అది నీ కపార్థం అయింది. చిన్నా! రాయల భార్యగా నీవు హంతకివి. రాయల ఊహాప్రేయసిగా నీవు అమరురాలివి!

చిన్నా: ప్రభూ! ఇలా నన్ను హింసించకండి. నన్ను దూషించకండి. ఈ కత్తికి బలిచెయ్యండి. అది నా ఆత్మకి ఆనందదాయకం.

రాయ: రాజకుమారీ! నువ్వు నన్ను పొడవటానికి నిర్దేశింప బడి, ఇలా అర్థించడం విరుద్ధంగా వుంది. అందుకే జ్ఞాపకం చేయడమైంది.

చిన్నా: అవును. కొండవీటిని కబళించి, గజపతిరాజును తలదన్ని చిన్నాదేవిని బలాత్కరించే రాయలు నా కత్తికి ఎప్పుడూ ఎదురే. కాని మీరు వాటికి అతీతులు! అందుకే నా ఆరాధ్య దైవమైనారు.

రాయ: చిన్నాదేవీ! లోకానికి అర్థమయ్యే రాయలునీ

కత్తికి ఎదురు నిల్చినవాడు ఈ లోకం రాజుగా నన్ను గుర్తించినన్నాళ్ళు, అతడు నీ కలభ్యుడు

చిన్నా: (హతాశయై) ప్రభూ! విశాల హృదయులు మీరండి. లోకంకోసం నన్ను వేరుచేసుకుంటారా?

రాయ: ఈ రాయలే రాజు కాక ఒక నిర్ధనుడైన నీ పవిత్ర ప్రేమభిక్షకోసం వస్తే ప్రేమించేదానివా? అది నీ వంశ గౌరవానికి ఎంత భంగకరం! విరుద్ధం! విజయుడు. రాజు అని కదా లోకం నన్ను చూసి ఎలుగెత్తుతుంది. అంతదాకా నీ అఖండ ప్రేమకి తిరుగులేదు. అవునా?

చిన్నా: ఒక స్త్రీ తెలిసో, తెలియకో, అపరాధంగా లోకం నిర్ణయించేపని చేసినంతమాత్రాన మీరూ ఇన్ని రాజ్యాలను జయించిన రాజులు! ఇన్ని యుద్ధాలు చేసిన వీరులు! విస్మరించడానికి వెనుదీస్తున్నారు. లోకం మీ కిచ్చిన లంచం, మీ ఆత్మ బలిదానం కోరింది!

రాయ: చిన్నాదేవి!

చిన్నా: మీ ఆత్మ బలిదానంగా కోరిందని నిర్భయంగా, ప్రాణంవున్నన్నాళ్ళు ఘోషిస్తాను. నేను కలలుగనిన రాయలు ధీరుడు! అతడు విహరించే లోకంలో మైమరచి జీవించే ప్రేయసి చిన్నాదేవి!

రాయ: చిన్నాదేవి! లోకం మనల్ని ఇంత దగ్గరలో వుంచికూడా, తిరిగి ఎన్నడూ కలవనంత దూరం

చేసివేచింది. రాజుగా నీకిచ్చే కృతజ్ఞాపన ఇదే! నీకు లోకంచేత రాణి పట్టప్రధానం అర్పిస్తాను. రాజభోగాలకి అనుగుణ్యమైన అధికారం, లాంఛనాలు యిస్తాను. అంతే!

చిన్నా: అవి నాకు తృణప్రాయాలు! లోకం నన్ను దాసి అని పిలవనీయండి దాని కసి తీరేటట్లు.

రాయ: లోకానికి మనస్సు లేదూ? అది ఆలోచించేవిధం, మానవులకి అందేవిధానం కాదు. వెడుతున్నాను. నీమీద నాకేం కోపంలేదు. పైగా ...(గాద్గదికంగా ఆపుకొని) ఏంలేదు.... శెలవిప్పించు రాణి.

చిన్నా: నేనా? శెలవియ్యనా? (ఏడుస్తూ) ప్రభూ! క్షమించండి! రక్షించండి!

రాయ: (భారంగా) అసహాయుణ్ణి దేవీ!

చిన్నా: (నిరక్తిగా) అవును. జ్ఞాపకంవచ్చింది. స్త్రీ హృదయం ఎవ్వరికి అంతుపట్టని ఒక మహాసముద్రం. ఈ క్షుద్రమానవులకా అందులో ఉద్భవించే ముత్యాలు దొరికేవి? యుగయుగాలు ఆ అనంత గర్భంలో మానవులకి తెలియకుండా వ్యర్థమై పోవాల్సిందే. అయినా, ఈ త్యాగ ప్రేమ ఒక నాడు మీరు తెలుసుకుంటారు. ఈ పాపఫలం మిమ్మల్ని విడిచిపోదు. కాని, ఆ దైవాన్ని తప్పంతా నాది చెయ్యమని ప్రార్థిస్తాను.

(తెరలో "మహాప్రభూ ! మహామంత్రి తిమ్మరుసుల వారు తమరాకకోసం)

రాయ: వస్తున్నా ! త్వరలో ?

[ఇంకో కేక]

మహా ప్రభూ ! కొండవీటి సైన్యాలు ఒక్కసారిగా తిరుగుబాటు ప్రకటించి యుద్ధం చేస్తున్నై.

రాయ: బహుశా రాయల ప్రతాపం వారికి తెలియదు కాబోలు ! ఈ రాయలు ప్రళయరుద్రుడు! పదండి కొండవీటిని నామరూపాలు లేకుండా చేద్దాం. గజపతి నా ప్రాదకాంతుడు కావాలి. చిన్నాదేవి నా చేత పరిత్యజించబడిన కులటవిగా జీవించు !

చిన్నా: ప్రభూ! (ఆవేదనతో) ప్రభూ మీ విశాలహృదయంతో ఆలోచించండి. నేను మీ దానిని ! శత్రువుని కాదు. ఈ త్యాగప్రేమ అర్థం కావటం లేదా ?

రాయ: (మండిపోతూ) త్యాగప్రేమా ?

చిన్నా: అవును.

రాయ: నీతో వాదించే అవకాశం, తీరిక లేవు. ప్రేమ లేకుండా వ్యథిత హృదయంతో జీవించు. వెడుతున్నాను.

చిన్నా: వెళ్ళండి. మీ భౌతిక రూపంతో పనిలేదు నాకు. ప్రేమలేని వ్యధిత హృదయంతో కుమిలిపోతూ జీవించను. త్యాగకారకురాలనై లోకాన్ని నా ప్రేమ సముద్రంలో ముంచేసి నా అనంత హృదయ ఘోషతో దిక్కులు పిక్కటిల్లేటట్లు గర్జిస్తాను.

— సమాప్తము —

[ఆలిండియా రేడియో, విజయవాడ వారి సౌజన్యంతో]



# స మ దృ ష్టి

-: పా త్ర లు -:

జహాంగీర్ : చాకలి

నూర్జహాన్ చాకలి భార్య.

[చెలికత్తెలు, భిక్షుకుడు, సేవకుడు పౌరులు]

# సమదృష్టి

[ ఈ నాటికలోని ఇతివృత్తం జహాంగీరు పాదుషాహా న్యాయ విశారదత్వాన్ని సువర్ణాక్షరాలతో లిఖింప దగ్గ ఘట్టం. జహాంగీర్ ఎంత విలాస జీవియో అంతటి న్యాయ దీక్షాపరుడు; ఈ విషయంలో అతని దృష్టిలో రాజసౌధం: రత్నమయ కిరీటం, నూర్జహాను, పూరి గుడిసెలోని నిరుపేద అందరూ ఒక్కటే! మాసిన బట్టలుతుకు పేద చాకలిదానికి వర్తించే శాసనమే—తనను, తన రాజ్యాన్నీ చిటికిన వ్రేలిపై ఆడించగల నూర్జహానుకూ వర్తిస్తుందని నిరూపించేడు పాదుషా. ]

మొదటి రంగము.

[సూర్యోదయము: రాజోద్యాన వనములోని భవన ప్రాంగణము )

చలికత్తెలు—

ఉదయారుణశోభను—వీక్షింపుమా
నవ వర్ణంబుల, నీలి! మబ్బుల—నాటలాడెను.
నా నవ్య సూర్యుని—చూడుమా
దేవాది దేవిని దర్శింపుమా—దేవి
కాంతి పుంజములు—గగనమంతటా—
కమలినీ—కనుగొనుమా ?—
జిగేల్—జిగేల్‌మని; మిల, మిలమని—
క్రమ్ముచున్నవా కిరణజాలములు !—కొమ్మా!
ఉదయారుణ శోభను—వీక్షింపుమా.

సూర్జహాస—

పద్మము లన్నియు—పకపకలాడగా
పుష్పపుప్పొడి—పరిమళించెగా—
నృత్యముచేసే నవవసంతము—హాయిగా—
నవ్వుచున్నదదిగో!—మనసారగ—
పలు దిక్కులకు—పలవరించుచు—
ఝుం, ఝుం, ఝుం, ఝుం, ఝుంమ్మనుచు—
భ్రమర రాజములు—బయల్వెడలెగా

చలికత్తెలు—

లెమ్మా—రమ్మా—పొమ్మా—పొమ్మా
చర, చర, చర, చర—బిర, బిర, బిర, బిర
బయల్వెడలుమా—బంగరు బొమ్మా
ఉదయారుణ శోభను—వీక్షింపుమా,

నూర్జహాన్: చెలియలారా ఇంకా ఆలస్యమెందుకు ?
జహాపనా రాకపూర్వమే వనవిహారము ముగిద్దాం

చెలి ; రాణీ సాహెబా ! ఈనాడు వనమెంత సుందరముగా నున్నది! ఎటు చూచినా దివ్య దృశ్యములే గోచరిస్తున్నాయ్ !

నూర్జ: ఈ సమయములలో, జహాపనాతో వేటాడుటకుపోతే ఎంత బాగుండును ? (విచారముగ) ఇంకను విలువిద్యను సంపూర్ణముగ నేర్వలేక పోయాను! సఖీ ! నాకు విలువిద్య వస్తుందా ? అని ఒక్కటేకదా నా కొరత ? (నిట్టూర్చును)

చెలి : అమ్మా ఎందుకీ నిస్పృహ ? ఇట్టి సమయాలలో విలువిద్య సభ్యసిస్తేనే కదా నేర్పరి వగుతావు ?

నూర్జ : అట్లయితే వెంటనే విల్లంబులు తీసుకురా—

చెలి : ఇదిగో తయార్ బేగమ్ సాహెబ్.

మరియొక చెలికత్తె : మహారాణీ, ఆ పచ్చటి చెట్లమధ్య ఎఱ్ఱగా, ఒంటరిగా వ్రేళ్లాడే. మధుర ఫలాల్ని కొట్టి మాకియ్యి ! చూస్తాం ! నీ సామర్థ్యం

నూర్జ: ఓస్ ! ఇదిగో పడిందో లేదో, చూడు !

మరొకతె: అబ్బ—బేగమ్—ఎంత నేర్పరివి!

చెలి : ఆ పచ్చచెట్ల మధ్య కిచకిచలాడే ఆ పక్షుల జంటలలో నొకదాన్ని. కొట్టు.

నూర్జ: ఎంత కఠినురాలివే ! ముచ్చట్లు చెప్పుకునే ఆ ముద్దు జంటలను విడదీయమంటావా ?

చెలి : పోనీ ఆ చిటారుకొమ్మన అంటిపెట్టుకున్న ఒంటరి ఎందుటాకును కొట్టు!

ఒక తె: చాలా దూరంకదూ ?

నూర్జ: అయినా ప్రయత్నిస్తా (బాణం వేస్తుంది)

చెలి : గురితప్పిపోయింది. మళ్ళీ

ఒక తె: ఈసారి పడుతుంది.నాకు హారం తప్పకుండా ఇస్తుంది మా రాణీ.

నూర్జ: పడింది (సంతోషంగా) మాలతీ — తీసుకో, హారాన్ని.

చెలి : మరి నాకో ?

నూర్జ: అంతా కొంటె పరుకే. ఇలా కమ్మటి కబుర్లతో నా మణి హారాలన్నిటినీ కాజేసే టట్లున్నారు! (నవ్వుతుంది)

ఒక తె: ఒక్కటందడివ్వండి!మా లచ్చి వేసుకుంటా.... వెయ్యి మంది కొడుకులు గలగాలి మా రాణికి.

నూర్జ: వెయ్యిమంది చాలూ? బలే దానివి ! చూడు ఆ వక్క వినయాలు... అవీనీ!—సరే తీసుకో (చిరునవ్వు నవ్వుతుంది)

సేవ : (ప్రవేశించి) రాణి బేగమ్; పాదుషా వారు వస్తున్నారు.

[అందరూ నిమ్క్రమిస్తారు.]

జహాంగీరు : (ప్రవేశిస్తూ)

సఖియా—సంతసమా—

ఓహోహో—శోభ!— ఈ నూతన శోభ

ఊగుదమా—ఉయ్యాలా
జాగేల—ఇక—జాగేలా
ఒంటరిగా—మరి జంటలుగా—
సఖియా—సంతసమా

నూర్జహాన్—

జర—జర—జర—జర
పోవుదమా—పుష్పవనికి
పరిమళమూ—పరుగున రాగ
పుల్కరించితి—పరవశ మొందితి—
సఖుడా—సంతసమోయీ!

జహాంగీర్—

చప్పరించి—ఆ చిగురు జొంపముల
"కుహూ,కుహూ కుహూ" కూసెగా, కోయిల
ఆ కొంటె కోయిలా!

నూర్జహాన్—

నవవసంతము—నాట్యమాడెగా
నలుదిశల—నవ్యరతుల
సఖుడా—సంతసమోయీ?

జహాం: (ప్రక్కకుచూచి నవ్వుతాడు.)

నూర్జ: జహాపనా! ఏమిటా ఆకస్మిక నవ్వు ఏమిటి విశేషం?

జహాం: ప్రియా!— ఈ విల్లు-బాణాలు ఎందుకు? ఎన్నాళ్ళ నుంచి!—చాల అలసిపోయా వనుకుంటా ఈ పాటికి

నూర్జ : నిజమే పాపం!— ఆ శకటం నుంచి దిగి నా దగ్గరికి వచ్చేటప్పటికి, మీ కుసుమార పాదా లెలా అలసిపోయాయో, కదా ?

జహాం: అంతమాత్రానికే? ప్రియా! నీ కోసం ఎన్ని యోజనాలైనా నిమిషాలమీద నడుస్తా!— నూర్ ! నా మధుమూర్తీ.

నూ : ఆ ప్రేమామృతం ఈ ఉద్యాన వనాన్ని ముంచెయ్యాను కదా? ఎందుకు కల్లిబొల్లి మాటలు! మధువు కంటె మధురతరమైన దానినా నేను!—

జహాం: ఇల్లా నా కళ్ళల్లో చూసి, అను, ఆ మాటలు! తల వంచుకుంటావేం? ప్రణయ కోపం మొదటి దశ గాబోలు.

నూ : ఇన్ని మాటలు చెప్పే ఆ పెదవులెప్పుడన్నా, నన్నా మీతో వేటకు తీసుకుపోడానికి ఒప్పుకుంటున్నాయ్? చెప్పరేం, ప్రియా ?

జహాం: (మృదువుగా) నిన్ను చూస్తే జాలేస్తుంది! బాణం పట్టుకోలేని పసిల్లవు — ఆ కీకారణ్యాన్ని, క్రూర మృగాల్ని చూసి భయపడతావని, నీ లేతగుండె వణుకుతుందని, నీ పాలుకారే బుగ్గలు ఎర్రబడతాయని ఆ చిన్న, తియ్యటి పెదవులు ప్రకంపిస్తాయని, ఆ కొట్టవచ్చే....

నూ : చాలు! జహాపనా చాలు! ఇంక భరించలేను! ఎందుకు నన్నట్లా ఉడికిస్తారు? (గాంభీర్యంగా) మీ సముఖంలో

నా విలువిద్యా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తా. మీ మన స్సుకు నచ్చితేనే అంగీకరించండి !

జహాం: ప్రియా— నీ విలువిద్యా ప్రావీణ్యము ఈ దాసు నికి నేత్రానందము కలిగిస్తుందనుకో వచ్చా ?

నూ : జహాపనా ! ఎంత మాట ! ఆజ్ఞాపించండి ! దేనిని గురిచూచి కొట్టమన్నారో ?

జహాం: ప్రియా! ఆ మామిడిపండు గురిచూడు

నూ : (బాణం వేస్తూ) సఫలీకృత నగుతాననుకుంటా!

జహాం: సెభాష్! సరేగాని - ఈ చిటారు కొమ్మను.

నూ : (బాణం వేస్తూ) అల్లా, నాకు తోడుపడుగాక! అల్లా!

జహాం: సభాష్, ఈసారి విజయీభూతవైతే తప్పక నాతో వేటకు తీసుకుపోతా. నూర్, నీకా ఎటువంటి నమో దయం !

నూ : (గర్వంగా) అవును! 'ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్' అన్నాడుగాదా తెలంగాణా కవి! ఏమి శెలవు ఈసారి ? (సిద్ధంగా వుంటుంది)

జహాం: మనకోట బురుజు శిఖరాన్ని కొట్టు.

నూ : నా ప్రావీణ్యమును జూచి కురిపించే ముద్దుల వర్షానికి నే నాగగలనా! ప్రయత్నిస్తా (వేస్తుంది.)

["అబ్బా" తెరలో ఆర్తనాదము.]

జహాం: అరే! గురి తప్పింది. అపాయము సంభవించలేదు కదా! ఆ ఆర్తనాద మేమోకదా!

నూ : జహాపనా ! నా కుడి కన్నందుకో అదురుతూంది!
ఏ ప్రాణికన్నా అపాయము జరిగియుండగు కదా.

జహాం: ఈ వినోద సమయ మిట్లు విషాదాంతమైనది! ఇట్లే మన జీవితములు విషాద పూరితములు కావు కదా! దేవీ! నేటికి వన విహార విలాసమును ముగించి, కోటలోనికి పోదాము రా.

[వెళ్ళుతారు - తెర]

రెండవ రంగము.

జహాంగీరు పాదుషా దర్బారు. నూర్జహాన్ రాజోచిత వస్త్రములతో అలంకరింపబడి యున్నది ప్రజల విన్నపముల కొరకు నిర్దేశింపబడిన "న్యాయ గంట" మ్రోగుతుంది.

జహాం: అజ్మల్ ఖాన్! న్యాయార్థులను ప్రవేశపెట్టు!

[గాయపడిన గుండెతో చాకలి, అతడి భార్య ఏడుస్తూ లోపలికి వస్తారు.]

చాకలి : చాకలి భార్య దండం, మారాజులు .... నేటికి ఆపద కలిగింది.

నూ : (తనలో) నాకు చాల భయంగా వుంది. జహాపనా చాల పిచ్చివారు.

జహాం: చాకలీ, విషయమును విశదీకరించుము.

చా, భా: మా రాజా, నేను మా మావఁ రాజవీధిగుండా బట్టలు తీసుకు.... పోతుండాము.

జహాం: కానీ....

చా. భా: ఏడుస్తూ, ఎన్నడూ ఎరుగని విషయం జరిగింది.
(రోదిస్తుంది)

నూ : (ఆదుర్దాగా) ఏం జరిగింది ?

చా : (బాధతో) మా మహారాణివి. విను తల్లీ, ఆ అగు పడే కోట గోపలి నుంచి, అబ్బా! బాధ- ఓ పదును గల బాణం... ఏం చెప్పను! (ఏడుస్తాడు.)

నూ : (వణుకుతూ) జరిగిందీ? అనుకున్నంత పని జరిగిందీ! అల్లా! రక్షించుగాక. ఏదీ బాణం చూపించు లక్ష్మీ!

చా భా: ఇదిగో తల్లీ - మా రాణి మా సుబ్బణ్ణి పొడిచిన బాణం !

చా : (ఏడుస్తూ) మా రాజా! ఇంక ప్రాణాలు నిలవవు! హా!

జహాం: తెలిసింది ! రాణీ ! నీ బాణం ఆ అభాగ్యుడి ప్రాణాన్ని అంతం చేసింది ! నూర్ -

నూ : జహాపనా !

జహాం: నీ తృష్ణ తీరిందా ? ఆ అనాథుడి అశ్రుకణాలు నీకు ఆనందతరంగాలవ వలసి వచ్చిందా ?

చా : (ఏడుస్తూ) ప్రభువుల వారికి ఒక మనవి! నే పోతే మా లచ్చికి తిండి - బట్ట దొరకవు.

జ : చాకలీ. దీనికి శిక్ష ఏమిటో చెప్పు ? నేను చూస్తూ ఉండగా, నా సముఖంలో, నా రాణి నూర్జహాన్ బాణాన్ని వదిలింది.

చా : లచ్చిమి (ఆశ్చర్యంతో)మహారాణీవారా! అయ్యో!

జహాం: అవును. దీనిలో అతిశయోక్తి ఏమీ లేదు !

చా : నా ప్రాణం కడంటింది ప్రభూ! మహారాణి చేతిలో

చస్తున్నప్పుడు దిగులు ఎందుకు ? లచ్చిని మీ కప్ప
గించి, మీ రక్షణ క్రింద వుంచి హాయిగా చస్తా

నూ : (కన్నీటితో) చాకలీ, నీ కా భయం అక్కర లేదు.

చా : నాకేమీ వద్దు ఇంక ! రాజూ ! (మరణిస్తాడు)

జహాం: నూర్! ఈ మరణంతో నాకు మనశ్శాంతి వుండదు. (సేవకునివంక తిరిగి) అజ్మల్ ఖాన్, విల్లు, బాణాల్ని తెప్పించు.

నూ : (కన్నీటితో) జహాపనా ! ఎందుకు ?

జహాం: ప్రియా! ప్రాణానికి ప్రాణం, రక్తానికి రక్తమే శిక్ష !

నూ : (ప్రశ్నిస్తూ) బోధపడ లేదు

జహాం: (నిర్భయంగా) నా భార్య చేతవల్ల లక్ష్మి అనాధ అయింది. అలానే లక్ష్మి వేసిన బాణం వల్ల నీవూ అనాధవు కావాలి అదే నా రాజకార్య నిర్వహణం! జహాంగీరు న్యాయము!! నా కర్తవ్యము (బాణాన్ని, విల్లుని ఇస్తాడు)

సభికులు :- పలువురు పాదుషా! జహాపనా !! హుజూర్!!!

నూ : (కాళ్ళమీద పడి) జహాపనా !

చా. భా: ప్రభూ ! మీరు నా చేతుల్లో చావడమా! ఎప్పుడైనా ఈ చేతులు సాహసిస్తాయా ? అలా చెయ్యలేను! స్వామీ !

జహాం: నీ కర్తవ్యాన్ని నువ్వు కావించు.

నూ : (గద్దె దిగివచ్చి లచ్చిని కావలించుకొని) లచ్చీ! నాకు పతిభిక్ష పెట్టవూ ?

చా.భా:(విల్లుని, బాణాల్ని పారేస్తూ) రాణీ! నే నన్నా చస్తా కాని అలాంటి పని చెయ్యలేను.

సభికులు:- జహాపనా! లక్ష్మి ఆ జన్మాంతం రాణీవారి పోషణలో వుండడం న్యాయం.

జహాం: లక్ష్మి, పోని దీనైనా అంగీకరించు. నీ పోషణార్థం, సుబ్బడి ఆత్మశాంతికోసం గోల్కొండ మాన్యం యిచ్చేశా! సభికులకు సమ్మతమేనా? సంతసమని నమ్ముతా.

అందరూ: జై జహాంగీరు పాదుషాకు జై! న్యాయవీరునకు జై.

[బిచ్చగాడి పాట దూరాన్నుంచి వినిపిస్తోంది.]



# త్యాగ శిబి

## -: పాత్రలు :-

శిబి చక్రవర్తి

అగ్ని

ఇంద్రుడు

# త్యాగనిధి

[స్వర్గలోకంలో ఇంద్రుడి కొలువు]

అగ్ని : ఇంద్రులు ఆలోచనలో ఉన్నారు; విశేషం ?

ఇంద్ర: ఆఁ ఆలోచనే !

అగ్ని : ఏ లోకంలో విహరిస్తున్నారు. ప్రస్తుతం ?

ఇంద్ర: ఏ లోకమయితేనేం ? ఈ లోకాలకి తారతమ్యాన్ని నిర్దేశించినంత మాత్రాన జీవుల్లో ఉదాత్తత వస్తుందనా ?

అగ్ని : త్రిలోకాధిపతే ఇలా అనడం విశేషమే ? మన స్వర్గలోకానికి సాటివచ్చేదివుందా అని - దేంట్లోనైనా ?

ఇంద్ర: భూలోకం ఎందులోనూ తీసిపోదు. అగ్ని, ఈనాడు అక్కడ దేన్ని పరిశీలించినా గౌరవ తదమైన విశ్రాంతి కలుగుతోంది. పవిత్రము, మహోన్నతము అయిన ఆనందాతిశయం లభించి, సత్యాధర్మమైన త్యాగం ఆ సీమలో తాండవిస్తోంది.

అగ్ని : స్వర్గంలో మృత్యువు లేదు. సౌందర్య రూపులైన రమణులు శృంగార పిపాసులై అప్సరసలు. కొంత లేని వైభోగాన్ని చూస్తూ, అనుభవిస్తూ ఆకళింపు

చేసుకొంటూనే ఈ బాధ మాటలు దేనికి ? ఇంక త్యాగమా - త్యాగధనులైన ఋషిపుంగవులే కదా తమ తపో బల మహిమచే ఇక్కడికి అరుదెంచినది !

ఇంద్ర: త్యాగము. స్వార్థము నెరుగనిది - ఇక్కడి త్యాగధనులు నిష్కాములు కారు

అగ్ని : ఇంద్రా! భూలోకంలోమీ దృష్టిని ఆకర్షించిన అట్టి త్యాగం !-

ఇంద్ర: శిబిచక్రవర్తిది-త్యాగంలోని అఖండ నిర్మల ఆనంద అనుభూతిని, శాంతిని అనుభవిస్తున్న అమరజీవి.

అగ్ని : తన ప్రాణం— కూడా విస్మరించించా ?

ఇంద్ర: సందేహమా —

అగ్ని : భూలోకంలోని ఒక రాజు. భోగలాలసుడు, ప్రాణాలొడ్డగల త్యాగధనుడట— ఎంత హాస్యాస్పదంగా వుంది!అగ్నికి విచక్షణాజ్ఞానం వుందని తెలుసుకో - ఇంద్రా —

ఇంద్ర: దాని అతివయోక్తులతో త్రిలోకాధిపతి ఆనందించే మనస్తత్వం అలవరచుకోలేదూ —

అగ్ని : ప్రత్యక్ష నిరూపణ —

ఇంద్ర :సిద్ధం —

## 2

[శిబి చక్రవర్తి ఆస్థానం]

[అగ్ని తరుమబడుతున్న పావురంగాను, ఇంద్రుడు వేటాడే డేగ గాను మారి ఆకాశంలో విహరిస్తూ కొలువు

తీర్చియున్న శిబిచక్రవర్తి వద్దకు రాగా, భయవిహ్వాలమైన పావురం శిబిని శరణు జూస్తుంది.]

పావు : ఆశ్రిత రక్షణా — ధర్మ ప్రభూ — శరణు —

శిబి : (ఉద్విగ్నంగా) అది శిబి జన్మహక్కు — నా చిన్ని పావురమా ! అలా బెదరుతూ నా వంక చూడక ! నా ధృఢమైనచేతుల్లో నీ కిట్టి జంకు కలత పెట్టరాదు.

పావు : ప్రభూ.... అనాధను — అసహాయను — ఈ క్రూరమైన డేగకి ఒక విలాస భక్ష్యాన్ని! — ఈ అబలకు విలువ ఏముంది ఈ లోకంలో ?

శిబి : జీవరాశి కంతటికి జీవించే ప్రాధమిక హక్కు, రక్షణ వున్నది. అధికుడు, అల్పుడు - వీరిమధ్య నిరంతర పోరాటం జరుగుతోంది. అన్యాయాన్ని ఎదుర్కొక, ఈ అభాగ్యులకు ఒక అశ్రుతర్పణంరాల్చని మానవ హృదయ నిష్ఫలం !

డేగ : (వారిస్తూ) క్షమించండి- రాజా.... మీ వాక్కులు అన్నీ సహిస్తూ వింటున్నాను — "శరణు" నెపంతో నాకు జరగబోయే అన్యాయం అవగాహన చేసికొన్నాను. నా స్వతస్సిద్ధమైన ఆహారార్జన హక్కుకి ఆటంకం కల్పించ జూడటం అపచారం —

పావు : ప్రభూ ! — ఈ దీనురాల్ని విడనాడతారా ?

శిబి : పక్షిరాజా.... ఆశ్రిత రక్షణ నా ధర్మం — నీ కింక పావురముతో నిమిత్తం లేదు — సంఘర్షణ ధర్మయుతంగా మన మధ్య జరగనీ —

డేగ : మహారాజుతో డేగకు సంఘర్షణా!—

శిబి : న్యాయానికి విచక్షణలు లేవు —

డేగ : అకారణంగా మీతో సంఘర్షణ పడటం శోచనీయం. గోటితో పొయ్యేదానికి గొడ్డలి తెమ్మంటున్నారు. ఈ చిన్ని పావురం కోసమా ఇలా పటుబడుతున్నారు!

శిబి : అవును — ఏమైనా కానీ!—

డేగ : మీ ఆనతి ప్రకారం నా వినతి వినండి. ఆహారార్జన నా జన్మహక్కు అని అంగీకరించిన మీరూ, పావురం బదులు మీరే బాధ్యత వహించిన మీరు నాకు పావురంతో సరితూగగల మీ శరీర మాంసాన్ని అర్పించే కార్యానికి బద్ధులవుతున్నారని మనవి.

శిబి : క్లిష్ట సమస్యా పరిష్కారానికి మంచి ఆలోచన. ఈ కార్యంవల్ల కలిగే త్యాగానందానికి - నీకు కృతజ్ఞుణ్ణి.

పావు : ప్రభూ! ఏమన్నారూ? ఏం చేయబోతున్నారు? ఈ క్షుద్ర జీవికోసం మీ విశిష్ట జీవాన్ని అర్పిస్తారా? ఈ అఖండ త్యాగం నన్ను చిరకాలం దహించగలదు. నన్నే అర్పించుకోడానికి అనుమతించండి.

శిబి : నీ సానుభూతికి ధన్యుణ్ణి. శిబి నిర్ణయానికి తిరుగు లేదు. పక్షిరాజా, సంసిద్ధుణ్ణి.

డేగ : ఇప్పుడైనా మించిపోలేదు. ఒక్క మాటతో ఘోర విపత్తు తప్పిపోగలదు.

శిబి : అసహాయుణ్ణి. ఎవరక్కడ? త్రాసు, కత్తి పరికరాలు సిద్ధం చేయండి. ఆజ్ఞ.

[హాహాకారాల మధ్య శిబి చక్రవర్తి సంతాపంతో కుమిలిపోయే పావురాన్ని ఒక తక్కెడలో వుంచి, తన దేహంనుంచి మాంసాన్ని కోసి మరో తక్కెడలో వేస్తుంటాడు]

పావు : ఈ రక్త ప్రవాహం, ఈ హృదయ విదారక దృశ్యం చూడలేం. భరించలేం! పక్షిరాజా, నన్ను గ్రహించు. త్యాగమూర్తిని రక్షించు.

శిబి : పావురమా! దేహాతీతమైన ఆనందం ఉదాత్తమైనది.

పావు : పక్షిరాజా! చక్రవర్తి కాళ్ళను, చేతుల్ని అర్పించారు. జీవాన్ని హరించే ఆ మిగతా దేహాన్ని అర్థించకు. త్రాసు తూగ లేదని నూర్ఖించకు. ఇంకా దయలేదా ఓ పాషాణ హృదయుమా!

శిబి : పక్షిరాజా! దురదృష్టవంతురాలివి. ఇదిగో పావురంతో తూగేందుకు నా మాంసాన్నంతా అర్పించాను. కడసారిగా ఈ నా అస్థిపంజరాన్ని సమర్పించుకొంటున్నాను.

డేగ : త్యాగనిధీ! శిబి చక్రవర్తీ! ఆగు. ఆగు.

[దేవతలు జయజయ ధ్వానాలు చేస్తూ పూలవర్షం కురిపిస్తారు]

[త్యాగ శిబికి జై. ధ్వనులు]

[ఒక్కసారి డేగ ఇంద్రుడిగాను, పావురం అగ్ని గాను మారుతారు]

అగ్ని: మహాత్యాగీ! నీ త్యాగం అసమానం. వర్ణనాతీతం. ఈ మా పరీక్షలో అఖండ విజయం పొందావు. మమ్మల్ని క్షమించి, అనుగ్రహించు.

శిబి : మహనీయులారా! నా విశ్వాసానికి పునరుద్ఘాటన జరిగే అవకాశం కల్పించినందుకు మీకు కృతజ్ఞుణి.

అగ్ని: ఓ మహాత్మా! మీకు యథా శరీరప్రాప్తి కలిగి సుఖింతురు గాక! ఆచంద్రార్కమగు కీర్తితో, శిబీ ... చిరంజీవి వవుదువుగాక!

ఇంద్రు: శిబిచక్రవర్తీ, నీ అతిశయము చరితార్థము. జీవితము ఉజ్జ్వలవంతము; త్యాగము అసమానము.

శిబి : మహనీయులారా! మీ అభీష్టానికి అర్హుడనయ్యే నైతిక బలప్రాప్తి కొరకు సదా చింతన చేయగల మహా తపస్వినగుదును గాక!

అగ్ని:
ఇంద్రు: వీరత్యాగ శిబీ! ఇదే మా శ్రద్ధాంజలి.

[ఆలిండియా రేడియో హైదరాబాదు నుండి ప్రసారము]



# తండ్రి కొడుకులు

పాత్రలు :

| | | |
|---|---|---|
| రుస్తుమ్ | — | పర్షియన్ వీరుడు |
| షొరాజ్ | — | రుస్తుమ్ తనయుడు |
| పెరన్ వైజా | — | టార్టార్ జాతి అధిపతి |
| గుడూర్జ్ | — | పర్షియన్ సేనాధిపతి |
| పెరూబర్జ్ | — | పర్షియన్ సైన్యాధ్యక్షుడు |

# తండ్రి కొడుకులు

[పర్షియన్ వీరుడైన రుస్తుమ్ భార్యకు షోరాబ్ అను కుమారుడు కలిగినప్పటికి, అతనిని యుద్ధమునకు పంపుటకు ఆమెకు యిష్టములేక భర్తకు, పుత్రిక జనించినట్లు కబురంపును. కాన రుస్తుమ్ తన సంతతి పుత్రుడు కానందుకు వగచి విరక్తి చెంది, రణభూమినే స్వగృహముగా భావించినాడు. ఈ మాతృప్రేమ వలన కలిగిన పరిణామమే షోరాబ్‌ను శత్రు పక్షమగు టార్టార్ జాతియందు చేరి జనకుని అన్వేషించుటకు కారణమైనది. ప్రకృతి నిశ్చింతగా విశ్రమించిన నిశీథ సమయము. పెరన్ వైజా సైనిక గుడారము శయనాగారము.]

పె : హుజూర్!

పెర : కలత నిద్రతో — ఎవరూ ?

ప్రవే: మీ పుత్ర తుల్యుడు షోరాబ్.

పెర : ప్రవేశ పెట్టుము.

షోరా: ప్రభూ !

పెర : ఆఁ ! నువ్వా, నిశీథిలో నీరాకకు కారణం ? ప్రతి కక్షుదళాల విజృంభణ కాదుకదా? – (తటపటాయించి) – ఇలావచ్చి కూర్చో.

షోరా: అంతటి ప్రమాద సమయం రాలేదు ప్రభూ ! – (కూర్చొని) – నా తీవ్రహృదయ వేదనను భరించలేక వచ్చాను. రాత్రింతా అశ్రుకణాల్తో పక్కను తడుపుతూ కుమిలిపోయాను. కాని నా జీవితం.... ఏం చెప్పను ప్రభూ !

పెర : (సాదరంతో) ఎందుకు కుంగిపోతాన్ షోరాజ్ ? ఇన్నాళ్ళు లేని బాధ ఇప్పుడెలా కలిగింది ? ఈ బాధ నీ కెవరు కల్పింప సాహసించారు ? నీ కోమల ముఖ పద్మంలో ఒక విషాదరేఖ మెరిసిందంటే నా హృదయఫలకం మీద ప్రతిఫలిస్తుందని నీకు తెలియదు కాబోలు!

షోరా: గాలైనా మీ రక్షణ క్రింద వున్నప్పుడు నన్ను బాధించలదా ? కాని బ్రతికియున్న నా జనకుని, ఆ వీర రుస్తుమ్‌ని వీక్షించ నందుకు సిగ్గుపడుతున్నాను. నాలో ఇన్నాళ్ళు ప్రబలిన తీవ్రవాంఛలు విజృంభించి, మతివిహీనుని చేస్తున్నాయ్.

పెర : నామాట విను. ఇది కాదు విచారానికి సమయము. పెంచిన ప్రేమ పితృప్రేమ కంటె గొప్పది కాకూడదూ ! నీకు తెలియదు – చిన్నవాడివి

కదూ ? అనుభవ గాథలలో నలిగిపోయిన ఈ జీవికి తెలుసు.

షోరా: ఈ నూనగారు మీసాల యౌవన శోభను తిలకించి, ఆ ధవళ కాంతుల్ని వెదజల్లే గడ్డంనుంచి ఎటువంటి దరహాస చంద్రికల్ని వెదజల్లుతాడో ఆ పిచ్చి తండ్రి.

పెర : పిచ్చివాడా, యౌవన రక్తం దుడుకుగా ప్రవహించే యీ వయస్సులో నీకు సమయా సమయాలు జ్ఞప్తికి వస్తాయా! కాలం రావద్దూ దేనికైనా. కొద్దికాలం ఆగు. నీ తండ్రి నిన్ను చూచి నేత్రానందం పొందే భాగ్యాన్ని ఆహ్వానించు. తప్పదు.

షోరా: తండ్రీ, నాలో నైరాశ్యం కల్పించకండి. ఆ ముఖారవిందాన్ని అవలోకించండి. అంత మవుతుందా ప్రభూ, నా మనో వేదన ?

పెర : టార్టార్ పరిషన్ల మధ్య జరిగే భీకర సమరాలు నీ పెరుగనివా! ఎందుకలా ముఖం చిట్లించుకుంటావు ? నా మాటలు నీకు రుచించటం లేదా ? వైద్యుడు వినోదం కోసం రోగికి మందిస్తాడా ?

షోరా: జనకుని అన్వేషించడం పుత్రధర్మం. ఆ ప్రేమ అంతరించనిది. ముత్యపు చిప్పలో రత్నాలుద్భవిస్తాయి. పద్మంలో తేనె యుంటుంది. అంత సహజంగా ఆ ప్రేమ పుత్రునిలో ఇమిడీకృతమై ఉంటుంది. నిర్మల గంగా ప్రవంతివలె, తేటతేనియ

వలె, హిమగిరి శిఖరమువలె అది గంభీరమైనది, మధురమైనది, ఆదర్శవంతమైనది.

పెర : కాదనను. కాని జీవిత జలధిలో అనుక్షణం పొంగి పొర్లే కెరటాలు కష్టసుఖాలు. అనుభవం లేని వాడివి. చీకటి లేంది వెలుతురికి విలువేముంటుంది? అలాగే బాధలేకపోతే వ్యసన రుచి బోధపడదు నాయనా.

షో రా: అవకాశమే లేదంటారా? కాదనకండి.

పెర : లేదు. బాగా ఆలోచించుకో; షోరాజ్.

షో రా: ప్రభూ! మీ మాటలు సమ్మతింప లేకున్నా. 'నీ పితృప్రేమ నశించిందా? ఎన్నాళ్ళీ సందిగ్ధ జీవితం గడుపుతావు?' అని అంతరాత్మ ముక్త కంఠంతో గగ్గోలు పెడుతూందిహృదయాంతరాళంలో.

పెర : యౌవన చిత్తచాంచల్యం. నా షోరాజ్!

షో రా: అంతేనంటారా మళ్ళీ. అంగీకరించ లేను. ఒక్కచో నిశ్చితాభిప్రాయం దేవతలడ్డినా, నేను మరణాన్ని కౌగలించినా... నావి వీరరక్తం కాదా?

పెర : నీ అభిప్రాయం వివరించు. జాగెందుకు?

షో రా: ఒంటరి యుద్ధానికి యీనాటి సమరాన్ని వారించి ఏ పర్షియన్ పేరునితో నైనా సరే నన్నెదుర్కొ నేందుకు సవాలు చెయ్యండి. అదే నా దృఢ నిశ్చయము; నా కార్య విజయానికి అంకురార్పణ.

పెర : అంతమాత్రంచేత—

షోరా: నన్ను రుస్తుమ్ తప్ప, యీ యుద్ధంలో మరొకరు ఎదుర్కొనలేరు. రుస్తుమ్ కర్ణపుటాలలో నాపేరు ప్రతి ధ్వనిస్తుంది. నా కార్యఫల సిద్ధి అవుతుంది.

పెర : ప్రమాదకరమైన పద్ధతిని యోచించావు.

షోరా: క్షమింప ప్రార్థితులు. సునిశిత స్వాతంత్ర్య బుద్ధికల వాడు పోరాటానికి వీరోచిత కార్యానికి వెను దీయుడు.

పెర : సహజంగా - మనం - అనుకున్నట్లు కార్యాలు జరగవు అది దైవ శాసనము. షోరాజ్

షోరా: కార్యనిశ్చయానికి వచ్చిన తర్వాత యోచనకు, పునర్విమర్శకు తావు లేదనవచ్చునా ?

పెర : ఉలిక్కి పడి-షోరాజ్, ఏదో అపసూచక చిహ్నం ప్రత్యక్ష మౌతోంది నామనఃపథంలో.

షోరా. ధైర్యాన్ని అడ్డగల శక్తి ప్రపంచంలో లేదు.

పెర : నా కడసారి మాట విను.

షోరా : అసహాయుణ్ణి.

పెర : సింహం పిల్లకి పోలిక తప్పుతుందా ? (విచారంతో) కాని, ప్రేమకాదు ప్రళయం సుమా.

(పెరన్వైజాషోరాజ్ వెలిబుచ్చిన అభిప్రాయాన్ని పర్షియన్ సేనాధిపతియగు గుడూర్జు తెలిపి సమ్మతి పొందుతాడు. గుడూర్జు ఈ విషయం సర్వసైన్యాధ్యక్షునగు పెరూబర్జుకు తెలుపడానికి వస్తాడు.)

గు : పిరన్ వైజా ఈ ప్రతిజ్ఞను గురించి చాలా వీరోచితంగా చెప్పాడు.

పిరూ· ఏమన్నావ్ ?

గు : అనేదేముంది. పర్షియన్ జాతి ఎప్పుడూ వెనకడుగు వేయదు. జ్యోతిని కోరే జీవన్మృతమైన జ్యోతి అని చెప్పాను.

పి : సమయోచితమై జవాబు

గు : సరేగాని షోరాబ్‌ను ఎదుర్కొనే వీరుడెవరు ?

పి : అదే పెద్ద సమస్య. కాని అన్నిటికంటె నీసామర్థ్యంపై మన విజయం ఆధారపడి వుంది.

గు : చెప్పండి. నా శక్తి కొలది ప్రయత్నిస్తాను.

పి : మెల్లిగా - రుస్తుంని ఒప్పించాలి ఎలాగైనా!

గు : అది సాధ్యమా ?

పి : అసాధ్య మేమిటోయ్ వెఱ్ఱివాడా ? తలల్ని మార్చి తలల్ని అతికించే నీ చేతిలో లేనిదేముంది ? పోయి, కార్యసాఫల్యం చెయ్యి.

గు : ప్రయత్నిస్తా. ఆయన దగ్గరికెళ్ళటం సింహంబోను లోనికి పోవడమన్నమాట.

పి : ఇంక వెళ్ళు. నీకు విజయం సిద్ధిస్తుంది.
(గుడారువిశ్రాంతితీసుకొంటూ ప్రశాంతంగాకాలం గడుపుతన్న రుస్తుమ్ గుడారానికి వెళ్ళుతాడు. షోరాబ్‌ని ఎదిరించే ప్రతిజ్ఞ నిర్వహణానికి)

గు : (నమస్కరించి) - రుస్తుమ్, మహాశయా ...

రు : (సాదరంగా లేచి) - గుడూర్జు, ఎన్నాళ్ళయింది నేత్రానందం కలిగి- ఇలా వచ్చి, మధుర ఫలాలు సేవించు.

గు : ప్రమాద సమయం కాని, విందు సమయం కాదని నా మనవి. మధుర ఫలాలా ? జాతి మరణించే సమయంలో....

రు : (నిదానంగా)- ప్రమాద సమయమా ?

గు : అవును. షర్షియన్ జాతికంతకూ....

రు : ఆఁ, షర్షియన్ జాతికా ? చెప్పు, త్వరగా చెప్పు. ఆ మాటకే శరీరం గగుర్పొడిచి ఉప్పొంగుతోంది.

గు : టార్టార్ వీరుడు, షోరాజ్ షర్షియన్ వీరులపై ఒంటరి యుద్ధానికి సవాలు చేశాడు.

రు : అయితే మన వీరుడు గెలిచాడా ?

గు : ఆగండి. ఎదుర్కొనేందుకు మీ సహాయాన్ని అర్థిస్తున్నాము.

రు : నావరకెందుకు? పిచ్చివాడా!

గు : షోరాజ్ టార్టర్ వీరులలో మేటి. అతని పేరు దశ దిశలా మారు మ్రోగింది. మీరు తప్ప మాకెవరు శరణ్యం ? ప్రభూ.... మీ దయార్ద్రపు నీడలో తల దాచుకొన్న పాంథులం మేము...

రు : గుడూర్జ్, నా శాంతియుత జీవితంలో సమర జ్వాలలు రేకెత్తిస్తున్నావా ? మళ్ళా రాజు

చేసిన అవమానానికి లొంగి కత్తి చేపట్ట వలసిన దేనా ? పోనీ, అంతటి ప్రమాద సమయం వచ్చి జాతి గౌరవము నశించనీ. విశ్వాసంలేని ఏలికలను కొలవడం, ఛీ ఆ కీర్తి, ఘోరాతికే రానీ.

గు : పరిస్థితిని అవగాహన చేసుకోండి ప్రభూ! (దీనంగా) నేను చెప్పాలా, ముంజేతి కంకణాన్ని మీరు చూసుకోలేరూ ? వ్యక్తిగత ద్వేషాలు జాతిని పీడించరాదు.

రు : అయితే, గెలిస్తే గౌరవం రాజుకు కాదా ?

గు : కాదు ...మీకు....మీ జాతికి....మీ దేశానికి. ప్రభూ, క్షమించమని క్షత్రియన్ జాతి పక్షాన మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. అదిగో చూడండి, మీ కత్తి కదను త్రొక్కాలని ఎంత ఉబలాట పడు తూందో.

రు : అబ్బా, గుజ్జూర్జు.

గు : ధనాన్ని ప్రజోపకారార్థం వినియోగించని కఠక వర్తకుడిలా ఎందుకల్లా మీ కీర్తి కాంతని బంధి స్తారు? ప్రజలెంత అపార్థ పడతారో !

రు : ప్రజలే నాకు పుత్రులు. వారిశ్రేయస్సునే నేను వాంఛించేది. వారి గౌరవమే నా జీవిత పరమావధి.

గు : ఎంతటి విశాల హృదయం మీది.తలచుకుంటే, మీరు సాధించని పని లేదు. జోహార్లు ప్రభూ, జోహార్లు.

రు : ఇదే నా ప్రతిజ్ఞ. ప్రజలకోసం పర్షియన్ జాతికోసం నా సర్వస్వం ధారపోస్తా.

గు : శభాష్ ... విజయం మనదే ...

రు : గుడూర్జు—ఇలా రా ... విను .. నా రాక చాలా ప్రచ్ఛన్నంగా వుండాలి. అతి ముఖ్యం సుమా.... తెలిసిందంటే కార్యక్రమం తారుమారవుతుంది.

గు : చిత్తం ప్రభూ ....తమ ఆజ్ఞ...

ప్రకటన: విశాలరణభూమి కిరుప్రక్కలా సైన్యాలు బారులు తీర్చివుంటాయి. షోరాజ్, రుస్తుమ్‌లు ప్రవేశిస్తారు.

వినరా వినరా వీనుల కింపగు
వీరుల సమర విజయరావములన్
చనరా చనరా ఓ వీరా
సమర వీరులకు స్వాగతమివ్వ
వినరా .. వినరా

సైనిక జనం: - షోరాజ్‌కీ జై, రుస్తుమ్‌కీ జై.

రు : (షోరాజ్ సౌందర్యానికి విస్తుపోయి) - షోరాజ్ ఎందుకిలా పర్షియన్ జాతిమీద సవాలు చేశావు? ప్రియురాలి ముఖపద్మమును ఆహ్వానించే వక్షాన్ని ఎందుకిలా కరకు కరవాలానికి గురిచేయ సాహసిస్తు న్నావు? నాకు పుత్రులు లేరు. నిన్ను. నాబిడ్డగా స్వీకరింప సాహసిస్తున్నా.

షోరా: (అతని గంభీర విగ్రహాన్ని చూచి) - మహాశయా, నేను కార్యార్థిని. నిజమైన కార్యార్థులకు వెరపులేని

సంగతి మీకు విదితమే కదూ? కాని ఒక్క విషయం.

రు : ఏమిటి ?

షో : మీ గంభీర విగ్రహం, శరీర సౌష్ఠవం, దృష్టి ఆ ప్రఖ్యాత రుస్తుమ్‌ని పోలివున్నాయి. (మోకరించి) మీరు రుస్తుం వీరులు కదూ ?

రు : (తనలో) - ఇతని ప్రశ్న విచిత్రంగా వుంది. ఇతని మేమిటో ? అదిగాక టార్టారు బాలురు కుతంత్రులు నా నిజపరిస్థితి చెప్పితే కాన్కలిచ్చి, ఏదో విధంగా తప్పుకుంటారు (ప్రకాశంగా) ఈ ప్రశ్న అవసరం అనిపిస్తుంది. వీరుడవైతే నువ్వు అవలంబించవలసిన మార్గం ఇది కాదు.

షో : మిమ్మల్ని అర్థిస్తున్నా-నన్ను అపార్థం చేసుకోవద్దు.

రు : (బలమగు సందేహంతో)-ఎందుకా పిరికి మాటలు? శుష్క వచనాల కార్యార్థివి కాబోలు-(నవ్వుతాడు)

షో : (విధిలేక) - ఎందుకో అడగలేకుండా వున్నాను. నా ప్రార్థనను మన్నించండి. ప్రకృతి నన్ను ఆదేశించమనినది.

రు : వీరుల కిది తగిన పని కాదు. సవాలు చేశావు. వీరోచితయుద్ధానికి. సన్నద్ధుడవైరా. లేకపోతే లొంగిపో.

షో : అసంభవమైన సంగతి. ఆ బలిష్ట విగ్రహం, ఆ విశాల బాహువులు, గంభీర నేత్రద్వయం, ఆ ప్రఖ్యాత వీరుణ్ణే స్మరణకు తెచ్చినవి. సందేహ

నివృత్తి కొరకు మిమ్మల్ని అడిగాను. అర్థించాను. కాని ధీరుణ్ణయి కాదు.

రు : మూర్ఖుడా, యుద్ధం చేయలేక పిరికిపందలాగ రుస్తుమ్‌ని అడ్డం పెట్టుకుంటావేం ? పిరికి జీవితం కంటె నరకం మేలు కదూ ?

షో : బలవంతుణ్ణి, పెద్దవాణ్ణని విర్రవీగుతున్నావు జయాపజయాలు దైవాధీనాలు కావూ ? యుద్ధానికి సంసిద్ధుణ్ణే, ఎప్పుడూ ? యుద్ధం మా వంశపు భూషణం. సిద్ధంగా వున్నాను.

[యుద్ధం ప్రారంభమౌతుంది. ఒక మాంసపు ముక్క కోసం ఇరువైపులనుంచీ వచ్చే గ్రద్దల్లాగ హుంకరించి, ఇరువురు ఒకరిపై నొకరు దూకుతారు కత్తులు తీసి. ప్రకృతికాంత కన్నీటి తరంగాలు వెల్లువలై పొంగిపొర్లినట్లు అక్కసు నదీ రంగాలు విజృంభిస్తాయి. సూర్యుడు మేఘాల్లోకి పోతాడు తండ్రి కొడుకుల యుద్ధాన్ని చూడలేనట్లు. షోరాజు దెబ్బ రుస్తుంని భూమిని ఆలింగనం చేసుకోనిస్తుంది.

రుస్తు : దుర్భరం షోరాజ్.

షోరా: గర్వం ఆత్మ విశాసానికి పరమ శత్రువు. మీరు నూరు యుద్ధాలు చేసినవారు కావచ్చు. కాని నే తక్కువవాణ్ణి కాదు. ఇంత చిన్న వయస్సులో ఇది ఏభై తొమ్మిదవ యుద్ధం.

రుస్తు : ఇంకా మాట్లాడుతున్నావా ? ఏ యుద్ధంలోనూ ఏ శత్రువు కరవాలం కూడా నా కవచాన్ని తాకి

భూమిమీద నిలువలేదు. చూడు, నిన్ను ఏం
చేస్తానో! హుం.

[హుంకరిస్తాడు]

షోరా: (ప్రశాంతంగా నవ్వుతూ) మహాశయా, మీరు తిరిగి సంసిద్ధులు కండి. మనం శత్రువులం కాకపోయినా విధికి లోబడి యుద్ధం చేస్తున్నామని మరచిపోకండి.

రుస్తు: చాలు ఇంక వినలేను. నేను కొట్టిన దెబ్బలన్నిటినీ చెంగు చెంగున దూకుతూ తప్పించుకున్నావు లేడి లాగ. టార్టార్ పాల గంధులతో చేసిన వనవిహార నాట్య కౌశలము ఎక్కడికి పోతుంది? సద్విని యోగం చేశావు. పిరికి షోరాజ్.

[రుస్తుమ్ కొట్టిన ప్రళయ ఘాతాన్ని షోరాజ్ కవచంతో ఆపివేస్తాడు. రుస్తుమ్ రుద్రుడై పోతాడు. జనకునితో యుద్ధం చేస్తున్నాననే పరిజ్ఞానాన్ని కలిగిస్తుంది. ఆ విషమ ఘట్టంలో షోరాజ్ పారవశ్యం పొంది కత్తిని, కవచాన్ని క్రిందికి జారుస్తాడు. ఈ సందిగ్ధంలో కత్తి షోరాజ్ చేతగుండెలోకి క్రూరంగా చొచ్చుకు పోతుంది.]

రుస్తు: షోరాజ్, కొండని తాకి పొట్టేలు నిలుస్తుందా? (వికటహాసం చేసి)- ఛీ! ఇప్పుడు నిన్ను ప్రేమించేది నీ తల్లి తండ్రులు కాదు. నక్కలూ, రాంబదులూ.

షోరా: (వీరోచితంగా) - డాంబికుడా, నా దురవస్థ నాధారం చేసుకొని నా విధిని తూలనాడుతున్నావు. నీవంటి వారు లక్షమందైనా నన్ను చంపలేరు.

నన్ను చంపింది రుస్తుమ్ అనే ప్రళయగర్జన, నువ్వు కాదు. మున్ముందటికి....

రుస్తు : ఆ పరిజ్ఞానం ముందు లేక అప్పుడు సొరంగ నీతులు చెప్తూ తావేం. ఒక ప్రచ్ఛన్న వీరునితో దిక్కు-లేని చోట ఇంత అవమానకరంగా పొడిచివెయ్యబడిన అభాగ్యుడివి నీవు. తెలిసిందా!

షోరా: (పగిలిన గుండెతో.) మంచిది. కాని గతాన్ని స్మరించడం అనవసరం. అప్రస్తుతం. దాన్నిగురించి విచారించి లాభంలేదు. కాని నా తుదికోరిక నా తండ్రి ఆ వీర రుస్తుం నన్ను చూచి నా ఈ తీవ్ర గాయాలపై రెండు పరితాప బిందువులు రాల్చి, నా చెక్కిలి ముద్దిడికొని నా షోరాజ్ అని ప్రేమతో పిలిస్తే, నాకు కావలసిం దేముంది ?

రుస్తు : ఇది కలయా, లేక మాయా నాటకమా. వీర రుస్తుమా నీ తండ్రి. ఎంత హాస్యాస్పదంగా వుంది!

షోరా: (రోషంతో) - వదరుబోతా! ఇంకా సంశయ మెందుకు ? ఎప్పటికైనా, ఈ విషయం తెలిసికొని ఆ వీరుడు నిన్ను భీషణ ప్రతీకార జ్వాలలతో దహించక పోడు. ప్రపంచం విస్తుపోయి చూస్తే గొప్పవంశం మాది.

రుస్తు : (సంశయంతో) నిజమే. శౌర్య ప్రతాపాలలో ఆ మహానీయునికి తగ్గ కుమారుడవే. కాని ఆయనకు పుత్ర సంతానము లేదని నీకు తెలియదా!

షో రా: అవసానదశలో అబద్ధం చెపుతానా? మా అమ్మ యుద్ధానికి పంపుతాడనే భయంతో పుత్రిక పుట్టినట్లు కబురంపినది.

రుస్తు : (కంపిస్తూ)- వ్యర్థమగు మాట లెందుకు? మీవంశం గుర్తు చూపించి మరీ మాట్లాడు.

షో రా: తప్పకుండా.. ఇదిగో చూడు. జబ్బమీద యీవస్త్రం. నమ్మకం కలిగిందా? ఇప్పటికైనా.

రుస్తు : (బిగ్గరగా) - అయ్యో, నాయనా! అయ్యో, నువ్వే నా బిడ్డవు. షోరాబ్.

షో రా: హా తండ్రీ! నా సందేహం ఇప్పటికి నిజమయింది. ప్రకృతి నాలో ప్రవేశించి మమ్మల్ని అర్థింప జేసింది. కాని, అది మీకు అరణ్యరోదనై, మృత్యు దేవత మీలో ప్రవేశించి నన్ను తుదముట్టింప జేసింది... హా తండ్రీ.

రుస్తు : (రోదన స్వరముతో-) నాయనా, నిన్ను చంపినవి చేతులు గావు. ఇవి ప్రాణం లేని పాషాణాలు. నీవంటి సుకుమారునికి నేను తండ్రి కాదగిన వాణ్ణి గాను. అయ్యో.. నా బిడ్డా.

షో రా: (అశ్రుకణాలు రాలుస్తూ) - తండ్రీ, ఇప్పటికైనా ధన్యుణ్ణి. కడసారి మీ రూపు నాకు లభించింది. నేను క్రూరంగా పొడవబడినా, సత్యాదర్శానికి నిలబడిన నాకు ఆత్మసంతృప్తి ప్రాప్తించింది. అబ్బా బాధ, రక్తము.

రుస్తు : (వికల హృదయంతో)-దైవమా ఎంత క్రూరత్వం చేయించావు? నా వంశాన్ని నాశనం చేశావు. శత్రువులను దునుమాడించి యుద్ధాలు గెలిపించి, మేటివీరుణ్ణి చేసి, చివరికి నా పుత్రుడి హృదయం లోకి ఎలా చొచ్చుకు పోయినావు? నువ్వయినా నా దుష్టబుద్ధికి ఎదురు తిరుగలేక పోయినావా? (విసిరి వేస్తాడు) - పోనీ నన్ను పొడిచి వేయక పోయినావా?

నా అశ్వం రూకుష్ ఏం చేసింది పో! నా దృష్టి పథనుంచి తొలగిపో. నా కీర్తంతా మట్టిపాలయింది. నీ శ్రమంతా అడవిలోని వెన్నెలలాగా వ్యర్థమయి పోయింది. నిన్నింక బాధపెట్టను. నన్ను క్షమించు. ఎప్పటికైనా నిరాడంబరమే సుందరవంతము.

షోరా: తండ్రీ, అదేనా నీ అశ్వం? అమ్మ ఎప్పుడూ చెబుతూ వుండేది.

రు : (రోదిస్తూ) - హా! షోరాబ్ అమ్మ అనుపదం నా గుండెని చీల్చివేస్తోంది. ఆ అపురూప లావణ్యవతి జీవితంలో నా సాంగత్య సౌఖ్యం అనుభవించింది ఏకొన్ని క్షణాలో.... దురదృష్టవతి....

షోరా: అవును తండ్రి! అందుకే అమ్మ పంచప్రాణాలు నా మీద పెట్టుకొని జీవించివుంది. నేను లేకపోతే చంద్రుడు రాని రాత్రి ఆ మానిని జీవితం. ఆమె జీవించి వుండలేదు. ఈ విషాదవార్త శూలంలా

ఆమెను తగిలి వేటకాడి క్రూరబాణానికి తన్నుకు
లాడే గువ్వలాగా అవుతుంది ఏం చెప్పను.

రు : నేను నిన్ను మాత్రమే చంపలేదు కూరా! నీ తల్లిని కూడా ప్రచ్ఛన్నంగా దొంగలాగా చంపిన పయోముఖ విషకుంభాన్ని.

షో రా: తండ్రీ విధి శాసించిన ఘోరశాపం!

రు : నాయనా, ఈనాడు కళ్ళకు పూర్వ దృశ్యాలన్నీ జ్ఞాపకానికి వస్తాయ్. నా శౌర్యానికి మెచ్చి సుల్తాను తన పుత్రికని, మీ అమ్మని నాకు కానుకగా అర్పించాడు. నా బలసిన కండల్ని చూసి అప్పుడు ఆనంద భాష్పాలు రాల్చింది, ఇప్పుడో—

షో : గతించిందానికి విచారమెందుకు ? మిమ్మల్ని చూస్తుంటే నాకదే చాలు.

రు : కాని, నువ్వే నిజమైన ధీరుడవు. అసహాయస్థితిలో నిన్ను వధించిన నాకు శిక్షాస్మృతిలో ఏదన్నా శిక్షవుంటుందా! కసిదీర అనుభవించమని శపించవూ ?

[రుస్తుమ్' జై - ష్రాబ్ వీరుడు జై.]

రు : (వారిని చూసి) - సైనికులారా - సైన్యాధ్యక్షులారా, ఇంకా మీకు మత్తు వదల్లేదా? వీరులారా, ఇంత కీర్తి నార్జించిన రుస్తుమ్ మీముందు దీనుడై, భరింపలేని దృశ్యాన్ని చూస్తూ బ్రతుకుతున్నాడు. నా సుఖం

గమనించారా? ఇదే నా సందేశం. యుద్ధాలు మానవ వికాసానికి శత్రువులు. మీరు పరస్పరం సద్భావంతో అన్నదమ్ములవలె ప్రవర్తిస్తారని నమ్ముతాను. శాంతిదేవతని ఇప్పటికైనా కొలవండి. పర్షియను టార్టారు జాతుల మధ్య ప్రబలే యుద్ధాలకి అంత్యకాలం ఆదేశమయింది పొండి. శాంతిదేవత నారాధించండి.

షోరా; సెలవు. అమ్మా, హా ప్రియమూతా. (సైనికుల కోలాహలం. షోరాజు వీరునకు జై. ఆత్మార్పణ చేసిన అమర వీరునకు జై.)

[మతి చెలించిన రుస్తుం ప్రవేశము. స్మశాన వాటిక- గాఢాంధ కారం]

రు : హావిధీ, ఈ జీవితానికి శాంతిలేదా ? లేదు - ప్రకృతిని ధిక్కరించిన నాకు శాంతిలేదు, రక్తమాంసాలతో వినోదించే యీ మనస్సుకు ఆత్మశాంతి లేదు. నశించింది. (వికటహాసం) తల్లీ, ప్రకృతీ, నన్నిప్పుడూ నువ్వు వారిస్తూనే వున్నావు. కాని యీ చెవిటి చెవి దగ్గర శంఖంవూదితే లాభమేమిటి ? కరకు చేతుల్తో కఠినంగా వర్తించిన నన్ను యుద్ధవీరుల ఆత్మలు నన్ను పీడించవూ! పీడించి పిప్పి చేస్తయ్. కసిదీర నా రక్తాన్ని త్రాగాలని ఆ మృత వీరుల అభాగ్య ఆత్మలు దయ్యాలై వెంబడిస్తున్నాయ్ నన్ను చంపండి. హత్యచెయ్యండి నన్ను. నాదేహాన్ని

చూస్తే నాకే రోత పుడుతోంది. (ఆగి) చంపరూ?
అవును. ఈ పాపపు శరీరం వాటికన్నా రోతే!
ఏం చేయనూ. పాపం పండిపోయింది.

దూరాన్నుంచి భిక్షుకుడి పాట వినబడుతుంది.

ఎవరహో, ఈ నిశీథ సమయాన
కారు మబ్బుల దాగి ఇటునటూ పరువిడి
విశ్వమంతా కనక దృష్టిని కురిపించి
చిన్ని పాటతో చిందులాడే
చిలిపి స్నేహితు డెవరహో

♦ ♦ ♦

హృదయ జలధిని భావ కెరటాలు పొర్లంగ
పండు వెన్నెల తీపి కోర్కెలు ఇవ్వగ
కొంటి నవ్వుతో తొంగిచూచే
దొంగ బాలకు డెవరహో

♦ ♦ ♦

విశాల ప్రకృతే విశ్వసౌందర్య నిలయమని
సర్వ సమానత్వమే, ఉత్కృష్ట మనస్తత్వ మని
మారుమూలల చాటి చెప్పే
ముక్త కంఠు డెవరహో.

రుస్తు: అబ్బా, ఆ ప్రేమమయుడు నన్ను రక్షించడూ?
ఎంత విషాదాంతం నీ జీవితం.
స్వాతంత్ర్యమే నిత్యానందమని
మాతృ మందిరమే స్వర్గధామ మని

బోధ చేసే బుగజ్ఞాను డెవరహూ
దిక్కుగానని దీన పాంధుని
రాచ బాటలు దరిని చేర్చే
నిత్య సన్నిహితు డెవరహో.

రుస్తు : (సమాధిని సమీపించి)- అదిగో సమాధి. నా ప్రియ పుత్రుని సమాధి. తండ్రి చేతిలో నిష్కారణంగా ప్రాణాల్ని విడిచిన పుత్రుని సమాధి. నాది ఎంత జీవచ్ఛవమైన బ్రతుకు ఈ జగత్తులో ఇంక నాకు విమోచనమే లేదా? నన్ను దుర్భర లోకంలో నుంచి, పాప పంకిలంలో నుంచి విముక్తి చేసే దాత లేడా ? లేకేం! ఉంది! ఒక్కటి, అదే కత్తి. అదే, నిజంగా నా జీవిత అధ్యాయంలో యిదే చివరి పుట. ప్రియా, నా బీగమ్, నీ కళ్ళు నన్ను చూచి చీదరించుకోకముందే నేను పోతున్నా. నన్ను నువ్వు క్షమించలేవు. క్షమించరాని అపరాధం చేసిన అధముణ్ణి. కత్తి మాత్రమే క్షమిస్తుంది. శెలవు.

షోరా: నన్ను కూడా రానీ నీ దగ్గరకి.

అంతు పొంతూ లేని ప్రళయాంధకారాన
ఆశాజ్యోతిని బట్టి
విసవిసా చని యేటి
భీతిగానని ప్రళయరుద్రు డెవరహూ

[ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రం నుండి ప్రసారము]

# గురుపుత్ర విజయము

(చారిత్రాత్మక కల్పన నాటిక)

-: పాత్రలు :-

ప్రశాంత సింహుడు :- సమీార దేశాధీసుడు

దివ్య ప్రభ :- రాకుమారి, ప్రశాంత సింహుని ఏకైక తనయ.

జనహితవర్మ :- సమీార మహామాత్యుడు

శంభు మిత్రుడు :- సమీార సర్వ సైన్యాధ్యక్షుడు, ప్రధాని కుమారుడు.

వివేకవర్ధనులు :- సమీార రాజగురువు

అమరానందుడు :- విప్లవ నాయకుడు, రాజ గురు పుత్రుడు.

వినయ దేవుడు :- ధవళగిరి ప్రభువు.

(నాయకారి, ప్రతీహారి, తదితరులు)

ఇది ఒక కవిత్వ గాథ :-

గాథ ఊహా జనితమైనను ఘట్టములు వాస్తవములు. దానిచే నిరూపింపబడిన ఆదర్శములకు భంగపాటు ఘటిల్లదు

దేశ స్వాతంత్ర్యము, ఆత్మగౌరవము జాతికి పవిత్ర ధర్మములు. సునిశిత ఆత్మ విచారము, దానిచే పరిణమించిన అంతరాత్మ ఆదేశము, నిష్కళంక ప్రేమ సాఫల్య, సాధన త్యాగము, వ్యక్తి జీవితము సిద్ధికి చరమగమ్యములు -

హిందూ దేశ చరిత్రలోను, సంఘ జీవనములోను, ఏకమత్యత లేమి, భిన్న వర్గీకరణ, దేశ సౌభాగ్యమును భంగపరుపజూచినను, దానికి నిష్కృతి, సత్సంప్రదాయములోను సునిశిత నిర్దుష్ట పరిశీలనలోను గలదని ఋజువగుచున్నది.

అశాశ్వతమైన భౌతిక సంపదలు, రాజ్యము, దేహము కాలవాహినిలో అదృశ్యమైన, చిరంతనానంద దాయకము లగు ధర్మ నిర్వహణము, సుస్థిరమై, దివ్యజ్యోతిగ మనకు సాక్షాత్కరించుచున్నది. ఫలిత జయాపజయములు గణించక, నిష్కామముగ నీ విధి నిర్వహణము నిర్వర్తించి, జీవన ఫలసిద్ధిని గ్రహింపుమనియు భగవద్గీత ఉద్ఘాటించుచున్నది. ఎల్లరకు. ఎల్లకాలమునకు అదియే మార్గదర్శి, మోక్ష సిద్ధి-
దాని నిరూపణమునకే ఈ ప్రయత్నము

# గురుపుత్ర విజయము

## ప్రథమ రంగము

[సమీర దేశ రాజ ప్రాసాదము - అంతఃపురోద్యాన వనము ప్రాతఃకాల సమయము సూచకముగా కోట-గంటలు]

[ప్రవేశము రాకుమారి దివ్యప్రభ]

దివ్యప్రభ : (ఆత్మగతమై) అహో! దివ్య తేజస్సుతో, దైవాగమనము సూచించు మనోహర ప్రభాతము! సప్త వర్ణంబుల సింగారముతో, నవ్యకాంతుల సొబగులతో, ఆకాశ వీథులలో ఉషాబాల!

కాని నా మనో వీథులలో మాత్రము చెదరిపోని విషాద ఛాయ లేల?

(సుమముల సమీపించి)

ఓ మల్లికా, మాలతీ! మనోగతము నెరుగకయే తల లూపుతూ ఏల నన్ను పలుకరింతురు? గుబాళింపు పరిమళములతో నన్ను పరివేష్టింప వలదు!

నా వేదన మీకు పరిహాసమై తోచెనా? (పరిచారికలు నవ్విరు (ప్రోత్సహించిరి.)

శమింపదు ఉత్తుంగతరంగములతో పొంగు హృదయమా

ద్వేగము. చిన్నబోయిరి చెలులు! హారిణమూ, నా ప్రాణమూ ముచ్చటలు చేయలేదని మారాము చేయకుము.

నీ మనోభీష్టము నే నరికట్టజాల! నన్ను వీడి స్వేచ్ఛా జీవివై, నీ సఖునితో ఏ కొలను చెంతైన విహరింపుము! పొమ్ము సత్వరము

నీ దృక్కులెంత ప్రశాంతములు! పవిత్రములు! నీ కంటె ఉత్తమ జన్మలని ప్రకటించుకొను మానవులు ఏల నిర్దయులై, హృదయ కవాటముల బంధించి, సత్య శాంతుల మనుగడకు ప్రవేశము నిరాకరింతురు? ఎంతటి హైన్యము!

హాస్యోక్తులతో అలరింప జేయలేదని, నా ముద్దు చిలకా, నన్ను తృణీకరింపకుము! నీ చల్లని చూపు వెలుగులలో నిశీథ నిరాశాచ్ఛాయలను విస్తరింప నీయకు.

నా కరుణాంతరంగము వెల్లువయై ప్రవహించు నీ కొరకు.

(ప్రవేశము సఖి - కిలకిలారావములతో)

సఖి : రాకుమారి! ఈ శుభసమయమున నీకీ జిజ్ఞాస యేల ?? విషాద గంభీర వదన మేల ?

దివ్య : (మౌనము)

సఖి : పరాకేల రాకుమారి, పరిహాసమా ?

దివ్య : లోకములో ఒకరికి పండుగ; మరొకరికి పరిహాసము! ఇది సృష్టి వైచిత్ర్యము! - సామ్రాజ్యమునకు ఎల్లలుండును కాని కల్లోల మానసిక విహంగ విహారమునకు సరిహద్దు లెట్లుండును ?

సఖి : దేవి - విదితము, ఈ సత్య సూత్రము -

విజ్ఞాన ధనుడైన మానవు డెంత సముపార్జించినను మానసిక విజృంభణమును నిలువరించి, శాసింప లేడు.

కాని నేడు మహారాజులు,మహామాత్యుల పుత్రులైన శంభు మిత్రులకు సర్వసేనాని పట్టము ప్రసాదించుటకు నిర్దేశించినారు.

పేరోలగమున గాన, నృత్య, వినోద, విశేషములు ముమ్మరముగా సాగుచుండ, మ[illegible] మారుమూలల మసలెద వేల ?

దివ్య : ఏకాంతము శాంతికారకము - అధీనము తప్పిన మానసము అధిక ప్రసంగము నభిలషించదు -

సఖి : నా రాణి శాంతి నిలయము నేడు శూన్యమాయెనా ! ఎవ రా మానస చోరులు --

దివ్య : చోరులు చెప్పి వత్తురా ! ఏమి నీ భ్రమ ? వారి రాక పోకలు అనూహ్యములు.

సఖి : అయినను చోరులు శిక్షార్హులు కదా ? - నీ దండన యేమి ?

దివ్య : కాల నిర్ణయము బహిరంగపరచును - ఇంకను నన్ను వీడిపోవేమి ?

సఖి : చిత్ర జగత్తు ! అకాలములో వే[illegible]ంత విచారము! పోయి వచ్చెద - సెలవు - [illegible] -

(నిష్క్రమణ)

[రాకుమారి దూర దూరముగా విహరించుచు నొక వేదికపై శయనించును. - మహతిని గ్రహించి- ]

దివ్య : నా నిరాశను గానములో కరిగించి వైచెద. - నా ప్రియ మహతీ ! - నవరత్నాలంకృతవయ్యు, ఆకర్ష ణీయవయ్యు, ఏకాంతమునే అభిలషించు విషాద మూర్తివా, నీవు సైతము !

[శ్రుతులు మీటుచుండును....]

[బరువెక్కినదేమి నీవాణి.... ?]

.... గీతము ....

సరస పరిహాసమే విముఖమా ?....
సఖి హృదయాంతరంగమే... వికలమా ?....

♦ ♦ ♦

త్రిజగన్మోహన కళాతపస్విని,
మంగళ, మంజుల మధురగాయకిని,
దివ్యాలంకార శుభప్రదాతను,
రంజిత, లలిత నాట్యకళా నిష్ణాతను.... ||సరస||

* * *

జగములన్నింతు మాన్యగీతాలతో,
శ్రుతుల గుప్పింతు దయాంత రంగములో,
వైచిత్రి సృష్టించు వినూత్నలోకములో,
విహరింతు విహంగినై, వెన్నెలకెరటాలలో ||సరస||

* * *

నర్తింతు నెమలినై నవభంగిమలతో
సాగిపోవుదు, స్వేచ్ఛ, నాకాశ వీధులలో

జయింతు కళాకారుల సభారంగములో
వెలుగు విరియింతు తమోంతరంగాలలో ॥సరస॥

ౕ ౕ ౕ

[భారముగా మహతీ ధ్వనులు]

భ్రమ! .... పాడివేసినను తిరిగిపోవని తలంపులు! నేనేల రాకుమారినై జన్మింపవలె .... ఏ సామాన్య కర్షక యువతినై యుండిన, నా అమరానందుని సామీప్య మింత దుర్లభమై యుండి యుండునా? నా మనస్సామ్రాజ్యమునకై పట్టమహిషత్వము వహింపని నే నెట్లు ఈ సువిశాలరాజ్యమును పాలింపగలను! ....

పునాదులులేని నా జీవితసౌధము శిథిలముకాదా? ఎట్టి పరీక్ష?... అవును .... ఇది జీవన్మరణసమస్య! ....
[ఉద్యానవన ప్రాకార రహస్య ద్వారముద్వారా అమరానందుని ప్రవేశము... రాకుమారి వానిరాకను గమనించదు.]

అమ: (తనలో) ఆహా.... మరపునకురాని మాన్యరూపము! చైత్ర్య వనలక్ష్మివలె ప్రత్యక్షమగు ఈ రమణీయ మూర్తి నేడేల పరిత్యక్తవలె విరాగము ప్రకటించు చున్నది? .... శృంగార రసధునివలె సాక్షాత్కరించు మధుర, మంజుల, మోహనమూర్తి నేడేల శిలా

మూర్తియై తీవ్రవిరాగవ. వెలయించుచున్నది? సమీర
రాజ్యమెల్ల నిత్యకల్యాణము, పచ్చతోరణముగ
సంబరముతో కోలాహలము సల్పుచుండ, సర్వసంగ
పరిత్యాగియైన బౌద్ధభిక్షువు వలె, మానసముద్రాలం
కృతయై తత్త్వవిచార మేల సంధానించుచున్నది ?
అరుణకాంతులు అధరపల్లవములకు రంగులుదిద్దుచు,
ద్విగుణీకృతముగ సొగసుల కుప్పలుపోయుచుండ,
ఈ మాననీయ రూపమునకు నివాళు లర్పించు
మధురానురాగ మేల నాలో ఉదయించె ? ....
ఇదియును ఒక సహజపరిణామమే !: కాకున్న

అతివ నడచెద వోక రాజహంసవోలె
నృత్య విన్యాస మొనరింతు నెమలివోలె
పలికెదవు బాల యందాల చిలుకవోలె
మధుర భావమ్ము రగిలింతు మానసమున——

దివ్య: (మోకరిల్లి) అమరా... ప్రత్యక్షమైతివా ? నేటికి, నా దీనారావము నీ వీనులకు సోకెనా ?

అమ: (సంభ్రమముతో) దివ్యప్రభా ? సంశయ మేల ? .... నా ఆలస్యమునకు కినుకా? అటు లేని మన్నింపుము.

దివ్య: గురుపుత్రా ! .... మన అంతరంగములు నిర్మల తటాకములు .... మన ప్రణయనౌకలో అందు విహరించు భాగ్య మున్నదో లేదో ? అంతస్థులు, కులాచారములు, రాజ్య సాంప్రదాయములు మనలను వేరుపరచు సమయ మాసన్నమగుచున్నది ? ... ఆ స్థితి నూహింపజాల ....

అమ: రాకుమారీ!....

దివ్య: వలదు....నన్నట్లు పిలువవలదు .... నేడు నే నొక సామాన్య కర్షక యువతిని .... ఎందైన దూర దేశములకు తరలిపోవుదము .... సుక్షేత్రముల పసిడి పంటల పండించి, ధార్మిక జీవనము నెరపుచు, ఈ కృత్రిమ జీవితమును త్యజింతము .... సాగిపోదమా సీమకు ... రమ్మా...

అమ: దివ్యము! నీ ఆశయములు నా శిరోధార్యములు. నీవు నాకు మోక్షము ప్రసాదింప అవతరించిన దేవతవు.

రమ్యమైన మన ఊహ సాఫల్యము పొందుదాక మన ప్రయత్నము కొనసాగుచుండును. గగన విహారము మాని కాలచక్ర పరిభ్రమణము అప్రమత్తతతో పరిశీలింపుము... అంతదాక —నీ విప్పుడు సమీర రాజ్య వారసురాలివి. స్థయిర్యముతో నీ హక్కును సంరక్షించుకొనుము. గౌరవప్రదముగ ప్రజా హృదయమును చూరగొన్న భావి మహారాణిని కొలుచు ఉత్తమపౌరుడనై పురోగమించెద.

దివ్య: నాకె శాశ్వతముగా అంకితమైన మీ పవిత్ర ప్రేమకు జోహారులు ... మన చిన్ననాటి చెలిమి ప్రకృతిబద్ధమై, సత్యవిలసితమై, ఫలించును .... సమీర దేశ మహారాణిని కాకపూర్వమే మీ హృదయ సామ్రాజ్ఞి నైతిని....

ఏ మలయమారుతము నన్ను ప్రమోదభరితను

జేయునో, అదియే మిమ్ముల పరివేష్టించి నా సందేశము వినిపింపజేయును.

కాని మహామాత్యులు జనహితవర్మ పురుష వారసులు లేని సమీార రాజ్యలక్ష్మిని దఖలు చేసుకొన ఉద్యమించుచున్నవారు. వారి తనయులు, సర్వ సేనానులైన శంభుమిత్రులు సమీారరాణి పాణి గ్రహణమునకై ప్రచండయత్నము సాగించు చున్నవారు.

అమ: పరమ వేదాంత విచార పారీణులు, ధర్మశాస్త్ర నిర్దేశితులైన జనహితవర్మ. సుశిక్షితులైన శంభు మిత్రులు ద్రోహబుద్ధులెగా! ఔరా!

దివ్య: అవును. నిక్కవముగ. ఒకరు దేశద్రోహి; మరొకరు ఆత్మద్రోహి. వేదాంతమునకు వారి నిర్వచనము స్వప్రయోజనము!

సాము గరిడీలలో స్త్రీ హృదయము సిద్ధించునా? ఎంతటి ఉన్మాదము!

అమ: సమీార రాజ్య గౌరవము కాపాడుటకు నేను ప్రచ్ఛన్నముగ సంచరించు సమయ మాసన్నమైనది. నా రాక పౌరలకు, ప్రతిఘటన ఏర్పడ వచ్చును - నా మనసును మలచిన శిల్పివి, నీ వపార్థము పొందవలదు.

[శంభు మిత్రుని ఆకస్మిక ప్రవేశము]

శంభు: యువరాణికి జయము! జయము! ఓహో! గురుపుత్రా, మీాకు సుస్వాగతము.

దివ్య: సర్వ సేనానులు సాంప్రదాయము నెరుగరో? ఇది అభ్యంతర మందిర వనము.

శంభు: రాకుమారికి శుభాభివందనము!

ఈ శుభ దినమున, నా సర్వసేనాని పట్ట ప్రధానోత్సవమున ఏర్పాటైన రాజ్యసభలో నాట్యరాణులు మీ రాకను సైగకై ఎదురు జూచుచున్నారు. అధ్యక్షత వహించి మాకు అమందానందము ప్రసాదింప ప్రార్థన. స్వయముగా మిమ్ము అర్థించుటకు వచ్చిన ఈ దీనుని సాహసము సైరింపుడు. మనందరము బాల్య మిత్రులము కదా యని, చొరవ తీసుకొంటిని, కాని...

దివ్య: వికలమైన అంతరంగము వినోదమునకు దూరము, సేనాని, మరొకసారి మీ రిక్కడ ప్రత్యక్షమగుటకు తీవ్ర ఆక్షేపణను ప్రకటిస్తున్నాను.

శంభు: రాజపుత్రి! ఏ అభ్యంతర మందిర వనములో అమరానందుడు, గురుపుత్రుడు, నిరాక్షేపణగా ప్రవేశింప కలిగెనో, ఆ మందిర వనమునకు, మహామాత్యుల తనయుడు, సర్వసేనాని ప్రవేశించుటలో మీరు తెల్పు అభ్యంతరమును అభినందింప లేకున్నాడ.

కాని, రాజాశ్రితులకు, ఆజ్ఞ అనుల్లంఘనీయము కదా?

నా అపరాధమునకు మీ రే దండనను విధించినను, మీ నిరుపమాన మానస సౌలభ్యాన్ని పోగొట్టు

కున్న నిరుపేదను మాత్రము చేయకుడు. శెలవు సుగాత్రి.

[నిష్క్రమణ]

దివ్య: నిరుపమాన మానసము! నిరుపేద! దేశము కరువు కాటకములతో సంక్షోభించు చున్నను, రాజోత్స వముల నెపమున ప్రజాద్రవ్య దుర్వినియోగము!

అమ: యువరాణీ! నా దేశ పతాక గౌరవము కోసము, ప్రజా స్వాతంత్ర్యము కోసము, ఆత్మ గౌరవము కోసము, నా ప్రాణముల నర్పించుటకు శపథము చేయుచున్నాడ. శెలవు.

దివ్య: పునర్దర్శనము?

అమ: వీలైనంత త్వరగా. గుండె దిటవుతో కర్తవ్యమును విస్మరింపకుము.

దివ్య: (భారంగా) వెళ్ళితివా... మరల, సఖిని గుండె బరువుతో వదలి! నీ సరసను నిలుచుటకు ఏ రాకుమారి, నిర్విచారముగ సింహాసనమునైనా త్యజించలేదు! ప్రియసఖా...నా అమూల్యనిధీ!

* * *

## [ద్వితీయ రంగము]

[ఆ రాత్రి జనహితవర్మ భవన ప్రాంగణమున]

శంభు: (ఆవేదనతో) తండ్రీ! ఈ అవమానము, కార్చిచ్చు వలె నన్ను ఆపాదమస్తకమును దహించుచున్నది.

దివ్య ప్రభా దేవి కరుణాకటాక్షముతో నన్ను అనుగ్రహించుట కల్ల! ఇంక సమీర రాజ్య సింహాసనము నాకు దుర్లభము!

అభ్యంతర మందిర వనములో నా ప్రవేశమును అధిక్షేపించి, ఘోరావమానము సాల్జేసిన యువరాణి సామాన్యుడైన అమరానందు నేల వాంఛింపవలె? దుస్సహము. సర్వసేనా పట్టప్రదానమునాడే నా కిట్టి దుర్భరావస్థయా? ఛీ!

జన : కుమారా శంభూ! వేయేల! గతజల సేతుబంధన మేల? సామ, దాన, భేద, దండోపాయాలతో నీ జనకుడు, సమీర రాజ్యరమనే కాదు; రాకుమారి కుసుమ కోమల మానసరమును కూడ సిద్ధింపజేయును. నా తొలి విజయము, ని సర్వ సేనాని పట్టప్రదానోత్సవము.

రాజగురువు వివేకవర్ధనులు అంతరంగికముగ ఎన్ని అడ్డంకులు సృష్టించినను ఎటులో మహారాజు నొప్పించితిని.

స్వయంవరము రాజాచారమని రాజగురువు లడ్డు తగులుకుండిన, రాకుమారితో నీ వివాహమునకు మహారాజునకు ఎట్టి ఆక్షేపణయు, యుండి యుండ జాలదు. ఇప్పుడు మనము రాజ గురువును, అమరానందుని, రాజునకు కాకుండ జేసినగాని సఫలీకృతులము కాలేము.

శంభు: ఒక శరమునకు రెండు ఫలములు!— ఆహా.... ప్రతీకారము... మనోరధ సిద్ధి. .

జన : శంభుమిత్రా ! రేపే రాజ్య సభ! రెండు ముఖ్య చర్చలు. రాజ్య వారసత్వము, రాకుమారి స్వయం వరము.

శంభు: పితృపాదుల సమయోచిత ప్రజ్ఞ పుత్రునకు అపరి చితము కాదు. దేవా ! —— సుప్రభాదేవి నాకు దక్కకున్న విచారములేదు. నేను జీవించియుండగా నా శత్రువైన అమరానందునకు మాత్రము దక్క రాదు.

జన: నీకేల సంశయము! అమరానందుడు బ్రాహ్మణుడు. క్షత్రియ కన్యను వివాహమాడుటకు అనర్హుడను వాదమునకు తిరుగుండునా ? మన పొరుగు దేశపు ధవళగిరి ప్రభువు వినయదేవుడు మన ఆశ్రితుడు. అమూల్య బహుమానములు స్వీకరించియు, మనము వారిని విస్మరించరాదు. రాకుమారి కతడే తగిన వరుడని ప్రతిపాదించెద. అది సమంజసమై భాసిల్లును. నాకు రాజసేవాసక్తుడను కీర్తి దక్కును. ఎట్లున్నది?

శంభు: అద్భుతము. ఇది ఒక ప్రతిసృష్టి !

[ప్రతీహారి ప్రవేశము]

ప్రతీ: ఆర్యా—ధవళగిరి గూఢచారి.

జన: అవశ్యము.

[ప్రవేశము గూఢచారి]

గూఢ: మహామాత్యులకు జయము... మా ధవళగిరి ప్రభువులు ఈ రత్నాంబరములు, వజ్రాభరణములు మీకు సమర్పించుటకు ఆజ్ఞ చేసియున్నవారు. మీ రాకకు నిరీక్షించుచున్నవారు. ఇదో జాబు-చిత్తగింపుడు.

జన: మంచిది.

శంభు: వెతుకబోయిన తీగె! ...
ఆడబోయిన తీర్థము....
జనకా ... తిలకింతురుగాక
సమీరరాజ్య సర్వసేనాని విజయవిహారము.
(ఆత్మగతము) దివ్యప్రభా, అమరానందులారా....
మీరింక నా చేతిలోని కీలుబొమ్మలు సుమా!
నన్ను కాదని తప్పించుకొనుట కల్ల. జాగ్రత్త!



[ తృ తీ య రం గ ము ]

[తెల్లవారుఝామున రాజగురు భవనములో]

అమ: మీ ప్రియపుత్రుని ప్రమాణాన్ని స్వీకరించుడు, రాజగురూ.
నా సంకల్పానికి మీ ఆశీస్సులు.

వివేక: (అప్రతిభుడై) ఇటీవల నీ చర్యలు నాకు ఆందోళన కలిగించుచుండ, నీవు నిశ్చలముగ మనుచున్నాడవు.

ఏ మహోద్ధృత కార్యదీక్షతో అహర్నిశలు అన్న పానీయాల్ని విసర్జించి ఆందోళనాయుతుడవై సంచరించుచున్నావో అర్థము కాకున్నయది? నీ పయన మెక్కడికి? (వ్యంగ్యముగ) మహాకవుల పయనములు ఊహింపజాలరు సామాన్యులు!

అమ: నేను మీకు వినమ్రుడను. కారణముల తరచవలదు. నా ఆదర్శము మీ గౌరవము నుద్దీపింప జేయునని విశ్వసింపుడు.

వివేక: అమరా! — పితృహృదయము సంతాన భద్రతకు తల్లడిల్లదో?
నీ మాతృదేవి గతించిన దాది నే నెవ్వరికొరకు జీవించియుంటినో నీ వెరుగవా?

అమ: నిజము. అమరానందుడు జీవితములో తీర్చుకొన జాలనిది పితృఋణమును మాత్రమే.

వివేక: నాకు వార్ధక్యము వచ్చినది. ఈ రాజగురు పీఠము నీ వధిష్ఠించి నాకు విశ్రాంతి నొసగుము. ఇది పుత్ర ధర్మము.

అమ: పవిత్రమైన రాజగురు పీఠమును అధిష్ఠించెడి అర్హత నాకుండెనో లేదో వచింపజాల.
అయ్యో! దేశశ్రేయస్సుకై మనము పురోగమించు మార్గములు భిన్నములని చెప్పక తప్పదు.

వివేక: ఏమి? ప్రధాని జనహితవర్మ రేకెత్తించిన శంక, సత్యమగు చుండెనా?

నిన్ను రాజగురువుగా తిలకించు భాగ్యము నా
కలభ్యమా ?
బిడ్డా ! ఇప్పటికైనను విషమించకముందే తిరో
గామివి కమ్ము.
ఎక్కడి రాజపుత్రి ! ప్రేమ పొసగుటెట్లు ?
దీనికై శిథిల ఘనగిరి దుర్గములో ప్రజావిప్లవ సైన్య
నిర్మాణమా !
ఆచారముల నిరసించితివా ?
అంతస్థును విస్మరించితివా ?
పలుకవేమి? అరణ్యరోదనయేనా?

అమ: కాదు ... అమృతసందేశము. మానవత్వమును,
ప్రజా స్వాతంత్ర్యమును, న్యాయపరిచే ఆదర్శములు
నాకు సిద్ధములు. నా మహోద్యమములో విజయ
శీలుడనైగాని మిమ్ము తిరిగి దర్శించను.

వివేక: ఎప్పటికో ఆ శుభముహూర్తము.

అమ: మీ ధర్మమార్గము నా విప్లవమార్గము ఏకమని
లోక మంగీకరించి, హర్షించినప్పుడు. (నిష్క్రమణ)

వివేక: (భారంగా) బాల రాజనకునే విడిచిపోవలసివచ్చెనా!

[ప్రవేశము ప్రతీహారి]

ప్రతి: మహాత్మా ! ప్రమాదము.

వివేక: ఏమి ?

ప్రతి: శిథిల ఘనగిర దుర్గములో అమరానందులు నిర్మించు
ప్రజా విప్లవసైన్యము రాజద్రోహ చర్యగా మహా

రాజులు నిర్ణయించి, నిర్బంధమునకు ఉత్తర్వు లిచ్చియున్నారు

వివేక: (హతాశుడై) పరీక్ష! అటు పుత్రప్రేమ; ఇటు రాజభక్తి!

[ప్రవేశము శంభుమిత్ర సైనికులతో]

శంభు: వందనము రాజగురూ! రాజ్యసేవా నిర్వహణము బహు క్లిష్టము. అనుల్లంఘనీయము. మీ తనయు డెక్కడ?

వివేక: సేనాని-వాని భావ్యారూపము నాకు బహుభారము.

శంభు: వంటయింటి కుందేలు పలాయనము చిత్తగించెనా? కానిండు. సైనికులారా! ఇదే నా ఆజ్ఞ. దేశములో అన్ని ప్రాంతములు గాలింపుడు - రాజద్రోహి అమరానందుని బంధింపుడు -

(నిష్క్రమణ)

౹ ౹ ౹ ౹

(చతుర్థ రంగము)

[పక్షము రోజుల పిమ్మట- ధవళగిరి రాజ ప్రాసాదములో]

సైనికుల జయధ్వానము: ధవళగిరి ప్రభువునకు - జై -

విన: ప్రతీహారీ- సమీర సేనాని శంభుమిత్రు లింకను రాలే దేమి? నా జాబు వారి కందజేయబడలేదా?

ప్రతీ: ప్రభూ! విప్లవ నాయకుడు అమరానందుడు సమీర రాజ్యపు హద్దులలో ప్రజా రక్షక సైన్యమును కట్టి

దిట్టము చేయుచున్నారు- ఆ శ్రేణిని భేధించి, యుక్తిచే గాని ధవళగిరి రాజ్యములోనికి ప్రవేశించు వలను పడదు -

వివ : ఆ మోహనాంగికై! ఎన్ని రాత్రులీ తాత్సారము! దుర్భరము— ఈ జాగరణము ? ఉన్మాద కారక మగుచున్నది.... సుప్రభా దేవి దివ్యమంగళ రూపము ప్రతి పరిసర రూపములలోను కానవచ్చు చున్నది ! ఆ రమణీయమూర్తిని బడయని జన్మమేల ? అల భ్యుడు అన్య మనస్కుడగుట సిద్ధము—
"ధవళగిరి రాజ్యము నిర్మూలమైనను సరకు చేయను సమీర రాకుమారి సిద్ధించెనేని !-" రాజ్యమా ? రమణియా ?—

ప్రతీ : దేవా ! శంబు మిత్ర సేనానులు-

వివ : రండు వారు! మిత్రా - మరచితిరా ? నాకు క్షణ మొక యుగముగా నుండెనే ?

శంభు: లేదు. రాజా— ప్రజా విప్లవసైన్య శ్రేణి భేధించుట ప్రళయాంతకమైనది. పండ్ల నమ్మికొను వాని వేష ములో ఎటులో బహు ప్రయాసతో సరిహద్దు దాటి తిని. మీ ఉప్పు తినుటచేత పడ రాని పాట్లు పడవలసి వచ్చినది. అమరానందుని విప్లవ చర్యలచే సమీర రాజ్యసభ వాయిదా పడినది.- వానిపై బద్ధానురా గయైయున్న సుప్రభ, మీకు దక్కునని తోచుట లేదు.

వివ : సాటి రాకుమారుని చేపట్టక, సుప్రభ ఇంత విమూఢ అయ్యెనా ?

గోటితో పోయెడిదానికి గొడ్డలియా ?-
శంబు: వేరొక మార్గము లేదు -
రాయబారానికి సమాయత్తము కండు!
ఏక ముహూర్తమున సుప్రభాదేవితో పరిణయము;
సమీర రాజ్య పట్టాభిషేకము -
విన : సంధి విఫలమైన -
శంబు: సమరము ద్వారా రాజ్యాక్రమణము -
చేజిక్కిన రాకుమారితో సరస సల్లాపము -
విన : రాజ్య తంత్రజ్ఞ శిఖామణీ నీ అపార వాత్సల్యము మాకొక పెట్టని కోట - అసతి కాలములో, నీకు ఉభయ రాజ్య ప్రధాన మంత్రి పట్ట ప్రదానము ! నీ కనుచూపులో మహత్తర పరిపాలనాధికారము - మితిలేని భోగము! సేనాని- రమ్ము- విలాస మందిరములో నాట్యరాణులు మన రాకకు ప్రతీక్షిస్తున్నారు.
శంబు: మంచి వినోదము- (ఆత్మగతము) సుప్రభాదేవి, ఈ శంబు మిత్రుని ప్రతీకారజ్వాల ఊరక చల్లారునది కాదు. ఏమనుకొనుచుండివో ?-

నిష్క్రమణ

౹ ♦ ౹ ♦

(పంచమాంకము)

మరునాడు.

[సమీర దేశ రాజ్యసభ అత్యావసర సమావేశము—]

వందిమాగధులు : సమీర రాజ్యరమణా, బహుపరాక్ —
సభికులు : మహారాజులకు దిగ్విజయము —
జన : మహారాజా — నేటి అత్యవసర సమావేశము సమీర దేశ చరిత్రలో అత్యంత ముఖ్యమైనదని, రెండు ప్రధాన సమస్యలపై చర్చా నిర్ణయముల సభ్యార్థిస్తున్నాడను —

ప్రశాంతసింహుడు : ఆజ్ఞ —

జన : రాజకార్య దురంధరులతో నిండిన సభకు నా వినతి: మన సార్వభౌములు ప్రజానురంజకులైన ధర్మమూర్తులు — ధర్మ భూయిష్టమైన వారి పాలన సర్వదా వాంఛనీయమనుటలో సందియము లేదు. కాని వార్థకము చే రాజ్యభారము శ్రీవారికి దుర్ఘటమగుచున్నది. సభ వారిని వారసత్వ నిర్ణయము సల్ప అభ్యర్థించుచున్నాడ. —

ప్రశా: మంత్రి వర్యా, సామంత దండనాథులారా, సభికులారా — వంశ పారంపర్యముగ, సమీర రాజ్య వారసత్వము మన ధర్మశాస్త్ర బద్ధముగ నిర్ణయింపబడుచున్నది. అట్టి నిర్ణయము చేయువారు మన రాజగురువులు — రాకుమారి దివ్య ప్రభ నా ఏక పుత్రిక. ధర్మబద్ధమైన వివేక నిర్ణయము ఒక అగ్ని పరీక్ష ! లోభ, మోహాతీతులైన వివేకవర్ధనుల వారి తీర్పు మాకు అనుల్లంఘనీయము — మీ తీర్పు ! ...

వివేక : ప్రభూ ! ఏ రాకుమారులైన దత్తత చేసికొని రాజ్య ప్రదానము చేయువచ్చును — సమ్మతము కాదేని

రాకుమారి దివ్య ప్రభాదేవికి పుత్ర సంతానము కల్గు దాక ఆమె సింహాసన ధర్మకర్తృత్వము నెరపవలసి యుండును—

సభి : మాకు దత్తత వలదు.... వలదు.

ప్రశా: దత్తత మాకును యిష్టము లేదు— రాకుమారి ధర్మకర్త్రియై పాలించును—

జన : యువరాణి నెరపు ధర్మకర్తృత్వ పాలనలో అప్రమత్తతో మెలగుదుమని సభవారు నిర్ణయించుచున్నారు

శంభు: రాకుమారి సుప్రభాదేవికి జై !

సభి : రాకుమారి సుప్రభాదేవికి జై !

జన : మహాప్రభూ— నేడు మన రాజ్యము అరక్షితమై, అల్లకల్లోలాల భూయిష్టమై యున్నది—పూజ్యులైన రాజగురువులు మమ్ము క్షమింపవలయు— వారిని శంకించుట లేదు— కాని ఈ సందర్భములో వారి పుత్ర ప్రసక్తి అనివార్యమగుచున్నది— మహారాజునకు పుత్ర సంతతి లేదను నెపమున, రాజ్యకాంక్షతో అమరానందుడు స్వగృహము వీడి, శిథిల ఘనగిరి దుర్గము నాక్రమించి, ప్రజా విప్లవ సైన్యమును సమాయత్తపరచు చున్నాడు. రాజు నెదుర్చుట గాకున్న ఈ సైన్య సమీకరణ మెందులకు ?

సభి : నిజము— నిజము....

ప్రశా: అటు లేని ఇది గర్హ్యము....

శంభు: అప్రతిష్టాకరము—ఆజ్ఞ యిచ్చిరేని నిగ్రహ సన్నాహములు పూర్తి గావించెద-

ప్రభా: ఆచార్యా! మీ అభిప్రాయము?

వివేక: రాజా! ఇది పరిపాలనకు చెందిన సమస్య యైనను అడిగితిరి కాన చెప్పుచుంటిని. దేశ రక్షణయు, పౌర భద్రతయు రాజ్య ప్రధాన ధర్మము-నా కుమారుడు ద్రోహిగా నిరూపింపబడిన నిస్సంశయముగ శిక్షింపుడు కాని నిజము నిలకడమీద తేలును. అంతియే-

ప్రభా: ఎంత విచిత్రము! దైవాజ్ఞ ఎట్లున్నదో. దేశ రక్షణ అనివార్యము- ప్రధానీ! భద్రతాచర్యలు గైకొనుడు

జన : చిత్తము- అటులే.

~ ~ ~ ~

## షష్ఠాంకము

[ఆ రాత్రి- రాకుమారి దివ్యప్రభ ఏకాంత మందిరములో]

-: గేయము :-

దివ్య :

వినవోహో ప్రభూ ప్రార్థన
తరింప, పరీక్షా, పావనా?
నిర్వికల్ప, నిరాకారా,
ధర్మమయ, దయాంతరంగ,
అనాథ రక్షక, ఆశ్రితపాల,
దీన జనావన, పావనచరితా! ॥వినవోహో॥

◆ ◆ ◆ ◆

జగాలన్ని నీ విలాసాలా ?
శోభలన్ని నీ విభవాలా ?
రాగ విరాగము నీ రూపంబా ?
జనన మరణాలు చిత్ర గాథలా? ॥వినవాహాహో॥

♦ ♦ ♦ ♦

సత్యరూప, సకలసుతసార,
అమరజీవ; ఆదర్శనిధీ,
ఆనందనిలయ, హృదయారవింద,
పవిత్రాత్మక; ప్రేమదర్శక ....– "వినవాహాహో"

♦ ♦ ♦

విఫలవాంఛితమే నీ వినోదమా!–
జయముకోరకే పరాజయంబా?–
సృష్టిసరళి, చెలగాటముకా?
మౌనమేన నీ సమాధానమా? "వినవాహాహో"

♦ ♦ ♦

నిరతము నిన్నే నమ్మితిగా!
త్రికరణశుద్ధితో కొలిచితిగ,
సర్వస్వము నీ కర్పించితిగ
జాగేల గైకొనగ!– "వినవాహాహో"

♦ ♦ ♦

ఓ అనంత సత్యస్వరూపా .... దేవా ....నా అపరాధమేమి?.., ఈ నిరపరాధినికి కరుణాకటాక్షవీక్షణము కరువయ్యెనా?

శిలాకృతి దాల్చిన వాని గుండె కరగునా? .... అమ్మా, నా చిన్ననాడే ఈ లోకము వీడునప్పుడేల నీవెంట నన్ను కొనిపోలేదు? నా జీవములు నీ పవిత్ర సన్నిధానమున అనంతశాంతిని బడయు గలవు. గ్రహించి, విముక్తురాలి నొనర్పుము. ఆనాడు అమరానందులు నన్ను వీడిన దాదియు అనుక్షణము వారి రాకకై నా నేత్రములు ప్రతీక్షించు చున్నవి.

[ప్రవేశము పరిచారిక]

పరి: దేవీ .... మంగళసూచనము. విప్లవనాయకుండు అమరానందుల జాబు ఇదిగో.

దివ్య: పరమానందము. ప్రభు వనుగ్రహించెను. వారి నిర్దేశమేమి? (పరిచారిక చదువును)

"యువరాణి,

సమీర సర్వసేనాని శంభుమిత్రులు, ప్రధానమంత్రి పదవికై, ప్రతీకారసిద్ధికై ధవళగిరి ప్రభువగు వినయదేవులతో మంతనములు సాగించుచున్నవారు. ఆ ధవళగిరి రాజు, మిమ్ము వివాహమాడుటకును, సమీరరాజ్య పట్టము పొందుటకును మహారాజులు రత్నసింహులకు రాయబార మంపుదురట. ప్రయత్నము విఫలమైన సమరముచే సాధింతురట. ఇప్పటి కప్పుడే ధవళగిరి సైన్యము, మారువేషములతో మన రాజ్య ప్రవేశము గావించుచున్నది. కోటలోపలను, వెలుపలను, మహారాజునకు మిత్రుల

వలె నటించు శత్రువులు సమకూడుచున్నారు. జనహితవర్మ లంచములకు మన దండనాధులు దాస్యము సల్పుచున్నారు. రాయబారము విఫల మైనవెంటనే మహారాజు బందీకృతుడగుట తథ్యము! వినయదేవులతో మీకు రాత్రి సవివాహము నిశ్చయ మగును.

ఈ భారుణఘట్టములో మీరు కోటలో ఒక్క క్షణమైన యుండుట శ్రేయస్కరము కాదు.

వెంటనే బయలుదేరవలె. పశ్చిమపార్శ్వ ద్వార రక్షకుని బంధించితిమి.

నేను కొలదిమంది విప్లవ వీరులతో, వేచియున్నాను. మనము స్వల్పకాలములో ఘనగిరి దుర్గమునకు జేరగలము.

ఆగమనాభిలాషి,

అ మ రా నం ద.

(కొద్ది క్షణముల నిశ్శబ్దము - అడుగుల సవ్వడి.)

దివ్య: సాగరములో గమ్యము తప్పిన నావికునకు మార్గ దర్శియగు దీపస్తంభమువలె అదో నా జీవిత నౌకా కర్ణధారుడు.

అమ: (నల్లని మేలిముసుగుతో. కారు మబ్బులలోని చంద్ర బింబమువోలె రాకుమారి! అంధకారములో ఆశా జ్యోతి!) దేవి, అశ్వారూఢవుకమ్ము.

దివ్య: అమరా! స్వేచ్ఛనుమించిన జీవితేచ్ఛ లేదుసుమా!

(ఎల్లరూ నిష్క్రమణ)

## స ప్త మా ం క ము

[తెల్లవారుఝామున - శయనాగారములో]

ప్రశా: (ఉద్విగ్నుడై ఒక్క-గానొక్క- ముద్దుబిడ్డ. కుమారీ ...
నీ ఆకస్మిక అంతర్ధానము హృదయశల్యమై నన్ను క్రుంగదీయుచున్నది. నా అంతిమ యాత్రకు కాలమాసన్నమైనది. గురువర్యా !
ఈ నా జీవిత సర్వస్వము పోయినపిదప, యింక సింహాసనమేల ?
సన్యాసినై రాజసౌధమువీడి తపస్సుతో జీవిత శేషమును వెళ్ళబుచ్చెద. ఉపదేశింపుడు.

వివేక: మహీపతీ, రాకుమారి అంతర్ధానము ఆకస్మికమైనను, నా అంతరాత్మ అశుభము సూచించుట లేదు.
యువరాణి భద్రతకు నా ప్రాణమునే పణముగా ఒడ్డుచున్నాను.
మతపీఠాధిపత్యము పరిత్యజించి, ఖడ్గహస్తుడనై, ఘనగిరి దుర్గము నొంటిగ మార్కొని, నా యువరాణిని సురక్షితముగ మీ కర్పించెద. లేదేని ఆ పోరులో, దేవతా పర్యంకమున నొరిగి, దీర్ఘ విశ్రాంతి నొందెద.
భూపాల ! అంతదాక మీ చింత నుండుటకు నా కర్హత లేదు.

ప్రశా: అసమర్థులైన సేనానులు, ప్రధానులు, విలాసములలో బడి కర్తవ్యము ఉపేక్షింపగా నేనుమాత్రము

నిశ్చింతగా ఈ గద్దె అధివసించియున్నాడ! రణరంగములో రాజగురువుల సాయము అపేక్షించు అధమస్థితికి చక్రవర్తి దిగలేదు. నేనే స్వయముగ అమరానందు నెదుర్కొనెద.

[ప్రవేశము : ప్రధాని జనహితవర్మ]

జన: సామ్రాట్, సైరింపుము. మా బొందిలో జీవము లుండగా మీరేల వ్యధనొందెదరు ? వివేకవర్ధనులు నిజము నిలకడమీద తెలునని ప్రవచించిరి. అమరానందు డెంత బందిపోటు దొంగయో ప్రత్యక్షముగ నిరూపింపబడెను.

ప్రశా: ప్రధానీ, నేడు నేను తేల్చుకొందును. మరణమో ? మనుగడయో ?

ప్రతీహారి: దేవా, క్షతగాత్రులైన శంభుమిత్ర సేనానులు మీ దర్శనార్థము వేచియున్నారు.

[ప్రవేశము - శంభుమిత్ర]

ప్రశా: శంభుమిత్రా, ఈ గాయములేమి ?

శంభు: రాజా ! యువరాణి అపహరణవార్త విన్నంతనే, ఆ దోపిడి దొంగలు, ప్రజావిప్లవ సైనికుల వెన్నాడితిని. ఆ కుమ్ములాటలో నా అశ్వము బెదరగా ఒక విప్లవ సైనిక కరవాలము భుజోపరిభాగమును తాకినది.

జన: వీక్షించితిరా, మా రాజభక్తి ! నా కుమారుని అచంచలదీక్ష! సాహసము. ప్రభూ, సంశయము నిరూపించబడుచున్నది. ప్రజావిప్లవ సైనికుల బల

గము. ప్రభుత్వ సైనికశ్రేణిని సంఖ్యలో మించినది.

ఉద్రేకభారమున అవివేకముగా తలపడితిమేని పరాజయప్రాప్తి తథ్యము.

ప్రశా: సుశిక్షితులైన రాజసైనికులెక్కడ? ఉద్రిక్తులై కత్తిపట్టిన సామాన్య వీరుడు వారి నెదిరించి నిలబడు టెక్కడ?

శంభు: నా అనుభవము దీనికి భిన్నమని ఋజువుపరచినది.

జన: ఒక్కటే మార్గము. మనకిప్పుడు ధవళగిరి ప్రభువు వినయదేవుడే శరణ్యము.

ప్రశా: ద్రోహచింత! ఎంతమాటంటివి? సమీరరాజ్యమునకు తరతరములుగా శత్రుత్వము నెరపు ధవళగిరి నేడు నీకు అక్కరకు వచ్చెనా?

మానాభిమానములు మంటగలిపి, వారి నర్థించినను అంతిమమున వారిచే ఆక్రమింపబడి సమీరదేశము ఆత్మహత్యాసదృశమై, బానిసరాజ్యమై, హాస్యాస్పదము శోచనీయము కాదా?

జన: ఉద్రేకము, గతమున ప్రజ్వరిల్లిన శత్రుత్వము నేటి మా సముచితనిర్ణయమును, కార్యాచరణమును భంగపరచిన సర్వము తారుమారై వినాశము తప్పదు.

వినయదేవులు క్షత్రియకుమారులు. వారిని ఊరక సాయము చేయుమనుట పాడికాదు. మన రాకుమారిని వారికిచ్చి, మన రాజ్యభద్రతను, వారసత్వ

మును సురక్షితము, సంప్రదాయబద్ధము చేయ వేడుచున్నాడ.

శంభు: మార్గాంతరము లేదు. ... రాజా!

ప్రశా: హితము నెరుగని జనహితుడు. విరికిపంద రాజ్యమునకు ఏకైక ఛత్రాధిపతి శంభుమిత్రా! మీ నీచ ప్రలాపమునకు మిమ్ము బంధించి నేనే ప్రధాన పదవియు, సేనాపత్యము వహింతు. ఎవరక్కడ?

శంభు: (వికటాట్టహాసము) చక్రవర్తీ, మీ హుంకరింపులకిక, స్వస్తివాచకము పలుకుడు. మీరిప్పుడు ఈ కోటలో మా బందీ. పగటి కలలు నిష్ప్రయోజనము.

ప్రశా: దేశద్రోహీ! నిన్నిదే వధించెద. చేవగలదేని కరవాలము చేబూనుము.

[ప్రవేశము, ఖడ్గహస్తుడై వినయదేవుడు]

ఎవరూ నీవా? శత్రూ వినయదేవా?

విన: ప్రశాంతసింహా! నేనే.

రాజులు యుద్ధము చేయవలసినది సేనానులతో కాదు. రాజులతో.

నీ సవాలునకు సమాధానమే నా సంప్రదాయ విరుద్ధ ప్రవేశము. వృథా ప్రయాసమేల? శరణు జొచ్చిన మన్నింతుము. ఇంక ఈ ఉభయ రాజ్యములకు నేనే ఏకైక ప్రభువును. జనహితవర్మ సమీర సామంత రాజ్యమునకు నా ప్రతినిధియై

పాలింప, శంబుమిత్రుడు ఉభయరాజ్య సర్వసేనా
నిగా నా కండయై నిలచును.
చింతించిన ఫలమేమి ? నీ కోటలోని పరివారము
నా పక్షము. కోట చుట్టూ ధవళగిరి సైన్యములు
పరివేష్టించి సల్పు జయజయ ధ్వానములు విందువు.
రమ్ము చూపింతు సంయుక్త సేనావాహినులను.
శంభుమిత్రా ! కారాగారమే వివేకవర్ధనులకు
విశ్రాంతి నియమము. కొంపొమ్ము.

ప్రజలు: (కోలాహలము) కోట శిఖరాగ్రమున ప్రచ్ఛన్న
వీరుడు.

[కోట శిఖర కవాటమునుండి అమరానందుని
సమర గర్జన]

అమ: దేశద్రోహులారా - చోరశిఖామణి వినయదేవా !
వీక్షింపుడు.
సమీరసింహము ఆత్మగౌరవ సిద్ధికై లంఘించు
చున్నది. అప్రతిహతముగ—
మీ నిర్మూలన కనుచూపు మేరలో — సమీర
స్వాతంత్ర్యప్రతిష్ఠ - ప్రతీకార పరాకాష్ఠ—

ప్రజలు: సివంగివలె రౌద్రమున లంఘించు వీరుడు —
జగదేక శూరుడు, అమరానందుడుడు.

శంభు: }
జన: } (నిర్విణ్ణులై) శత్రుశేషమా ?

విన: సివంగికాదు, చిట్టెలుక. (హుంకరించి) త్రుప్పు
పట్టిన నా కరవాలమునకు మహత్తరావకాశము.

అమ: నీచ ప్రసంగములు చాలు - ప్రలాపములేల—

ప్రజలు: ఏమి ప్రచండ ఖడ్గ విన్యాసము.!

అమ: మహారాజా-తండ్రీ, మీరు యుద్ధము చేయువలదు. అంగరక్షకులారా — మీ రిరువురికి రక్షణశ్రేణియై నిలువుడు. ఉపసేనాని-కోటను చుట్టుముట్టిన ధవళగిరి సైన్యమును వలయాకారముగ దిగ్బంధించుటకు ప్రజావిప్లవ సైన్యమునకు సంకేతమిమ్ము— విజయమో! - వీరస్వర్గమో! - విప్లవకారులారా- విజృంభింపుడు. జై సమీర రాజ్యలక్ష్మి!

(యుద్ధ కోలాహలము.)

అష్టమాంకము

యుద్ధానంతరము :

[సమీరరాజ ప్రాసాదము]

వివేక: మహీపాల! మేమందరము మీకు రక్షణ శ్రేణియై పోరుసల్ప ఖడ్గహస్తులై మీ రేల శత్రు సంహారమున కుద్యమించితిరి. వారించుటకు వీలుగాక పోయెను.

ప్రశాం: నాలో జయఘోషలు మిన్నుముట్టుచుండ, చైతన్య స్రవంతి పరవళ్ళు త్రొక్కుచుండ, నన్ను నేనే మరచిపోయితి. క్షతగాత్రుడనైన నేను పొందు ఆనందము నూహింప నివరితరము.

ఖడ్గతిక్కనవైవీరవిహారము సల్పు అమరానందుడు, అపరరుద్రమయై విజయప్రబోధము చేయుచు దివ్య

ప్రభాదేవిని, కనుగొని సమీరరాజ్య నారీమణులు విజృంభించిరి. ఎట్టి మహత్తర దృశ్యము!

[వీరోచిత వేషములతో దివ్యప్రభా,

అమరానందుల ప్రవేశము]

అమ: ప్రభా, విజయవీధులలో విశృంఖలమైన సమీర పతాక! మహాభాగా, స్వీకరింపుడు.

ప్రభా: వీరకిశోరా! కృతజ్ఞుడను.

అమ: మహాత్మా! నా జీవితాదర్శము సఫలమైనదినేడు. జనహితవర్మ, శంభుమిత్రులు, దుశ్చింతనము నెరపి, రణరంగములో పరలోకగతులైరి- వినయదేవుడు ప్రాణభీతితో పలాయనమయ్యెను - దేశద్రోహు లంతరించిన సమీరదేశమును, ప్రజాప్రతినిధులుగ, ధర్మకర్తలై, శాంతిచంద్రికలు వెదజల్లుచు పాలింపుడు - దేశప్రతిష్ఠ నిర్వహణార్థము, మిమ్ము వీడి చనిన వీరనారీమణి దివ్యప్రభాదేవిని సగౌరవముగ సమర్పించుచున్నాడ-

ప్రభా: సమీరభాగ్యవిధాతా!- సామాన్యపౌరుని జీవితము నకు అమరత్వముకూర్చిన ధన్యజీవీ - మాశంక పటాపంచలైనది కృతజ్ఞతా సూచకముగ మేమంద జేయు బహుమానము నామోదించి కృతార్థుల జేయుము.

అమ: సామ్రాట్ - ఆదేశమేమి?-

ప్రశా: నీది - సమీర - యువరాణి-

సుప్ర: తండ్రీ!-నాదొక విజ్ఞాపన - నే నీపీకుని వరించిన పిమ్మట సామాన్య పౌరసత్వము నెరపుటకు సమ్మతింపవలయు.

ప్రశా: అమరానందుడు రాజ్యమును వరింపలేదు-రాజ్యమే అమరానందుని వరించినది - సందియమేల?

ప్రశా: కుమారీ - ఈ దేశభక్తాగ్రణిని పుష్పమాలాలంకృతుని జేసి కన్నులపండుగ జేయుము.

దివ్య: (అలంకరించి) నాజన్మకు నేడు పరిపూర్ణతృప్తి-

వివేక: అమరా - అకలంక త్యాగముచే ధన్యజీవివైన నా పితృత్వమునకు ధన్యత, జేకూర్చితివి-నీకు చెందినది, నీ వద్దకేవచ్చినది - కొండవాగును; ఎంత నిరోధించినను నదికి చేరకతప్పదు — ప్రకృతి ఆ దేశము యువరాణిని మాలచే అలంకరింపుము.

అమ : పిత్రాదేశము, రాజాజ్ఞయు, మనోభీష్టము నిర్వర్తించు అమరానందుడు నిత్యావనుగ సిద్ధారుడు — నా దీక్ష లోకమోదమై శాశ్వతమై జాగృతమొనరించుగాక - దివ్యప్రభా - నాలో నెలకొనియున్న నీ ముగ్ధమంజులమోహనమూర్తి సుస్థిరము సుమా — ఏలయన ఎన్నోవత్సరంబుల నిరీక్షణలో తపియించు భారంబు నన్నిక విడిపోయె, వెల్లువయై ప్రవహించు నీ హృదయవాహిని, లేకున్న విరక్తుని కేల చిరస్మరణీయ రాగోదయసంభ్రమంబు? ధన్యుడనైతి

రాణి,సుస్వాగత సుమార్చనచేతు, ధీమతీ-(పుష్పము లచే యువరాణిని అలంకరించును) ఇద్దరు వినమ్రులై నమస్కరింప-

ప్రశా: సర్వేజనా స్సుఖినోభవంతు-సర్వమంగళానిభవంతు-
వివేక: శతమానం భవతి, శతాయుః పురుష శ్శతేంద్రియ -

ఆయుష్యేవేంద్రియే - ప్రతితిష్టతి-

సభకులు: సమీరార రాజ్య రమకు జై !

---

( సమాప్తం )

# మగువ - ప్రతిజ్ఞ

:- పాత్రలు :-

సిరన్ - గజా నగరాధీశుడు

ఆర్ధర్ - గజా నగర సేనాని

సామ్సన్ - డైనట్ల యువనాయకుడు

మిరియా - భగ్నహృదయమైన డైనట్ల యువతి

డెలీలా - గజా రాజమందిర లావణ్యవతి

సెమెదార్ - గజా రాజవంశీకురాలు

జాకబ్ - సహాయ సేనాని

గుడాల్ఫ - గజాపట్టణ మల్లయుద్ధ ప్రవీణుడు.

# మగువ - ప్రతిజ్ఞ

[గజాపట్టణంలో రాజుకొలువు,]

[రాజు సిరన్, ఆర్డర్]

సిరన్: దేశంలో పరిస్థితులు ప్రశాంతంగా లేవు - అక్కడక్కడ దైనెట్లు తిరుగబడుతున్నారుటగా! - ఆర్డర్ - శాంతి భద్రతలకి, మనజాతి గౌరవానికి నువ్వు తీసుకుంటున్న చర్య? -

ఆర్డర్: ప్రభూ - మన ఉత్కృష్ట జాతికా ఆపద? - ఈ శరీరంలో చివ్వరిరక్తపుచుక్కదాకా శత్రు సంహారం చేస్తాను - స్వయంగా సైనికదళాల్ని దైనట్ల మీాదికి నడిపిస్తాను.

[లోపలనుంచి - "ప్రభూ - వేటకి సర్వసన్నాహాలు చెయ్యబడినాయ్."]

సిరన్: ఇప్పటికి వేటకి ఆలస్యమయింది...నీ వర్తమానం కోసం ఇంతదాకా ఆగాను ..అనుదినం సైనికచర్యలు తెలుపుతుండాలి.

ఆర్డర్: ప్రభూ...ఒక్కమనవి.

సిరన్: నివేదించు.

ఆర్థర్: ఈ శత్రుజాతి డైనెట్ల నాయకుడుగా శామసన్ మనకెంతటిద్రోహియో జ్ఞాపకంచెయ్యాల్సిన అవసరం లేదనుకుంటాను.

సిరన్: అయితే...

ఆర్థర్: ప్రభూ...నిజంమాట్లాడితే నిష్ఠూరమయ్యే. ఈ క్లిష్ట సమయంలో నా నివేదన అపార్థభూయిష్టమవగలదేమో?

సిరన్: శామసన్, శత్రుజాతి నాయకుడు వినా అతనిలో దుర్మార్గాన్ని ఆరోపించేగుణం నాకు అవగాహన కావడంలేదు.

ఆర్థర్: పాముకు పాలుపోసి పెంచడమా! ఆ వృద్ధుడు, డెలీలాతండ్రి ఇంటికి, శామసన్ ... రాకపోకలు సాగించడమూ—...

సిరన్: అది ఏ విధంగా అపరాధం?...

ఆర్థర్: అంతమాత్రంతో తీరిపోతే బాగుండేది?...అందాల కుప్ప,లావణ్యవతి సెమిదారుతో ప్రణయకలాపం!–ఒకవేళ వివాహమే సాగితే అల్పజాతికి అధిక గౌరవం కలిగినట్లయి, మనజాతికి తలవంపులుకాదా యని తర్కిస్తున్నాను...ప్రభూ...

సిరన్: విచారిస్తాను...

  

# 2

(గజాపట్టణశివార్లలోని కొండగుహాలలో
సామసన్, మరియా)

మరియా: శామూ (గద్గదికంగా) ఈ విర్లక్ష్యానికి కారణం?... ఇల్లు పట్టించుకోవు...

సామ్: విసిగించక:::

మరియా: నాకు విసుగు లేదు...నామనస్సంతా – నువ్వే అయి వుండగా ఇంక దేన్ని గురించీ ఆరాటపడే అవసరం లేదు ..

సామ్: చూస్తూ, అక్రమాలని సహించాలనా?

మరియా: సహించటం న్యాయమని చెప్పటం లేదు...పాలకులు సైన్యబలసమేతులైన బలవంతులు.. ఆయుధపాణులును. వాళ్ళకెడివి ఆమహాబలగాన్ని ఎదుర్కొనగలవా!...ఇంక నీ తొందరపాటువల్ల నీకు, అందరికీ ఓ విధంగా బాధలు ఇనుమడిస్తాయేమో?

సామ్: బాధలా!...కాని ..స్వాతంత్ర్యసమరంలో బాధలు–హృదయాహ్లాదాలే.. బానిసత్వాన్ని అంగీకరించడం కంటే...ప్రాణాల్ని ఒడ్డి జీవనమరణపోరాటంలో వీరాగ్రేసరుడనై.. పాల్గొంటాను...

మరియా: కాని శామసన్...శత్రుజాతివారితో హితవుగా మసలడం...సెమీదారులతో...

సామ్ అది పూర్తిగా వ్యక్తిగతం!

మిరియా: సెమెడారుని వదలలేవా? నీ ప్రేమశత్రుత్వాన్ని అధిగమించిందా? శామసన్, ప్రేమగుడ్డిది - అది ఒకనాడు నీకు అంధత్వాన్ని ఆపాదిస్తుంది....

సామ్: బాహ్యాచక్షువుకంటే ప్రేమచక్షువు వాంఛనీయం-

మిరియా: పుట్టినప్పటినుంచి ఒక వ్యక్తినే ప్రేమించాను - పూజించాను - ఆరాధించాను - దేవునికిచేసే ప్రతి ప్రార్థనలోను అతడికి సేవచేసేభాగ్యం కల్పించు కున్నాను - నా బాహ్య మానసిక ప్రవృత్తుల్ని పూర్తిగా ఆక్రమించి, అపహరించి నన్ను అబలను, అశక్తను, అనాధను చేస్తున్నావుకదూ?-

సామ్: నిన్నుచూస్తే నాకుజాలి - క్షమించు - ప్రేమ లేదు- అదుగో - సెమెదారు అక్క డెలీలా - పరుగెత్తు కొస్తోంది - ఎందుకో!-ఆం మరిచిపోయాను-

మిరియా: ప్రేమకి స్వార్థంలేదు - నీ ఆనందమే నా ఆనం దము - నీ ఆమోద, తిరస్కృతులతో నిమిత్తాలేని, పవిత్రప్రణయప్రతిభావిశేషాన్ని నా జీవితాశయంగా చేసికొన్నాను...

సామ్: వ్యవధిలేదు - పోయిరమ్మ్నశెలవా, మిరియా-

మిరియా: హో - శామసన్-నానుంచిపోయావని విచారిస్తున్నా నని ఏమాత్రం అనుకోకు - కాని నీ మీదగల అఖండప్రేమకు నాకున్న అల్పజ్ఞానంతో, నీ శ్రేయ స్సుకు ఆరాటపడతాను. కత్తులబోనులో చిక్కు- కొనికూడా, పుష్పశయ్యపై పవళించే నీభ్రమకి నాకు ఆవేదన కలుగుతోంది-ఒకనాడు ఆ మెత్తటి

పుష్పరేకులనుంచి, వాడియైనకత్తులు నిన్ను ఎదుర్కొనకుండుగాక!-

సామ్: (నవ్వుతూ) మిరియా - అమాయకురాలు, పాపం- పిచ్చిమిరియా-మనసారావలచినప్రియుడి నిష్క్రమ. నిష్కళంక తిరస్కృతి, ప్రేమాతమకంలో అపార్థం చేసుకోడం సహజం! అందరికీ నిరాశ ఒకనాడు తప్పదు. కాని జీవించడానికి ఆశ ప్రధానం - ఊర డిల్లు. ఇప్పుడేవస్తాగా - తిరిగి - డెలీలా! - ఏదీ?-ఓ వస్తున్నా - డెలీలా - గుర్రాన్ని ఆపు - డెలీలా-



# 3

[వేగంగా గుర్రాన్ని తోలుతూ, తేలికైన శకటంపై డెలీలా, శామసన్‌లు]

డె : అబ్బ! - ఆపు శామసన్-

శా : ఇంతేనా - మరి...

డె : అబ్బా, కళ్ళు తిరుగుతున్నయ్ - (భయంగా) పడి పోతానేమో-

శా : మొదట అసలు భయమంటే ఎరగనన్నావుగా!

డె : (చిరుకోపంగా) బాగుంది...ఆపత్సమయాల్లో అనుచిత ప్రసంగాలు! - (ఒక్కసారి) అమ్మయ్యా...

చూశావా-దూరంగా ఆకొండచరియల్లో-సింహం-
ఇటేవస్తున్నట్లుంది...

శా : [నవ్వుతూ] ఎంతమంచిసమయుం - గొప్పవేట!

డా : శామ్, జాగ్రత్త...గుర్రాల్ని మరోవైపు పట్టించు-
బ్రతుకుతే అదేపదివేలు! -ఆయుధాలైనా లేకుండా-
సింహంతో చెరలాటమా?...

శా : ఆ సింహాన్ని చంపిగానిరాను ... ఈ శామసన్ కి
ఆయుధాల అవసరం లేదు - అదంతా బలంలేని
పిరికిపందలకి!

డా : (ప్రళయంగా) అయ్యో - శామ్... వెళ్ళావా?...
మనిషివా; మృత్యుదేవతవా!...

[ఘోరంగా పోరు సల్పిన వైనం]

డా : "శామ్... తప్పించుకో ఆదెబ్బ-"
"కళేబరం...కొట్టు. ."
"నొక్కి వెయ్యి. ..చీల్చివెయ్యి"...

డా : శామ్...నువ్వు మనిషివికాదు...మానవాతీతుడివి?
దైవాన్ని జీర్ణించుకొన్నమూర్తివి ... హృదయుం
పొంగగా, నా సర్వం పులకరించగా నిన్ను గాఢా
లింగనం చేసుకోనియ్యి...,నీ గాయాలని నా మృదు
పెదవుల చుంబించి ఉపశమనం ప్రసాదించనీ -
నీ ప్రణయగాంభీర్యంలో ఈ లావణ్యం కరిగిపోనీ-
నీలో నివసించి, ఒకగాఢ పులకరింపు నన్ను ఆవరిం
చగా లోకాన్ని పరవశత్వంతో పారజూడనీ-

శా : అదుగో - సిరన్ రాజు - పరివారంతో - ఇక్కడికే వస్తున్నారు...

డే :
మహాప్రభూ... జోహార్లు...
శా :

సిర : మంచిది. శామసన్, ఈ గాయాలు!

డే : ఏం చెప్పను? రాజా, ఒక్కడే మహా వీరాధి వీరుడిగా, ఉరుములాగ తటాలున ఎదురొస్తున్న సింహంతో హోరాహోరి కలియబడి పోట్లాడి వధించాడు. బలానికి, ధైర్యానికి ఇతడు జీవనిదర్శనం. ఒక్క మాటలో మనకీ, మన రాజ్యానికీ గర్వ కారకుడు.

సిర : (ఆశ్చర్యంతో) వమ్మలేకున్నాను. జాకబ్, ఆ సింహ శరీరంలో ఎక్కడైనా ఆయుధంతో చేయ బడిన గాయాలు వున్నవ్యేమో చూడు.

జాక : ఏమీ లేవు ప్రభూ. గొంతు నొక్కి వేయబడి, వధించబడి వున్నది.

సిర : ఇది మంత్ర, తంత్ర ప్రభావం కాదుకదా? అయినా ప్రత్యక్షంగా పరీక్షించాలి. శామసన్, ఇదే నా పరీక్ష. సింహబలుడు రుడాల్ఫ్‌తో మల్లయుద్ధం జేసి గెలుపొందు. అప్పుడు నేను సంతృప్తి పడటం కాకుండా నా చిరకాల మనోభీష్టానికి ఆమోద ముద్రతో - ప్రణయ మాధుర్యంలోని, ప్రధమానుభూతిని ప్రస్ఫుటింప చేస్తాను. అదుగో రుడాల్ఫ్! ఆయత్తపడు.

[మల్లయుద్ధం... తీవ్రంగా గాయపడిన రుస్తాల్సు ఆక్రందన]

సిర : విజయ శీలుడా! నీ సామర్థ్యానికి అన్ని విరోధ శక్తుల్ని అధిగమించే అభిమానం పొందుకరాగ, నీ వలపు రాణిని మనసార కోరుకునే స్వాతంత్ర్యాన్ని సౌహార్ద్రంతో సమర్పిస్తున్నాను.

శా : ప్రభూ! మీ ఉదార హృదయానికి నమో వాకములు. రసిక రంజని, కలువ కన్నుల సెమెదారు కన్య హస్తాన్ని అందుకోటానికి అర్థిస్తున్నాను.

డె : (ఉద్వేగంతో) శామసన్. ఏమిటో ఈ వైపరీత్యం! అద్భుత అందాల రాశినై, నీ కనుసన్నలలోని కాంతికి ఇన్నాళ్ళు అంధకారంలో నుంచి ఎదురుచూస్తూ, నిన్నే నన్నుగా ఆపాదించుకొని జీవిస్తున్న నన్నుగాక ప్రేమ నెరుగని పాషాణ హృదయ, సెమెదారునా ఆశించుట! శామూ! ప్రేమ సందేశ మెరుగని పురుష హృదయము వజ్ర హృదయ మయ్యూ నిష్ఫలం. స్త్రీహృదయపు లోతు లెరుంగని నీ విజ్ఞాన విశేషము అడవిన గాచిన వెన్నెల.

శా : క్షమించు డెలీలా. ప్రేమకి అందం కంటె ఏదో ఇంకో ముఖ్యమైన ఆకర్షణ వుంది. ఆ ఆకర్షణ అనుభూతము. వివరించ లేని అసహాయుడను. నా ప్రేమని మరల్చి కృత్రిమ వాతావరణం కల్పించి, నీకు, నాకూ అపచారము చేయుట శాంతి కారక మవుతుందా!

డె : ఇంకా సమయం మించలేదు. నీ మనస్సును నువ్వు పాలించు. మనస్సుచే పాలించబడే అశక్తుడవు కావద్దు. ఈ డెలీలాను చేపట్టిననాడు నువ్వు పొందే అదృష్టానికి నేనే ఈర్ష్య పడతానేమో అనిపిస్తుంది. శామ్, ఇది అపూర్వ్య(?)తరుణము. .

శా : అసహాయుడను.

డె : కాని! స్త్రీ హృదయము ఎంత ప్రేమ మయమో, అంత ప్రతీకార భూయిష్ఠమని నువ్వు తెలిసికొనే రోజు రాకపోదూ! ఈనాటి తప్పిదానికి ఆనాడు పరితపించకుందువు గాక!

శా : మదవతీ! ఒక్క నిశ్చిత మార్గానికే కట్టుబడిన వాడికి ఈ కష్టసుఖాలు, వెలుగు నీడలు - అచంచలము. ఒకనాడు, నేనే శిక్షకు అర్హుడనైన, అప్పుడు కూడ నా నిశ్చిత మార్గముననే సంచరించునట్లు ఆశీర్వదింపుము.

సిర : శామసన్! నీ అభీష్టము నెరవేరుగాక!

అర్ధ : మహారాజా! ఇంతకంటె మరో అమానుష చర్య వుండగలదా అని విన్నవించుకుంటున్నాను. జాతి భ్రష్టుడూ...

సిర : దీనిలో నా కేట్టి అమానుషం కనబడటం లేదు. ఏమైనా అర్హుడైన వాడికి అర్హత అనివార్యం.

అర్ధ : మొదటి నుంచి నా ఆశ లన్నిటిని సెమిదారు మీద కేంద్రీకరించాను. ఇది అందరకు తెలిసిన విషయం. ఆమెను నా కిస్తానని, డెలిలా తండ్రి వాగ్దానం

చేశాడు. మీ ఈ నిర్ణయం నాకు నైతిక పతనమని గ్రహించారా ప్రభూ!

సిర : దానితో నిమిత్తం లేదు. వ్యక్తిగత అభీష్టాలు, జాతి విద్వేషాలు నా నిర్ణయాన్ని మార్చలేవు. రాజు వాగ్దానం శాసనమని విస్మరించావా ఆర్థర్.

♦ ♦ ♦

[వధువుగా అలంకరించబడ్డ సెమెదారుతో ఆర్థర్]

ఆర్థ : ప్రియా! సెమెదారు ఎంతటి ఆశాభంగం!

సెమె: క్షమించు ఆర్థర్. నీమీద గౌరవమే కాని ప్రేమ లేదంటే అపార్థం చేసుకో వనుకుంటాను.

ఆర్థ : అవును, మగువ మనస్సు మిథ్య.

సెమె: నా చనువును నువ్వు కల్పించుకున్న అర్థం మిథ్యేమో!

ఆర్థ : ఈ తుదిక్షణంలో సైతం నన్ను కరుణించగలవు.

సెమె: శామసన్ లాంటి భర్తను పొందకుండా వుండటం కంటే మరణం మేలు!

ఆర్థ : సెమెదార్. కానున్నది కాకమానదు.

సెమె: అదుగో గంటలు. కాలాతీతం అవుతోంది. ఊరడిల్లు. వెళ్ళివస్తాను.

[సెమెదారు నిష్క్రమణ - డెలీలా ప్రవేశం]

ఆర్థ : వచ్చావా, డెలీలా.

డె : సైనిక పాలకుడిలో సైతం ఈ నిస్పృహా! ఈ వివాహం వల్ల మనిద్దరికి తీవ్ర అపచారం జరిగింది. ప్రతీకారమే మనకు శరణ్యం.

ఆర్థ : ఏం చెయ్యాలి? నా తల తిరిగిపోతూంది.

డె : ఉల్లాసానికి ఈ పానీయం పుచ్చుకో... ఆఁ, ఎంత హుషారుగా వున్నావు! విను – మన సైనికులని వివాహానికి అతిథులుగా పంపించి, కల్లోలం రేకెత్తించాలి.

ఆర్థ : చాల బాగుంది. ఇప్పుడే కబురంపిస్తాను.

డె : ఆ సమయంలో, సెమెదారుని తీసుకుపో. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు ... ప్రతీకారోపశమనం.. ప్రియురాలి ప్రణయాలింగనం...

ఆర్థ : రాజు మాట!

డె : ఇంకా రాజేమిటి? ఆ రాజుకు నేను రాజును. నా ప్రణయ లీలలో అతడొక ఆటవస్తువు. ఇంక అస్త్ర మత్తుడివై సిద్ధం చెయ్యి. ఒక్క కనుసైగతో సర్వనాశనం. (నవ్వుతుంది)

ఆర్థ : డెలీలా, నా దేవతా! వాంఛాఫల వరప్రదాయినీ!

[వివాహ ప్రాంగణంలో డెలీలా, తండ్రితో]

డె : నే జీవించి ఉండగా ఇంత అన్యాయం చేస్తావా నాన్నా?

డె.త: నేనేం చెయ్యను? సెమెదారు భీష్మించుకుంది.

డె : ఈ పరిణామం ఎలా రూపం దాలుస్తుందో తల్చుకుంటే...

డె.త: నీ ప్రేమ స్వార్థ భూయిష్టమా?

డె : ప్రేమ శక్తిని విస్మరించు నైతికశక్తి లేదు నాకు.

డె.త: అదుగో... శామసన్.... శామసన్! ఇది నా కడసారి అభ్యర్థన. ఈ ఉత్కృష్ట అందాలరాశి, సహజ లావణ్య శోభావతి నీకు అన్నివిధాల ఎక్కువగా తగింది. నామాట విను.

శా : కావచ్చు. అతిశయానికి, ఆచరణకి సంఘర్షణ.

డె : శామసన్! అగ్నిలో ఆజ్యం పోసి మంటలు రేకెత్తించే నీ ఆశయాలు అశాంతి జ్వాలల్ని రేకెత్తించగలవు. ఆలోచించు. ఊఁ....

శా : కానీ.... (వెళ్ళిపోతాడు)

డె : తండ్రీ! తప్పదు, వినాశనం తప్పదు- పోతున్నాను.

డె.త: ఆఁ! ఏమంటున్నావు? ఆగు.

డె : జీవన మరణ సమస్యకి వ్యవధా? ఎవరక్కడ? ఆర్ధర్ ఏడీ?

డె.త: డెలీలా !

డె : ఆర్ధరు! దూకించు ఆ సైనిక సమూహాన్ని.

[సంకుల సమరంలో, సెమెదారు, ఆమె తండ్రి మరణిస్తారు. సైనికులతో వీరవిహారం చేసి, భవనామంతా అగ్నిమంటల పాలుకాగా, శామసన్ కొండ చరియల్లోకి పరారి అయినాడు.]

## 6

[గజాపట్టణం - రాజాస్థానము - సిరన్ రాజు, సభికులు]

సిర : ఈ నా రాజ్యంలో ఒక అల్పుడు అశాంతి జ్వాలల్ని రేకెత్తిస్తున్నాడే? ఇందరు సైనికులు, ఇంత మహా

పరివారం ఆ చిట్టెలుకని పట్టలేక పోయినయ్యా? గోటితో పొయ్యే పనిని గొడ్డలితో సాధించలేని ధీరులు! విలాస వినోదాలకి దాసులైన ఈ వీరులు వీరవిహారం చేస్తారా? ఇంక ఆలస్యం చెయ్యరాదు! ఇప్పుడే చర్య తీసుకోవాలి. మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా? ఎవరక్కడ?

[సైనికుడు]

సై : ప్రభూ! సైనిక పాలకుడు ఆర్థర్ రాక....

సిర : ఆర్థర్! మహా తీరిగ్గా వస్తున్నావు, ఏమయింది?

ఆర్థ : (నిస్పృహతో) ఏంచేస్తాం ప్రభూ! అది యుద్ధ తంత్రమో, మాయా జాలమో మా అందరినీ ముప్పతిప్పలు పెట్టి పరారి అయినాడు. కోపం పట్ట లేక ఆ డైనేల్ల గ్రామాన్ని దోచి, తగులబెట్టాం.

సిర : మహాగొప్పపని చేశారు. నీబదులు ఆ శామసన్ కే సైనిక పాలకుడి పదవి యిస్తే అమోఘంగా వుంటుంది.

ఆర్థ : అసలే అలసి, ప్రాణావశిష్టంగా వున్నాను. ఇంతకీ ఇంకో రహస్యం విన్నవిద్దామని వచ్చాను. ఆ శామసన్ని పట్టడానికి డెలీలా రాణి ఉపాయ మార్గమే శరణ్యం.

సిర : ఏం జరిగింది? ఎవరక్కడ? రాణీగారికి కబురంపు.

ఆర్థ : మనం ఆ అనాగరిక డైనెల్లపై తీసుకుంటున్న కఠిన చర్యల్ని ఇనుమడిస్తూ శామసన్ని పట్టి యిస్తేగాని,

మీా కీ విపరీత పన్నుల బాధ తప్పదని చాటింపు వేశాను. ఎన్నో సంకుల సమరాల్లో చిచ్చర పిడు గైన వాడల్లా, తనంతట తాను లొంగి పోయాడు. ఇంక విజయ గర్వంతో గజాశ్వ మార్గము గుండా హింసిస్తూ, పరిహాసిస్తూ, నా రథానికి చేతులు కట్టి తీసుక వస్తుండగా తుఫాను వచ్చింది. ఒక్కసారి తాళ్ళు అవీ తెంచుకుని, చేతి కందిన గాడిద ఎము కతో సైనికుల శిరస్సులన్నీ అందినట్లు చితగ్గొట్టాడు. ఆ బల మేమిటో! ఆ ఉద్వృతం ఎక్కడిదో! గొప్ప మాయా జాలం.

సిర : మాయా జాలమా ?

అర్థ : ప్రభువులు మన్నించాలి. ఈ శక్తిని నైతిక శక్తి వశం చేసుకో లేదు. మార్గాంతరం ఆవశ్యం... అస హాయుణ్ణే.

[ప్రవేశం, డెలీలా]

డె : అసహాయుడవా? ఛా! డెలీలా ముందు ఈ అశక్తత వెల్లడించడానికి సిగ్గువేయుడం లేదూ? ప్రభూ! ఎన్నడూ లేనంత ఆలోచనతో మథన పడుతున్నా రేం? ఈ దాసికి ఆజ్ఞ యిచ్చి మీాకు స్వేచ్ఛ నిచ్చే మార్గానికి దోహదం యివ్వరూ?

సిర : ప్రియా! నీ ఆలోచనే మా కిప్పుడు ఆదరణీయు మాటుంచి, అత్యంత ఆవశ్యకమైంది. నీవే మాకు శరణ్యము.

డె : ఎంతమాట! ఇంత బలగాన్ని, ఇంత వ్యయ ప్రయాసలని వెచ్చించడం ఒక వ్యక్తిని బంధించడానికి వీలు కాకపోయిందిగా! ఈ అబల కోమల హస్తాలు ఆ ఇనుప హస్తాల్ని ఇనుముక్కులో కలవా?

సిర : ఇనుముక్కులో కలవు. ఎంత కోమలంగా వుంటే అంత త్వరగా.... సులభంగా....

డె : ఏమైనా ఇదేనా ప్రతిజ్ఞ - రాజ్యప్రతిష్ఠకోసం శామ్సన్ని బందీని చేస్తాను-

సభికులు: డెలీలా - చాతుర్యశీలి - వజ్రవైఢూర్యాలతో నిన్నలంకరించి మాకన్నులపండుగ చేసుకొంటాం.

డె : అవి తృణప్రాయాలు - ఈ ఆశయం - జీవం, నాకు, - అరం కాదు! - కాని ఒక్క విన్నపం.... నా బందీ శరీరంనుంచి ఒక్క రక్తబిందువు నేలపడ రాదు. ఈ ప్రమాణాన్ని మీరు ఏకగ్రీవంగా చేసిన నాడు, నా కార్యారంభం సఫలం కాగలదు-

సభి : ఓ తప్పకుండా - అతడిచర్యల్ని అరికట్టడమే ముఖ్యం....

సిర : హామీనిస్తున్నాను - ప్రియా-

డె : ధన్యురాల్ని - ప్రభూ-

సిర : ఈ రాజ్య నౌకకు నీవే చుక్కానివి!- డెలీలా-

* * *

# 7

[గజాపట్టణ శివార్లలోని కొండచరియల్లో గుడారం నిర్మించుకుంది, డెలీలా - శామసన్ సహజంగా దాడిచేసేం దుకు అక్కడికివచ్చి తన్నుచూడగలడనే ఆశతో]

(నిశీధంలో అడుగుల చప్పుడు)

శా : ఓహో గుడారం - చాలశోభాయమానంగావుంది?- ఆఁ-ఎవరా సాకుమారి!-ఎంత అదృష్టం ఈ రోజు!- (ప్రవేశించి) ఎవరక్కడ-శామసన్ రాక - మాట్లాడ వద్దు-ఆఁ ఎవరూ?-

డె : మీచరణదాసి డెలీలాని!

శా : ఫిలిస్టయిన్ రాణి డెలీలా?-

డె : లేదు - శామూ-నీ తిరస్కృతినొందిన దీనురాల్ని-

శా : ఏమైనా - నువ్వు మాట్లాడేది శామసన్‌తో కాదు- ఒక విప్లవకారునితో! అందుల్లో శత్రువై... నన్ను ద్రోహం చెయ్యడానికి వచ్చావేమిటి!-

డె : అతడు నానుంచి జీవాన్నే దోచేశాడు - బహుశా దోచయాల్సిందేమీ లేదని అతడికి ఇంకా తెలియక పోవడం ఆశ్చర్యకరమే - ఒకవేళ ఏదైనావుందని భావించేపక్షంలో అతడు ఆహ్వానితుడైన సర్వ స్వతంత్రుడు.

శా : డెలీలా - ఇంకా ఇలా అనగలుగుతున్నావా?-

డె : అవును - ప్రభూ - నా సర్వం నీ అధీనం-

శా : రాణి - ఇదుగో - అచలుడనై ఇక్కడ శిరంతో నిల్చొనియున్నాను. నన్ను దోచుకో - డెలీలా-

డె : (చలించి) శామ్ - జీవనిర్మాణా - ఒక్క విషయం నిర్వికాముడివై వావంకచూడు - మనకు యీ లోకంతో, జాతులతో, వైషమ్యాలతో, ఈర్ష్యలతో నిమిత్తంలేదు - మనభాష - ప్రేమ-జీవము, సర్వస్వము ప్రేమ - ఈ నిర్మలప్రేమ సరస్సులో జంట హంసలమై స్వర్గతీరానికి తేలిపోదాం-

శా : డెలీలా!-

డె : శామ్ - మనని గుర్తించని ఈజిప్టుదేశానికిపోదాం- మన ప్రసక్తి ఎవ్వరికివుండదు - నిశ్శంకతో శేషజీవితాన్ని మధురప్రాయం చేసికొందాం-గతం దుఃఖభూయిష్టం - భవిష్యత్తు ఆశాజనకం

*　　　*　　　*

# 8

[సర్వాన్ని మరిచి కొన్నాళ్ళు ఆనందంగావుండగా-ఒకనాడు]

డె : (నవ్వు)

శా : ఎక్కడదాక్కొని ఆ ముసిముసి నవ్వులు?-

డె : ఇదుగో - ఇక్కడే-

శా : చేపలాగా - సరస్సులోనా - వస్తున్నావుందు....
తప్పించుకోగలననా ఆధిమా!....

[తలుపుచప్పుడు]

శా : ఎవరూ?

సర్వం: [ఆదుర్దాగా] శామసన్!-

శా : (తలుపుతీసి) నువ్వా - మిరియా!-

మిరి : (ప్రవేశిస్తూ)—(వెక్కి వెక్కి ఏడ్చినచప్పుడు)

శా : ఎందుకీ ఆరాటం - ఆవేదన? — మిరియా —
మిరియా—చెప్పవూ!—

మిరియా: ఏం చెప్పను శామసన్!—మన డైనట్లని చిత్రహిం
సలపాలు జేస్తున్నారు—ఇంక—మరి—

శా : ఊఁ, చెప్పు—

మిరియా: నీ తల్లిదండ్రులు రాళ్ళతో కొట్టబడి ప్రాణా
వశిష్టంగా వున్నారు—నీమీద జాతి అంతా ఆశ
పెట్టుకొని జీవిస్తోంది—

శా : [కోపంతో] ఛా—నీచులు—హత్రమారుస్తా—

డె : (ప్రవేశిస్తూ) అబ్బ — ఎంతసేపటకీ రాకపోతే
బయలుదేరివచ్చాను—ఓ—ఎవరీమె! —మిరియా
కదూ!—

శా : ఎవరైతేనేం.... వెళ్ళిపోతున్నాను—సెలవు—

డె : ఏమిటీ వేళాకోళాలు....

శా : ఫిలిస్టయిన్ల అరాచకాలకి ఒక హద్దు కల్పించ బడాలి - ఆగలేను - నాతల్లిదండ్రుల్ని రాళ్ళతో చిత్రహింసచేశారట - ఇంక —

డె - శామూ - తిరిగి - వెళ్ళిపోతున్నావా? — మన తియ్యటి ఊహాలన్నిటిని కలలుగాచేసి వెళతావా?-

శా : వెళ్ళక తప్పదు - నిశ్చయం —

డె : ఒక్క కోరిక తీర్చవూ?—నాతో ఈ ఒక్క రోజూ వుండిపో.—నాతో—

శా : సరే—మిరియా—. రేపీపాటికి అక్కడవుంటాను— తెలియజెయ్యి—నిర్భయంగా వుండండి....

♦ ♦ ♦

# 9

(ఆ రాత్రి)

డె : అనుకున్నంతా అయింది - నిప్పును వస్త్రంలో ఎన్నాళ్ళు దాచగలం! - శామసన్ తిరిగి అక్కడికి వెడతాడు - ఇంక నావాడు కాజాలడు - అందుట్లో... ఆ మిరియా కదలనీయదుకూడా — నాకు కానివాడై, అక్కడ వుండటంకంటే, బందీగా అతడువుండటం వాంఛనీయం-ఆఁ జ్ఞాపకంవచ్చింది- తనబలమంతా జుట్టులోవుందని ఆనాడు మాటలసందర్భంలో చెప్పాడు!-ఎలాగైనా-అతడిబలాన్ని నాశనం చెయ్యాలి—అశక్తుడయివుండగా సైనికులని రప్పించి

అంటూ వుంటుందా నరకంలో – ఈ లోకంలో !–
హాంతకీ.

డెలీలా : నా ఆరాధ్య దైవం నా కున్ననాడు నాకు నరకం లేదు ఎక్కడా? – కాని – నరకానికి పోవల్సిన అగత్యం లేనప్పుడే నరకబాధని నాకు ప్రసాదించారూ– ఇక నూతనంగా పొందవలసిన శిక్షా నాకు లేదు – ఉన్నా అది నా కెట్టి బాధని కలిగించదు.

శామ్ : సత్యాదర్శం లేని నీవు ప్రేమకు అనర్హురాలివి – అంతరాత్మ శిక్షకి ఏ న్యాయస్థానాలు, ఏ రాజులు– ఏ సైనికులు, ఏ శామ్సన్‌లు అక్కర లేదు.

డెలీ : కాని నీ మీదగల అఖండ ప్రేమకి వశవర్తినై ఇలా చేస్తున్నానని నువ్వు గ్రహించే రోజు రాకపోదు – ఈ ఆత్మ వంచన నీ కోసం చేసికొని, నే నెంత స్వార్థత్యాగం చేస్తూ కుమిలి పోతున్నానో, నువ్వు అర్థంచేసుకొనే సమయం రాకపోదు. ఆనాడు డెలీలా ఒక ఆత్మవంచకి యైన పాతకి కాదు – ఆత్మార్పణ చేసి కొన్న అమర జీవి! – (వంచితుడైన శామసన్ క్రూరంగా హింసించబడి, అంధత్వము పొంద బడుతాడు. స్వయంగా అర్థరు వజ్ర హృదయుడై ఈ అమానుష చర్యజరిపిస్తాడు. దానికిమించి ఆహార పానీయాలు సరిగా అంద జేయక అంధకార బంధుర మైన గుహలో బంధించబడి, కఠిన శిలల్ని పిండిచేసే మరని చేతులతో తిప్పించేపనికి నియోగించబడతాడు.)

[బందీ గృహ ప్రాంగణము - సిరన్, డెలీలా]

సిరన్ : ప్రియా - బందీని చూడాలన్నావు ?-

డెలీలా : అవును - ప్రభూ —

సిరన్ : దా, గుహలోకి పోదాం - జాగ్రత్తగా దిగాలి మెట్లు - ఆఁ చూశావా ? ఆ మలినుడు శాంసన్! -

డెలీలా: అలా వున్నాడేం - ఈ గుహలోనే ఇన్నాళ్ళు బాధించి వుంచారు ? - ఆ గాంభీర్యాకృతి శత్రువుల గుండెల్లో భయోత్పాతం రేకెత్తించె ఆ వీరపురుష విగ్రహం — అశక్త అనాదరణలతో కృశించబడి వుంది. అయ్యో. దాహమని కాబోలు అడుగు తున్నాడు.

సిరన్ : (నవ్వుతూ) నీ బందీపై ఈ అవ్యాజానురాగ ప్రేమ!- ఎవరక్కడ ? - బందీకి దాహము యివ్వు ! -

డెలీలా: ప్రభూ - ఇంత హింసాకాండ జరిపిస్తారంటే అతడిని పట్టి యిచ్చేదాన్ని కాదు! (దుఃఖం) - ఇక్కడ వుండ లేను.

సిరన్ : వుండి మాత్రం ప్రయోజనం - అతడికి దృష్టి వుంటేగా నిన్నుగాని లోకాన్నిగాని చూసేందుకు ! -

డెలీ : (ప్రళయంగా) దృష్టిలేదూ? - ఏంచేశారు ? అయ్యో. ఒక్క రక్తపు బొట్టుకూడా అతడినుంచి రాల్చనని ప్రతిజ్ఞ ఇచ్చారే !-

సిరన్ : అవును ఒక్క రక్తపు బొట్టును రాల్చలేదు - దృష్టికి రక్తంతో సంబంధం లేదు, రాణి !-

డెలీ : అయ్యో - నా శామూ !_

# 11

[శామసన్‌కి దృష్టిపోయినా కాలానుగుణ్యంగా జుట్టు తిరిగి వచ్చి, అతడు కోల్పోయిన మహాశక్తిని తిరిగి పొందుతాడు. తత్ఫలితంగా ఎంత కఠిన పనైనా సునాయాసంగా చెయ్యగల్గడంలో ఫిలిస్టయిన్‌లు అతడిని తుదముట్టించడం వినా, కార్యాంతరం లేదని భావించారు. పశ్చాత్తాపంతో తీవ్రవేదన పొందిన డెలీలా, తన ప్రతీకార చర్యకి అర్థం, శూన్యమని గ్రహించి, గాఢంగా ప్రేమించిన అతడిని ప్రతీకారం ద్వారా సైతం సాధించ గలిగింది ఏమీ లేదని, సత్యాదర్శము, శాంతియుతమునైన మార్గమే శరణ్యమని తలచి, కడసారి అతని క్షమాపణను పొంది, అతడి విముక్తికి తోడ్పడిన గాని కొంత ఆత్మశాంతినైన పొందటం దుర్లభమనే నిర్ణయానికి వస్తుంది.]

[గుహలో శామసన్‌తో డెలీలా]

డెలీ : (దుఃఖం) శామ్, నాజీవం...

శామ్ : డెలీలా ! ఫిలిస్టయిన్ రాణి !

డెలీ : కాదు... నీ దాసిని... పరాజితను...

శామ్ : గతం స్వప్నం - డెలీలా ! ఇంకా ఈ శామ్‌సన్ నిర్జీవుడై నువ్వు విధించే ఏ శిక్షకైనను మొక్కవోని ఆత్మవిశ్వాసంతో, ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నాడు.

డెలీ : నీమాటలతో అనుక్షణం నన్ను హత్య చేయకు ... నీ ప్రేమను మరలించుకోలేక ప్రతీకారం ద్వారా సాధించుదామనుకున్నాను - శామూ... నీ విశాల హృదయం ఈ కళంకురాలిని సైతం తనలో ఇముడ్చుకోగలదనే ఆశతో జీవిస్తున్నాను.

శామ్ : ఆ విశ్వాసం వున్న అందరికి ఈ హృదయంలో స్థానం ఉంది.

డెలీ : ప్రభూ - ధన్యురాలు - ఇంక నేను నిర్విచారంగా మరణిస్తాను - అంతకుముందు ఒక్క రహస్యం వెల్లడించి నా జీవన రాగానికి తుది ఆలాపన పలుకుతాను - నువ్వు శక్తివంతుడివైనావని తెలిసి, ఫిలిస యిులు బహిరంగ రాజ సభలో నిన్ను హింసించి తుద ముట్టిద్దామని యోచిస్తున్నారు. ఇద్దరం ఈ లోపల తప్పించుకు పోదాం.

శామ్ : కాదు - పరారి నవ్వడం - పిరికి లక్షణం! వీర పోరాటంలో విజయమో - వీర స్వర్గమో!

డెలీ : శామ్ - నేనూ నీతోనే.

# 12

[గజా పట్టణంలో ఆలయం రాజసభ]

[రాజు సిరన్, డెలీలాలు సభ తీర్చి వుండగా]

సిరన్ : బందీని ప్రవేశపెట్టు.

[ఫిలిస్టయిన్‌ల కోలాహలం]

[ఆగమనం సూచిస్తూన్న శామ్సన్ అడుగుల చప్పుడు]

భటుడు : సైనిక పాలక ప్రభువు నివేదిక.

ఆర్థరు : మహాప్రభూ - రాజశాసనం చదవమని శెలవా?

సిరన్ : అవశ్యం - (కోలాహలం)

ఆర్డర్ : శత్రువులైన సైనికులకి నాయకత్వం వహించి దోపిడీ హింసాకాండను, పురికొల్పుతూ, పాల్గొంటూ, రాజ్యంలో అశాంతి జ్వాలల్ని రేకెత్తించటమేగాక, సైనికులతో యుద్ధానికి తలపడిన రాజద్రోహనేరానికి శామసన్‌కిమరణశిక్షవిధించడమయింది-(కోలాహలం) ప్రజల వినోదార్థం బహిరంగ సభలో అతడిని హింసించడంద్వారా మరణశిక్ష అమలు జరుపబడుతుంది. ఎవరక్కడ - సింహబలుడు జాకబ్‌ని కొరడాతో ప్రవేశపెట్టు.

[ఆనందంతో కోలాహలం]

"అబ్బ! అబ్బ!" అన్న కేకలు!

"ప్రభూ! - ఒక్క మనవి" అన్న స్త్రీ కంఠం!

సిరన్ : ఆ వనితను ప్రవేశపెట్టు.

మిరియా: (మోకరిల్లుతూ) ప్రభు! - నా శామసన్ కిదివరకే శిక్ష విధించారు. ఇంక ఈ మరణశిక్ష ఎందుకు? - దృష్టిలేనివాడు మరణం పొందినట్టే! -

సిరన్ : శత్రు క్షయం అయి తీరాలి. ఒకవేళ నికరించ దలచినా, డెలీలా రాణి మాత్రమే దాని కర్త్రురాలు. తన నైపుణ్యం ద్వారా సాధించిన ఆమెకే అతడు బందీగాని మారుగాడు.

మిరియా: మహారాణి - నా జీవితాన్ని అర్పిస్తాను - నన్ను హింసించి చంపు - నా శామూని రక్షించు-

డెలీ : అతడు జీవించి నీతో వుండటమా! - ఆ ఒక్క ఆశయమే నా జీవితంలో యివ్వగలిగి ఉంటే, తండ్రిని, సోదరిని పోగొట్టుకొని యుండను. నా జీవితాన్ని అతని జీవితాన్ని - ఆవేదనా భరితం చేసుకొని ఉండను... ఇప్పటికి నా బలహీనతవల్ల సర్వస్వాన్ని పోగొట్టుకోడానికి సిద్ధంగా వున్నాను. అసహాయను - నీ అర్థింపు అనర్థకము.

మిరియా: ఇంతేనా!....స్త్రీవికావా? - మానవ సహజప్రేమ సైతం కోల్పోయావా? - రాణి

డెలీ : ఈమెను ఇక్కడనుంచి తొలగించండి.

[అబ్బ - అబ్బ - దెబ్బల మూల్గు]

జాకబ్ : ఆగు...శిక్ష విధించాల్సింది... నేను.... నా బందీ కదా అతను!

[కోలాహాలం]

డెలీ : (శామ్సన్‌ని సమీపించి మెల్లగా) శామ్సన్ - వచ్చాను- శిక్ష పొందటానికి వచ్చాను.

శామ్ : డెలీలా, ఇదుగో బహిర్గతం చేస్తున్నాను. నా హృదయాంతరాళంలో నువ్వు జీవించి వున్నావు ప్రచ్ఛన్నంగా... తెలుసుకొన్నాను ఇప్పుడే—కాని కాలాతీతమయింది. కర్మ మానవాళికి ప్రసాదించే మాయ నాటకం ఇదే !-

డెలీ : శామసన్ ... ఈ తుది క్షణంలో – ఈ రాజ్యాన్ని అరచేతితో తిప్ప ఫిలిస్టయిన్ రాణి, తన బందీ ఆదేశానికి నిలిచివుంది ... నివేదించు.

శామ్: నాకు మరణం తప్పదు. చరిత్రలో శామసన్‌గాధ... వీరగాధ కావాలి – ఈ నా మహా బలశక్తితో ఫిలిస్టయిన్‌లపై పగదీర్చుకొంటూ మరణశయ్య నలంకరిస్తాను. ఈ ఆలయం నిలిచివున్న – ఆ రెండు స్తంభాల దగ్గరికి నన్ను చేర్చు– నా ప్రచండ శక్తితో ఈ ఆలయాన్ని కూల్చి, అమానుషులైన ఫిలిస్టయిన్ లకి సమాధుల్ని నిర్మిస్తాను.

[కోలాహలం – డెలీలా రాణికి జై]

డెలీ : మెల్లగా నాతో మెట్లు ఎక్కు – ఈ తాడు చివర పట్టుకో.

శామ్: ఆ – ఇవా – స్థంభాలు ! డెలీలా, ఒక్క నిముషంలో సర్వనాశనం కాబోతుంది. ఒక్క కోరిక ... నువ్వు తప్పించుకుపో .... ఈ క్రూర మరణం .... నీవంటి లలితాంగికి తగదు.

డెలీ : ప్రభు ! జీవితానికి అర్థం లేదూ....ఉపక్రమించండి.

శామ్: దేవా .... ఏ ఆదర్శంకోసం నన్ను శక్తివంతుడిని చేశావో .... ఆ ఆశయం నెరవేర్చటానికి మహా శక్తి నన్ను ఆవేశించుగాక.

సభికులు: ఎంత పిచ్చివాడు ! స్తంభాల్ని కదిలించాలని ప్రయత్నిస్తున్నాడు .... అంధత్వం .... ఉన్మాదాన్ని సైతం ఆపాదిస్తుందా కాబోలు.

[నవ్వుతో గూడిన వేళాకోళం:]

[స్తంభాలు విరిగిన చప్పుడు]

"ప్రళయం"

"ఘోరం!...."

"అమ్మో !" "ఇంకేముంది"

"సర్వనాశనం...." (అసహాయంగా కేకలు)

శామ్: ప్రభు ! కూలిపోతున్నాను .... నీ జగన్నాటకంలో ఒక విచిత్ర విశిష్ట, నిగూఢ పాత్రధారినై .... బలియై పోతూ...

(ఆలయ గంటలు)

—*—

# కాసిబియాంకా



పాత్రలు :

కాసిబియాంకా

కాసిబియాంకా తండ్రి

రాజు

పతీహారి, ఇతరులు

# కాసిబియాంకా

## ప్రథమరంగం:

[ఒక పాశ్చాత్య దేశపు పట్టణంలో ఒక సౌధం - గదిలో జ్వరపీడితుడైన కాసిబియాంకా]

కాసి : అబ్బా... తీవ్రమైన ...తలనొప్పి—(మూలుగు)

పరిచారకుడు : బాబూ—స్థిమితపడు—వైద్యుడు నిమిషాల్లో వస్తారు. ఉపశమనంకోసం మంచి మందు, నెప్పితగ్గేది, యిస్తారు.

కాసి : తపన....ఏం తోచటంలేదు నాన్నగారెప్పుడు వస్తారో!

పరి : ఏదో అవసర రాచకార్యంమీద రాజుగారితో సమాలోచిస్తున్నారు. లేకపోతే ఒక్క నిమిషం నిన్నువదిలి వెడతారా బాబూ! ( చప్పుడు ) ఆc.... ఎవరూ? వైద్యులు వచ్చారు. అయ్యా చిన్నబాబు ఏదో శిరోవేదనతో బాధపడుతున్నారు. ప్రక్కకి ఒత్తిగిలు బాబు.... ఏదో పట్టీ వేస్తారట

కాసి : ఆc.... కాస్త హాయిగావుంది. కాసిని మంచినీళ్ళు యివ్వు. (కన్నులు మూసి, పక్కకి ఒత్తిగిలుతాడు) నాన్నగారు రాంగానే లేపు నిద్రపోతున్నా నని మాట్లాడకుండా వెడతారేమో—

పరి : అలాగే — దొరా —

[వాకిట్లో]

పరి : అయ్యా — ఎలా వుంది? —

వైద్యుడు : బాగా స్థిమితపడ్డాడుగాని — ఏదో బెంగ అబ్బాయిని పట్టుకుందయ్యా —

పరి : అవును — అమ్మగారు హఠాత్తుగా గుండె జబ్బుతో పోయారు. ఇలా బెంగపడి, చిక్కిపోయి — జబ్బ పడ్డారు — కాస్త తండ్రి దగ్గరుంటే నయం — ఆయన చెబితే చాలు ఏదన్నా వింటాడు! అందుకే పెద బాబు ఒక్క క్షణం విడిచి వుండటంలేదు.

వైద్యు: ఇది మనస్సుతో పని .... చాల జాగ్రత్త .... పిల్ల వాని అభిరుచి భంగం కాకుండా గమనిస్తుండాలి .... వస్తా.... రేపటిలోగా ఏదన్నా హడావుడిచేస్తే వెంటనే కబురంపు .... (వెడతాడు)

కాసి : అయ్యో .... నిద్రపట్టిందే?....ఇంకా నాన్న రాలేదూ?

పరి : అదుగో .... మాటల్లోనే వచ్చారు పెదబాబులు. దొరా .... ఎప్పుడూ మీగురించే కద?

తండ్రి: నిన్ను విడిచి ఎలా వుంటాను....నాయనా....నీకు కులాసా చిక్కగానే ఎక్కడికైనా నాతో తీసు కెళ్ళతాను ....

కాసి : రాజుగారితో మాట్లాడేటప్పుడు తీసుకెడతావా!

కా.త: (నవ్వి) రాజుగారుకాదు యుద్ధభూమైనా సరే — నేను చెప్పినట్లుచేస్తే నీ కే అపకారం జరగదు —

కాసి : (విముక్తుడైనట్లు) హాఁ — ఏదో బరువుదించినట్లుంది నాన్నా — కాని — ఎప్పుడూ పనులంటూ తిరుగు తావు – మాటలు చెప్పి మభ్యపెడతావు.... ఈసారి – (లోపల) రాజుగారి అంతరంగిక వార్తాహారుడు.

కా.త: వెంటనే - ప్రవేశపెట్టు.

వార్తాహరుడు: ఆనతి ప్రభు ! ఏదో ముఖ్య కార్యం సమాలోచించడానికి - వెంటనే బయలుదేరి రమ్మని- రాజుల ఆజ్ఞ.

కా. త: అవశ్యం - ఇప్పుడే వస్తా - విశ్రమించు.

కాసి : ఈసారి – నేను లేచి తిరిగాక-నిన్ను అసలు వదలనే వదలను – ఏం నాన్నా – పో పో.

*  *  *

## ద్వితీయ రంగం

[రాజు కొలువు]

రాజు : పరదేశీయులు - దండెత్తే ప్రయత్నంలో వున్నారని తెలుస్తోంది. మన స్వాతంత్ర్యాన్ని హరించే ఆ దోపిడులను దేశం యావత్తు ప్రాణం వున్నదాకా ప్రతిఘటించాలి.

[తెరలో కోలాహలం]

గూఢచారుల వర్తమానం ప్రకారం, రాబోయే

ప్రమాదాన్ని అందరూ గుర్తించి అప్రమత్తతలో వుండగలందులకు హెచ్చరిస్తున్నాను.

సేవకుడు : గూఢచారుల అనుయాయులు వేగంగా గుఱ్ఱాలను పరుగెత్తిస్తున్నారు. కోట పరిశీలకుని వార్త.

రాజు : వెంటనే ... [ప్రవేశించిన పాదధ్వని]

గూఢచారి: జయము ప్రభు ! శత్రువులు నౌకలని ఆయత్తం చేసి మూడు దిక్కులనుంచి మన తీరాన్ని ఎదుర్కొం టున్నారు పరిశీలక నౌకల్ని అటకాయించారు. తప్పించుకు బయటపడిన నావికుని అలమటింపు ప్రకారం క్షణాలమీద శత్రువులు దేశంపై పడ బోతున్నారని మనవి.

[కోలాహలం]

రాజు : సభికులారా - వ్యవధి లేదు - ఆయత్తం కండి-ప్రధాని- ప్రమాదం చాటించు - యుద్ధ నౌకల్ని సిద్ధం చెయ్యి- సేనానులారా ఇదే నా ఆజ్ఞ. తీరాన్ని కీలక ప్రాంతా లలో బలీయంగా సైన్యంతో కట్టుదిట్టం చేయండి - యుద్ధ నౌకలలో నౌకా యుద్ధ ప్రవీణులైన నిపుణులను పరాక్రమవంతులను సమీక్షించి శత్రు నౌకల్ని దోవలో ఎదుర్కొనండి.

(తెరలో)

[దేశరక్షణకి సిద్ధంకండి "మహారాజుకు జై ! విజయం మనదే" అనే యుద్ధ నాదాలు కోలాహలం]

[తృ తీ య రం గం]

[సౌధంలో కాసిబియాంకా]

కాసి : దేశాన్ని రక్షించడానికి నేను సిద్ధమే. నాకిప్పుడు ఏ మగతా, బాధలేదు నేనూ....

ప్రతీహారి : వద్దు.... బాబూ, సుస్తీ....

కాసి : ఆగను. నాన్నా వచ్చావా? ఇంక వదలను నాన్నా! ఇదుగో నేనూ యుద్ధానికి ఆయుధాల్ని ధరించాను.

కా.త: పరీక్ష !- ఎలా విడిచి వెళ్ళను ? తల్లి లేనివాడిని !- ఆ సంకుల సమరంలోకి ఎలా అసహాయుని తీసుకుపోను! (బాధతో) ఆహా... ఇటు పుత్రవియోగం ! అటు.... భీషణ సంకుల సమర మరణ భయం ! (నిట్టూర్పు)

కాసి : ఇంకా ఆలోచనేనా ? నాన్నా ...

కా.త: కాని... కాసి ... యుద్ధంలో పాల్గొనలేనిదుర్బలు డైన అరక్షితుడివి - బాలుడవు -

కాసి : నాన్నా !

కా.త: కాసి....నా....తండ్రీ (ఆలోచనతో) కాని నేనుంచిన సురక్షిత స్థానంనుంచి కదలకు ఏ ఆవేశము నిన్ను ఆవహించినా నిశ్చలుడవై వుండు. రాజుగారి ప్రత్యేక అనుమతి పొంది. నౌకలోకి ప్రవేశిద్దాం - రా— బయలుదేరు ఏమంటారో! ఏమవుతుందో అయినా! విధి !

చ తు ర్థ రం గం :

[సముద్రంలో నౌకా యుద్ధ రంగం - యుద్ధ కోలాహలం - ఫిరంగుల ధ్వని]

కా. త: మెల్లిగా పాకిపో. ఆ తాడు పట్టుకొని, ఆ చిన్న గది లోకి దూకు. ఫిరంగుల శబ్దం. ఆ ఘోరాలు చూడ లేవు. ద్వారాలు బంధించు. ఆమూల ఒదిగి కప్పుకొని కూర్చో.

కాసి : ఎన్ని అగ్ని గోళాలు మన నౌకల మీదికి!

కా. త: ఆ శత్రు నౌకని తప్పించుకొని పక్కవాటుగా ఎదుర్కోవాలి. అప్పుడుగాని మన నౌకలు అగ్ని వర్షంనుంచి బయటపడవు. తెరిపి చిక్కిందా ఉమ్మడిగా శత్రు నౌకని ముట్టడిస్తాం. చెప్పింది కదలకు నేవచ్చేదాకా. వస్తా కాసి - ఏం? ఎవరక్కడ? అటు దిక్కుగా నౌకని వేగంగా తిప్పు- ఫిరంగుల్ని ఈ దిక్కుగా పేల్చండి.

కాసి : పరే నాన్నా-నాకు తెలిసిం దల్లా పితృవాక్య పరిపాలనే ఇప్పటికి - ఎప్పటికైనా ... (ధ్వనులు - సందడి - సైనికుల కోలాహలం)

ఒకరు: "అయ్యో నౌకకి పెద్ద గండిపడింది. ..."

మరొకరు: పక్కవాటుగా మన నౌక ఎదుర్కొనబోగా పొంచి వున్న శత్రు నౌక వెనుకవాటుగా దెబ్బతీసింది.

[ఫిరంగి ధనుష్వాలు]

ఘోరం - మంటలు.

కాసి : నాన్నా. ఎక్కడున్నావ్ ?-

ఒకరు: ఓడ తెరఅంటుకుంది. మంట పాకిపోతోంది జ్వాలలు కమ్ముకుంటున్నాయ్. (ఒక సైనిక ఆజ్ఞ,) నౌకని తక్షణం విసర్జించండి.

కాసి : నాన్నా ... మంటలు గదిని ఆవరిస్తున్నాయ్ - నేనూ బయటికి రానా, నాన్నా ?

[యుద్ధ కోలాహలం]

కాసి : నాన్నా, గదినిండా పొగ ఆవరించింది - బయటికి రానా తండ్రీ-చెప్పు... చెప్పవేం-మరచిపోయావా?-

దూరనుంచి కేకలు : కాసిబియాంకా - బయటికి వచ్చేయ్ - ఆలస్యం చేయక దూకు - కాసిబియాంకా, ఇంకా నీ ఆలస్యం?

కాసి : ఆ తండ్రి వెళ్ళిపొమ్మని చెప్పడేం? అంకరూ ఘోషిస్తున్నా - నువ్వు చెప్పవా నాన్నా ? - నేను రావడం ఇష్టంలేదా! ఎక్కడున్నావు ?-

జనం కేకలు : అయ్యో ... అగ్నిజ్వాలలకి ఆహుతైనాడు - నౌకా వీరుని కొడుకు, - ఆచిన్న కాసి బియాంకా. అయ్యో!

కాసి : నాన్నా - జ్వాలలు చుట్టుముట్టాయ్-ఎట పోవడానికి దోవలేదు. అయినా నాన్న కదలవద్దన్నాడు, తను

చెప్పంది ! - మంటలు ఆవరించాయ్ - జ్వాలనై పోతున్నాను - కాని, తండ్రీ? చూశావా? నమ్ము - నిజం, ఇప్పటికీ నీకాసిబియాంకా కదలలేదు- నువ్వు ఆదేశించిన చోటునుంచి-

[ఉరుములు - మెరుపులు]

—*—

# శిథిల శిల్పం

## పాత్రలు:

వెనీసు రాజు

| | | |
|---|---|---|
| ఓథెల్లో | - | వెనీసు సేనాని |
| బ్రాబిన్‌టో | - | వెనీసు పుర ప్రముఖుడు |
| లాడ్‌విగో | - | బ్రాబిన్‌టో సోదరుడు |
| మాంటనో | - | వెనీస్ సర్వసేనాని |
| కాసియో | - | ఓథెల్లో అనుచరుడు |
| ఇయాగో, రోడిగిగో | } | ఇద్దరు మిత్రులు |
| డెస్టిమోనా | - | బ్రాబిన్‌టో కూతురు |
| ఎమిలియా | - | డెస్టిమోనా సఖి |

చారుడు, ఇతరులు

# శిధిలశిల్పం

## ప్రథమరంగం

### (మొదటి దృశ్యం)

[వెనీసు పట్టణంలో ఒక వీధి. రోడిరిగో, ఇయాగోల ప్రవేశం]

రోడి : ఇయాగో, ఈ హృదయ ఆరాటానికి ఉపశాంతి ఉందా అని ! (విషాదంగా) నిద్రాహారాలుమాని అలమటిస్తున్నానయ్యా ! ఎంతో ఆలోచించాను - ఈ సమస్యకి ఒక పరిష్కార మార్గముందా అని ! - అబ్బే - ఏం తోచందేం ?-

ఇయా: పిచ్చివాడా! సమస్యని చెప్పే ఒకటి వుండాలెగాని, పరిష్కార మార్గానికే కొదవా ? - (వెకిలిగా నవ్వి) అందుట్లో నీ సమస్యనాకు పరాయిదా ? రోడిరిగో - ఈ ఇయాగో ముందు అసమర్థుడిలా అలమటించకు

రోడి : ధన్యుణ్ణి, ఇయాగో-అందుకే నువ్వు తప్ప నాకు గతి లేదనే నిర్ణయానికి వచ్చాను. ఈ అందాలకుప్ప (ఆవేశంగా) డెస్టిమోనా నన్ను పరవశుణ్ణిచేసి పీడించని క్షణం లేదంటే నమ్ము !- ఈ భయంకర విరహాగ్ని జ్వాలలకి ఈ తప్త హృదయుడు ఆహుతి కావాల్సిందేనా ! -

ఇయా: డెస్టిమోనా ఆలింగనావకాశాన్ని ఎదురుగా చూస్తూనే

రోడి : ఎన్నో విధాలుగా నా ప్రణయ సందేశాన్ని ఆమెకు అవగాహన చేయజూచాను. ఎన్నో బహుమానాలు వజ్రాలు, వైఢూర్యాలు ఒకటేమిటి-ఉం చూశావా?- వాటివంకైనా చూడ లేదట !

ఇయా: వూరికే బహుమానాలు ఇచ్చినంత మాత్రాన స్త్రీలు ఛెంగున మెడ వాటేసు కుంటారనుకున్నావా ? - సమయాసమయాలు - ఇంగిత జ్ఞానం.

రో : నీ ఆలోచన !-

ఇ : అవి ఇవ్వవలసిన విధం వేరు! -

రో : చెప్పు - ఇయాగో - అంతకంటేనా !

ఇ : ఆ డెస్టెమొనాకు దాపు గురుతుల్యుణ్ణి అంటే నమ్ము! - (వికాసంగా) సాయం సమయాల్లో, ప్రకృతి రామణీయకతలో, తోటలో మైమరచి ఆమె గానం చేసే సమయంలో, సందర్భోచితంగా, ఈ ఇయాగో ఆమెను సమీపించి, మాటల్లో నీ ప్రసక్తి తెచ్చి అఖండంగా వర్ణిస్తూ, పొగడుతూ-అర్థం అయిందా?

రో : అమోఘం - ఒక ప్రజ్ఞాశాలివిగా గోచరిస్తున్నావు? -

ఇ : ఇంకో విషయం. డెస్టెమోనా, మూరు జాతివారు (కర్కశంగా) నల్లటివాడు, అనాగరికుడు ఐన ఒథెల్లోను గాఢంగా ప్రేమిస్తున్నట్లు వినికిడి! - ఇది మన జాతి ప్రతిష్టకు అవమానకరం - కళంకం! ఆమె తండ్రి

పడే బాధ ఇంతింతకాదు. (రహస్యంగా) ఈ అవ
కాశం వినియోగించుకోవాలి :-

రో : (ఆంత్రంగా) ఎలాగో చెప్పు !-

ఇ : ఏమీలేదు - ఏదో పనిమీద ఆయన్ని త్వరగా కలుసుకొని పురి ఎక్కించాలి!-

రో : బాగుంది-ద్విషిధంగా ఎదురొక్కవడం!-పంట పండింది!

ఇ : ఆలస్యం అమృతం, విషం !- (ఆగి) ఆ వజ్రాలహారం యిచ్చావుకావు! ఈ సాయంత్రం తెచ్చేస్తాను డెస్డిమోనా మృదు హస్తాలు నీ కంఠసీమలో విహారం చేసే సమయం ఆసన్నమైంది. రోడిరిగో-ధన్యుడివి !

రోడి : ఆహా... ఇదుగో... తీసుకో. నీ మేలు మరవలేను. వెళ్ళొస్తా....

*　　　*　　　*

## రెండవ దృశ్యం :

[వెనీసులో బ్రాబిన్‌టో భవనం]

బ్రా : ఇలా అనుకోకుండా ప్రళయం ముంచుకొస్తుందని కలగన్నానా ? నాకూ, జాతికి ఎంత అప్రతిష్ఠ ? లోకం కోడై కోటివిధాలుగా కూస్తుంటే ఏం చచ్చేది ? ఇందంతా కలకాకూడదా అని దైవాన్ని వేయివిధాల ప్రార్థించాను. కాని నిజం కలగా ఎలా మారడం! రక్తసంబంధం....!

చా : అయ్యా.... ఇద్దరు పెద్దమనుష్యులు.

బా : రమ్మను.

ఇయాగో } నమస్కారాలు.
రోడిరిగో }

బా : కూర్చోండి. విశేషాలు ?

ఇ : ఇలా పనిగట్టుకొని మీదగ్గరికి రావాల్సి వచ్చినందుకు క్షమించండి.

రో : గత్యంతరం లేకుంటే సబబు.

ఇ : ఇంతకీ మీ మీద వుండే గౌరవమూ ఆపేక్షా వదల లేక—

రో : ఈ వదంతులు వినలేకపోతున్నాం. ఎనటియన్ పౌరుడు గౌరవనీయులు బాబిన్‌టో మహాశయుని కుమార్తె, అల్పవంశీయుడు....

ఇ : అ పతిష్ఠాపరుడు, అనాగరికుడు, నల్లటివాడు.

రో : అయిన ఓథెల్లోను.

బా : చాలించండి. నాకు తెలుసు, ఇది దుస్స్వప్నంగా వుంది.

ఇ : సామదాన భేదోపాయాలు ! (నవ్వి) సుంభమార్గం చూడండి.

బా : విశదీకరించు—ఇయాగో.

ఇ : మీ అమ్మాయికి నచ్చ జెప్పడం.

బా : తరువాత?

ఇ : పరువూ, మర్యాదగల రోడిరిగోలాంటి వారిని చేపట్ట మనడం-

బా : రోడిరిగో విషయం అప్రస్తుతం !

రో. (రహస్యంగా) కథ అడ్డంగా తిరగ బోతూంది! ఇదేమిటి, ఇయాగో !

ఇ : (రహస్యంగా) నువ్వూరుకోవయ్యా, పానకంలో పుడక లాగా ! వూరికే అన్నాను, గౌరవనీయులైన వరులే కరువయ్యారా ఈ మహాపట్టణంలో ?

బా : వెంటనే నివారణోపాయం శెలవియ్యండి.

రో : వాడిని చావదన్ని చెవులు మూస్తే !...

బా : అమ్మయ్యా, ఓథెల్లోనే !-మనం బ్రతికి బయటపడితే చాలు....అందుట్లో రాజుకు అత్యంత సన్నిహితుడు !

ఇ : ఏదో మంత్ర తంత్రాలతో నా కూతుర్ని మోసం చేశాడని రాజుగారికి ఫిర్యాదు చేస్తే సరి !

బా : ఇది సబబుగా వుంది-ఇంకా ఆలస్యం ఎందుకు! పోదాం పదండి !

(మూడవ దృశ్యం :)

[వెనిసు రాజ్య ఆస్థానం... వెనిసు రాజు, ఇతరులు]

సేవకు : ప్రభూ....చారుడు....

రా : విశేషాలు ?

చా : ప్రమాదం ! టర్కిష్ సేనలు "రోడ్సు" దీవిపై

దండెత్తాయని తెలిసింది. మానటనో సేనాని సేనల్ని సాయం పంపవలసిందిగా చెప్పమని సెల విచ్చారు

రా : నా మాటగా లుస్సీకో సేనానికి కబురంపి, బందో బస్తుతో వెళ్ళమనండి....

చా : లుస్సీకో సేనాని, ఫ్లోరెన్సు పట్టణంలో వున్నారట.

రా : అక్కడికి వర్తమానం పంపు - ఊఁ....

సేవకు : (ప్రవేశించి) బ్రాబిన్‌టో, ఓథెల్లో సేనాని, ఇయాగో రోడిరిగో, - మీ దర్శనార్థం....

రా : ఆహాఁ....రమ్మను.... నేత్రానందం ! ఓథెల్లో సేనాని, నీ పరాక్రమం దర్శించడానికి మహత్తర అవకాశం. టర్కిష్ ముష్కరులు మనపై హఠాత్తుగా దండె త్తారు. నీ పరాక్రమం ప్రదర్శించడానికి మహత్తరావ కాశం ! ఇంక, బ్రాబిన్‌టో, యోచనా శీలుడవైన నీ సలహా మాకు ఈసమయంలో ఎంతో అవసరమూ, ముఖ్యమూ.

బ్రా : నా మనస్సు అన్యాక్రాంతమైనది రాజా....అవ మానము !

రా : ఆఁ, అవమానమా! - తత్క్షణం వివశదీకరించు....

బ్రా : అయ్యో ! - నా కూతురు - నా కూతురు !

రా : ప్రమాదం సంభవించలేదు కదా !

భా : అది జరుగుతే విచారమే లేదు! కాని....ఆమె ఘోరంగా వంచింపబడి, నవ్వులపాలు కాబోతుంది.

రా : నవ్వుల పాలా?- దానికి కారణ భూతుడు శిక్షార్హుడే? ఎవడైనా సరే - (కఠినంగా) ధర్మాచరణ ఎంత విషాదమైనా ఆ మాట జరుపక తీరదు!

భా : విధేయుణ్ణి - ప్రభూ! మీ అఖండ ధర్మ నిరతికి జోహార్లు- కారకుడు మీ అభిమాని ఓథెల్లో సేనాని!

అందరూ:- ఆఁ ఓథెల్లో సేనానా ? - (ఒక్కసారి).

రా : సేనాని - ఈ అపవాదు!

ఓ : మహారాజా, గౌరవ నీయులైన సభికులారా! సత్యా దర్శము, పవిత్రము, విశ్వాసనీయము అని నమ్మిన నా ప్రేమకీ దాపరికం ఎందుకు?- అది ధర్మ విరుద్ధమైన ఈనాడు, ఓథెల్లో తన ప్రేమ కవచంతో లోకాన్ని ఎదుర్కొంటాడు - నిష్కళంక హృదయమే అతడి ఆయుధం - దానికి పరాజయం లేదు. ఇంతెందుకు? చిరకాలంగా డెస్డిమోనా నా హృదయమై పోయింది. ఆమెను మోసగించింది నా కన్నా శ్వవచ్చు - నిజంగా మోసమే అయితే ఒక నాడన్నా ఆమెకు తెలిసి రాదా?

భా : తన్ను చూసి తానే సిగ్గుపడే యౌవనం. స్త్రీ సహజమైన భీతి - ఎవరినైనా చూసి సైతం భయం చెందగలదో - అలాంటి వాడినా ఆమె మోహించడం - అసంభవం కాదా.

రా : ఓథెల్లో- నీ సంజాయిషీ ?

ఓ : ఎవర్ని గురించి వివాదపడుతున్నారో ఆమె సంజాయిషీయే.

రా : వితర్కా లెందుకు? - డెస్డిమోనాకు కబురు చెయ్యండి - ఇయాగో -వెళ్ళిరా? నీ ప్రణయగాథ ఎలా ఉత్పన్నమైందో చెప్పు.

ఓథ : ప్రభూ - పది సంవత్సరాలనాటి మాట - యవ్వనపు తొలి రోజుల్లో ఉడికి పోయే రక్తం! బ్రాబిన్‌టో! జ్ఞాపకం వుం ? ఎన్నోసార్లు వారింటికి ఆహ్వానితుడనై మిత్రు గా వెళ్ళేవాడిని - ఆ విందు రోజుల్లో నా యుద్ధ గాథలు వినిపించని రాత్రి లేదు? - పిచ్చి పిల్ల! డెస్డిమోనా ఎంతో ఆత్రంగా వినేది! ఆ అమాయిక కళ్ళలో నాలోని వీరుణ్ణి చూసుకున్నాను. తనకి నేనే దిక్కు అనేది ఆక్షణంలో - ఆమె ఆగాథలకి భయపడి, వారిస్తుంటే చెప్పవద్దని నే వూరుకోక చెప్పుకుపోతుంటే భయంతో బెదిరే ఆ చూపులు-అదిగో డెస్డిమోనా!

రాజు: అంత ప్రేమించిందా!- నాకే కూతురువుంటే అడ్డు చెప్పేవాణ్ణికాదు—డెస్డిమోనా.

డె : (ప్రవేశించి) ఆర్యా! ప్రణామాలు.

బ్రా : ప్రభు! ఏ నిర్ణయమైనా నా కుమార్తె అభిమతంపై ఆధారపడుతుంది!

రా : నీ ప్రణయ చరిత్ర విచారణ చేయడం అనుచితమైనా అనివార్యం - నీ తండ్రి ఆరోపణకి నీ జవాబు!

డె : ప్రభు! తండ్రీ, ఇక్కడ నా బాధ్యత ద్విగుణీకృతం. నా జీవన సౌభాగ్య కారకుడైన తండ్రి - మనసార వలచిన ప్రియుడు - నాకు ఉభయత్రా గౌరవముంది. నేను సత్యమని నమ్మినదానిని ఆచరించవల్సివస్తే సేనానిని నా భర్తగా పొందితీరాలి. నేనూ గౌరవించే తండ్రి దాన్ని ఆశీర్వదించాలి.

బ్రా : బాలా, నీ నిర్భయత్వం సత్యానికి నిదర్శనం. (సంతోషంగా) వివాహం చేసుకొని సుఖించు.

రా : శుభాంతం—సేనాని, ఈ విజయగర్వంతో దేశగర్వాన్ని ఇనుమడింపచెయ్యి.

సభికులు: ఓథెల్లో సేనానికి జై —

ఓ : ప్రభు! దేహమా గౌరవాంజలి. ఇయాగో, డెస్డిమోనాను ఆధీనంలో ఉంచుతున్నాను. సద్గుణవంతురాలైన ఎమిలియా తోడుగా ఆమెకు ఏలోటు చెయ్యకు.

ఇ : మహాభాగ్యం.

డె : ఓథెల్లో, నా జీవన భాగ్య విధాతా!

ఓ : రాణీ ఒక ముహూర్తకాలం విశ్రమిద్దాం!

[ఓథెల్లో, డెస్డిమోనా, నిష్క్రమణ-సభ సమాప్తి]

ఇ : రొడిరిగో!

రో : హూ! ఇయాగో.

ఇ : పవిత్ర హృదయమా? నీ తలంపు—

రో : ఏమయివుండగలదని!

ఇ : ఏం చేస్తా—సుఖంగా నిద్రపోరాదూ ఇక నుంచైనా?

రో : ఇంక ఒకటే నిద్ర!

ఇ : ఇదా కార్యసాధకుడి నిర్ణయం!

రో : సుఖించడం దుఃఖభూయిష్ఠం అయిననాడు మరణించడం సుఖంకాదూ?

ఇ : ఆడలేక మద్దెలమీద బడ్డట్టు!

రో : వాడిన పుష్పాకు ఎలా పరిమళం రావడం!

ఇ : "ధనమూలం ఇదంజగత్" అనిపించుల్నా- ఇది నీ ఒకడి సమస్యకాదు ప్రతీకారం నా బ్రతుకు. ఈక్షణం నుంచి ఓథెల్లో పక్కలో బల్లెంగా నిలుస్తాను.

రో : (ఆశతో) మళ్ళీ ఆశల్ని రేకెత్తిస్తున్నావు!

ఇ : ఓథెల్లో! నాకు కారణరహితుడైన శత్రువు. నా పన్నాగ వివరాలు క్రమక్రమంగా చెబుతాను పని వుంది, వెడతాను.

రో : ఈ ఎత్తుల్లో నీకు నువ్వే సాటి, ఇయాగో మిత్రమా!

—*—

## ద్వితీయ రంగం

(మొదటి దృశ్యం)

[సైప్రసు నదీతీరంలో ఒక రేవు - అలజడి]

అలజడిని ఉప్పెనగా ముంచే విజయఘోషలు....

"అఖండ విజయం!"

"మహావీరుడు ఓథెల్లో!"

"అదుగో – దూరాన - మన ఓడ!"

ఫిరంగి మ్రోతలు—

[ప్రవేశం ఓథెల్లో, డెసిమ్టోనా, కాసియో]

డె: ఆర్యా – జోహార్లు.

కా: అయ్యా—ఎన్నాళ్ళకి మీ రాక!

ఓ: విజయానందాని కంటె మీరిచ్చిన స్వాగతం. ప్రమా దాన్ని ఇనుమడింప జేస్తూంది.

(నిష్క్రమణ అందరూ)

[ప్రవేశం రొడిరిగో, ఇయాగో]

ఇ: నీ గొట్టు నేతిలో పడింది, రొడిరిగో.

రొ: నగలూ అవీ యిచ్చావా! ఏమందేం?

ఇ: ఆఁ ఇచ్చాగాని, అబ్బో. చాల పొగిడింది. (బాహాటంగా) ఇటుచూడు, ఇంకో ప్రమాదం వచ్చేట్టుంది. ఎట్టగా, బుట్టగా వుండే కాసియో గాడిపై కన్ను వేసిందయ్యా, మధ్యని!

రొ: ఆ వెధవనే! ఆహాఁ—ఏం చెయ్యను?

ఇ : ఈ రాత్రికి గొప్ప ఎత్తువేశాను—పాచిక పారిందా: మన విజయానికి నాంది—ఏం లేదూ! ఆకాసియో తాగి తందనాలాడుతూ వస్తుంటాడు-కాస్త రేపెట్టు, తల ఎత్తాడా చిదక గొట్టుదాం!

రో : నన్ను విరగ కుమ్మితే.

ఇ : శుభం పలకరా అంటే—! (నవ్వి) నేను లేనూ— నీ మీద ఈగ వాలనిస్తానా అని!

[దూరాన ఒక ప్రకటన: ఈ నాడు మన వెనీసు రాజ్యానికి కలిగిన జయానికి, మన సేనాని వివాహ శుభానికి ప్రజలంతా వేడుకలు, విందులు జరుపుకోవాలని రాజాజ్ఞ]

(రెండవ దృశ్యం)

[కోటలో ఒక గదిలో, కాసియో, ఇయాగో]

కా : ఇయాగో, స్వాగతం.

ఇ : పది గంటలన్నా కాందే ఈ కాపలా సంరంభం ఏమిటి? సేనానికేం? ప్రణయోన్మాది!

కా : ఆ సౌందర్యరాసి డిస్డెమోనా కాలాన్ని అరికట్టే మహత్తర శక్తి!

ఇ : ఆ కళ్ళ కాంతో! ఒక సమ్మోహనాస్త్రం?

కా : పరిపూర్ణత్వం వహించిన శిల్పం!

ఇ : కాసియో.... కాస్త సురాపానం- ఈ ఆనంద సమయంలో.

కా : స్వస్థతగా లేదు—క్షమించు.

ఇ : నీ ప్రత్యేకత ఉత్సాహాకరం కాదూ.

కా. శ్రమ అని అంతే—కాని.

ఇ : సమయం మళ్ళా వస్తుందా? - ప్రభువు ప్రకటన విన్నావు కద! కాసియో – నీ వంటి ఆప్తమిత్రుని కి యివ్వకుండా నేను మాత్రం పుచ్చుకోలేను.

[త్రాగిన చప్పుడు]

కా : ఇంకా స్త—భేష్—మజాగావుంది—

ఇ : అంతకంటేనా?

(ఆడుతూ) క్లిక్ .... క్లాక్ ... క్లిక్
సైనికుడూ ఒక మనిషే నోయ్
జీవితమే ఒక కల అయితే
తాగట మొకళ జౌనోయ్
క్లిక్ ... క్లాక్ ... క్లిక్

తాగు... కాసియో... మనసేనాని ఆరోగ్యం కోసం.

కాసి : కాలాతీత మైంది... నీ ఆదరణకి కృతజ్ఞుణ్ణి.... (వెడతాను)

[సర్వసేనాని మానటనో ప్రవేశం]

మా : ఎవరక్కడ? ఇయానో... అందరిని పిలు... పెద్ద గడియారాన్ని గోడకి ఎత్తాలి.

ఇ : చూశావా, అధిపతీ, తనబాధ్యత విస్మరించి కాసియో ఎలా తాగేడో?

మా : అంత బాధ్యతా రహితుడు కాడే!

ఇ : వాడికి కళ్ళు నెత్తికొచ్చాయి-కాల మహిమ!

మా : ఓథెల్లో సేనానికి తెలుస్తే మండి పడుతాడు.

ఇ : అతడిని ఒక కంట కనిపెడుతూండండి!

[ఆర్తనాదం.... రక్షించండి....రక్షించండి]

కాసి : (కోపంగా) మూర్ఖుడా - ధూర్తుడా - కత్తికి కండ దీయగలను - జాగ్రత్త!

మా : కాసియో, ఏమిటీ ప్రలాపం? ఎవరిమీద?

కాసి : ఈ సన్యాసి నాకు బాధ్యతను గురించి పాఠాలు చెప్ప డమా! నేనేం వెఱ్ఱివాణ్ణనా? బాధ్యతా రహితుణ్ణనా? చిత్తు చేస్తా వాడిని!

రో : (భయంతో) ఏదీ కొట్టు చూదాం?

కా : (దూకుతూ) ఇంకానా వాగుడు?

రో : చంపేస్తాడోయ్ - తండ్రో!

మా . ఇదంతా కాసియో, తాగుడు కళలేనా?

ఇ : (రహస్యంగా) రోడిరిగో, ఇక్కడ వుంటే మర్యాద దక్కదు - బయటికిపోయి "అరాచకం" అని కేకలు వెయ్యి - ఊఁ త్వరగా - పోఁ.

కా : ఆఁ, నన్ను తూలనాడుతున్నావా? - నువ్వెంత? నీ ధీమా ఎంత?

మా : అయితే రా (యుద్ధం ధ్వని — కత్తులమోత)

ఇ : మిత్రులారా! కాసియో, అధిపతీ, క్షమించండి. ఏమిటీ ప్రళయం. ఆగండి. ఆగండి.

[ఓథెల్లో ప్రవేశం]

ఓ : ఏమిటీ విలయం (ప్రళయంగా) మీ ప్రాణాల కోసమన్నా ఆగండి. చంపేస్తాను ఇద్దర్నీ !

ఇ : ఆగండి, వీరులారా, ప్రభువు ఆజ్ఞ. పరిజ్ఞాన హీనులారా! అవమానకరం ఇది.

ఓ : ఇయాగో, ఎలా సంభవించింది ఈ తగువు ?

ఇ : అంతా ఒక్క క్షణంలో — లేకపోతే నేను జరుగనిస్తానా ?

ఓ : కాసియో — నీ బాధ్యత ఏమిటి ? నువ్వు చేస్తున్నదేమిటి ?

కాసి : (నీరసంగా) అలసిపోయాను. తర్వాత మనవి చేసుకుంటా — క్షమించండి.

ఓ : మానటనో, పోరాటానికి అగత్యం !—

మా : సేనాని, ప్రాణాపాయమైన గాయాలు తగిలాయ్. ఇయాగో హితుడు అన్నా వివరించగలడు !— కాని, ఆశ్రిత రక్షణమే ఈ నా త్యాగ ప్రదర్శనం.

ఓ : ఆశ్రిత రక్షణమా? రక్షణాధికారి అనాలోచిత చర్య ప్రజలలో అసంతృప్తిని తీసుకురాదా, రేపు ! — దోషులు ఎవరైనా శిక్షార్హులే(కఠినంగా) ... తప్పదు!

ఇ : ఏమి చెప్పడానికి నోరు రావడంలేదు. అటు కాసియో నాకు పరమ పూజ్యుడు, ఇటు శిబిరాధిపతి ... అయినా చెప్పక తప్పుతుందా? కర్తవ్యమైనప్పుడు .... (ఆగి) ... కొన్ని నిముషాల క్రితం ఒక ఆర్తనాదం విన వచ్చింది — కాసియో చేతిలో మెరిసే కత్తితో, దృఢ నిశ్చయంతో ఒక అభాగ్యుని వెన్నాడటం చూశాం ...

ఓ : పక్షపాత వైఖరి పనికిరాదు ... ఊఁ, విశదీకరించు!

ఇ : మరి ప్రాగుడు ప్రభావమో, ఏమోమరి! ... కాసియో అడ్డువచ్చిన మోనటనో అధిపతిని సైతం లెక్క చేయక ... తూలనాడడం .... తలపడడం — (నవ్వుతూ) — మీకు ఇంక తెలియని దేముంది. (దుఃఖంగా) ప్రభూ! ఏదో కాల మహిమ — ఏమీ తలపెట్టకండి.

ఓ : కాసియో ... (కఠినంగా) నీ మతిమాలిన చర్యకి, ఉద్యోగ భ్రష్టుణి చేస్తున్నాను.

[డెస్డిమోనా ప్రవేశం]

డె : ప్రియా, ఏదో జరిగింది. చింతాక్రాంతులైనారేం!

ఓ : ఈ గొడవలు నీకెందుకూ? ... మోనటనో అధిపతీ, నీకు జరిగిన అపచారానికి నా క్షమాపణ. నేనే స్వయంగా నీ గాయాలకి ఉపచర్య జరుపుతాను. ఎవరక్కడ ... వైద్యుడికి కబురంపు. ఇయాగో ...

ఈ వార్త రహస్యంగా వుండాలి. కోట కాపలా బాధ్యత ఈ రాత్రి నీకు అప్పగిస్తున్నాను.

[డెస్టిమోనా, మానటనో, ఓథెల్లోల నిష్క్రమణ]

ఇ : కాసియో, బాగా దెబ్బలు తగిలాయా

కా : చావు దెబ్బలను ...

ఇ : దైవం కాపాడుగాక !

కా : (హాతాశుడై) దెబ్బలకై చింతలేదు ! .... ఈ నాడు ప్రాణప్రదమైన గౌరవం .... పోయింది, అయ్యో .... నా గౌరవం .... గౌరవం ! ....

ఇ : నీకు సలహా ఈ విపత్కాలంలో ఎంతో అవసరం -! విను. గౌరవం అనేది నిస్సారమైన ఒక ఊహ !-దానికి విలువ యిచ్చేది మనం కాబట్టి, మన నిర్ణయానికి అది లోబడాలి.

కా : ఓ సురాపానీయమా ! ఉత్తముడైన యజమానికి వ్యథగల్గించాను - నిష్కారణంగా పోట్లాడాను. తూలనాడాను. పానీయమా - ఓ పిశాచమా ! -

ఇ : నువ్వు ఏంచేసింది, నీకు జ్ఞాపకం ఉందా ?

కాసి : ఏమీలేదు ! మత్తు ప్రభావం.

ఇ : నీ దురదృష్టం - కాని పరిష్కార మార్గం అన్వేషిస్తున్నావా ?

కాసి : ఇయాగో - నామీద నీ కెంత అభిమానం - ఇంక నీవే దిక్కు !

ఇ : తాగటం సహజం - అయిందానికి విచారించకు. డెస్టిమోనాకు నీ హృదయం వెల్లడించి ఉద్యోగం కోసం ప్రార్థించు. ఆ కరుణామయురాలు చేయని దేముంది.

కాసి : తప్పకుండా పోతాను - శెలవు.

(కాసియో నిష్క్రమణ)

[రోడిరిగో ప్రవేశం]

ఇ : రోడిరిగో - దెబ్బకి దెయ్యం పారింది చూశావా ?

రో : కాసియో మహాఘటికుడే- మానటనో రాకపోతే -

ఇ : నీకే భయం అక్కర్లేదు - పోయి విశ్రమించు అలసి పోయావు. ఇప్పుడు జరగాల్సినవి రెండు విషయాలు - కాసియోని డెస్టిమోనా దగ్గరికి చేర్చటం! - రెండవది సేనానికి తద్వారా సందేహం జనింప చెయ్యడం! - ఓహో, యింకేముంది! - కానిదేముంది? -

(నిష్క్రమణ)

తృతీయ రంగం

[కోటలో ఒక భాగము - విషాదగానం]

కాసి : ఈ వ్యథ కలిగిస్తున్న క్షోభ విపరీతం! - ఎవరక్కడ ఆ గానాన్ని ఆపివేయమను.

చా : చిత్తం.

కా : అమ్మగారు కులాసాగా వున్నప్పుడు ఈ దాసుడు మీ దర్శనార్థం వేచియున్నాడని తెలుపు.

చా : మంచిది.

[ప్రవేశం - ఇయాగో]

కా : ఎంత ఆపత్సమయం ! -

ఇ : ఇన్నాళ్ళు కులాసా, కాసియో.

కా : ఏం కులాసా - ఇయాగో ! తెగించి, నా పక్షంగా అమ్మగారి దగ్గరికి నీ భార్య ఎమిలియాని పంపించ దలచాను.

ఇ : చాలా బాగుంది - ఆమెను ఇప్పుడు నీ దగ్గరికి పంపిస్తాను. అమ్మగారి దగ్గరినుంచి, మాటల్లో సేనాని, దూరంగా తీసుకుపోయి నీకు వీలు కలుగజేస్తాను.

కా : ఆఁహా ! ఎంత ఉదార హృదయుడివి !

[ఎమిలియా ప్రవేశం]

ఎ : శుభం కాసియో, అమ్మగారు నీ పక్షంగా గట్టిగా సేనానితో వాదిస్తున్నారు. ప్రజాభిప్రాయానికి, నిందకి సేనాని జంకుతున్నారు. అయినా సఫలం కావచ్చు.

కా : అవుననుకో - నేనే స్వయంగా అమ్మగారితో మనవి చేస్తే సానుకూల పడవచ్చని నా నమ్మకం !

ఎ : అలాఐతే నాతోరా !

* * *

[కోటలో ఒక గదిలో-ఓథెల్లో, ఇయాగో]

ఓ : ఈ జాబులు అత్యవసరంగా రాజుకు అందజేయాలి.
ఈ లోపల పనులు స్వయంగా పర్యవేక్షింపబడాలి.

ఇ : అవశ్యం - అలాగే -

(రెండవ దృశ్యం)

[కోటలో తోట - డెస్టిమోనా, కాసియో, ఎమిలియా]

డె : నువ్వు నిశ్చింతగా ఉండు కాసియో, నేనున్నాగా ?

ఎ : సఖీ - ఇయాగో కూడా ఈ విషయంలో ఆదుర్దా పడుతున్నారమ్మా.

డె : మంచివాడు కాబట్టి.

కా : రాణీ, నా విశ్వాసం అచంచలం - ఇదే నా ప్రతిజ్ఞ.

డె : నాకు తెలీదా, కాసియో.

కా : కాలాతీతమైన కొద్దీ ఈ సమస్య విషమ రూపం దాల్చవచ్చు.

డె : ఈ విషయంలో ఏ కష్టానికైనా జంకను - సరేనా ?

[దూరాన ఓథెల్లో, ఇయాగో]

ఎ : అదుగో సేనాని, ఇయాగోతో.

కా : (ఆత్రంగా) ఇంక నే వుండరాదు - శెలవిప్పించండి.

డె : ఇక్కడే వుండి ముఖాముఖిని తేల్చుకో, కాసియో!

కా : నాకు ఎందుకో నోరాడటం లేదు - ఒంట్లో కూడా -

డె : సరే - నీ యిష్టం.

[కాసియో నిష్క్రమణ]

ఇ : అబ్బ! నాకు అది బొత్తిగా గిట్టదు.

ఓ : ఆఁ, ఏమంటున్నావు?

ఇ : ఏం లేదు లెండి! - ఎందుకొచ్చిన గొడవ!

ఓ : ఆమూరాన వెళ్ళేది కాసియో కాదూ? - డెస్టిమో నాతో ఏదో రాయబారంలాగు తోస్తుందే?

ఇ : వాడే - కాసియో - ఆలోచించలేను? - యింత దొంగతనంగా, మనం రావడంతో జారుకోవడం దేనికని?

ఓ : జారుకోవడమా? - మనం శత్రువులమా ఏమిటి కథ?

ఇ : మరి ఆ నేరస్థుడిలాగ - జంకు ఎందుకో?

[సమాపిస్తుండగా]

డె : ప్రభు! - కాసియో వుండటమంటే వున్నాడుకాదు! ఎలా బెదరగొట్టారో గాని!

ఓ : నీ ఉద్దేశ్యం?

డె : నా ప్రార్థన వినండి - ప్రభు! - అతడి అనాలోచిత కార్యాన్ని క్షమించి - తిరిగి ఉద్యోగ ప్రదానం చెయ్యండి.

ఓ . అతడు ఒక్కసారిగా జారిపోవడానికి నీ వాదన!

డె : భారహృదయంతో నివేదించ లేక!

ఓ : సరే - మరోసారి ఆలోచిద్దాం.

డె : మీకు తీరి కెప్పుడో మళ్ళీ?

ఓ : ఎంత త్వరగా అయితే అంత సౌకర్యంకదూ నీకు !

డె : సహజంగా, ఈ రాత్రి విందప్పుడు - జ్ఞాపకం చెయ్యనా ?

ఓ : ఊహుం

డె : రేపో.

ఓ : సేనానుల సమావేశం పనివుంది - వీలుకాదు.

డె : ప్రభూ ! - వాయిదాలు వేసి విస్మరించినా ఒక నాడు ఆలోచించాల్సిందేగా ?

ఓ : ఇంక చాలించు. - అతడినే స్వయంగా పరిష్కరించు కోమను.

డె : అతడి హక్కుకు సౌజన్యం కల్పించండి.

ఓ : నేను నిర్ణయించుకొనే జ్ఞానం లేక పోలేదు.

డె : సరే - ఎందుకు ఈ శుష్కతర్కం - ఎమిలియా, వెడదాం రా.

[ఎమిలియా, డెస్డిమోనా నిష్క్రమణ]

ఓ : ఎంత సంధిగ్ధావస్థ !

ఇ : ఏమంటున్నారు - సేనాని!

ఓ : ఈ సమస్య - రానురాను విషమరూపం దాలుస్తోంది!

ఇ : ఇంకా - ఇంకా - అసలు విషయం తేలుస్తే.

ఓ : ఏ విషయాలు ?

ఇ : మీ వివాహ పూర్వం, ఆ ప్రణయగాధ కాసియోకి తెలుసు ననుకుంటారా ?

ఓ : ఏమిటా వింత ప్రశ్న ?

ఇ : సందేహ నివృత్తి కొరకు అడిగాను

ఓ : సందేహం ఏమిటో చెప్పు మిత్రమా – అతడు మా చిరకాల మిత్రుడు – అనుచరుడు.

ఇ : నిజంగా !–అయితే.

ఓ · అలా ఆశ్చర్య పోతావేం ?

ఇ : కంబళిలో అన్నం పెట్టుకొని, ఎన్ని సార్లని, ఏరుతారు!

ఓ : నీ నిగూఢత్వం విశదీకరించక పోతే – మనోవ్యధ ఇనుమడిస్తుంది – ఇందాకే – "నాకు గిట్టదు" అన్నావు – చెప్పవూ ?

ఇ : మీరే ఆలోచించు కోండి.

ఒ : నీ అభిప్రాయంమీద నాకు నమ్మకం కాబట్టి.

ఇ : కాసియో మంచివాడే కాని,

ఒ : కానీ,

ఇ : ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చూశారు? – క్షమించాలి – న్యాయంగా వుండే రోజులు కావివి.

ఒ : అసత్యం దాగదు – ఇయాగో – నీ అభిమానంతో దాచకు దేన్ని !

ఇ : రహస్యాన్వేషణ నా మనోరంజక కార్య కలాపం !

ఒ : వివరించూ!

ఇ : శీలాన్ని మించిందేముంది లోకంలో !

ఒ : విసిగించక.

ఇ : నా పరిస్థితే అటువంటిదైనప్పుడు.

ఒ : ఆహాఁ.

ఇ : ఒక్కోలేమి ఒక పిశాచి.

ఒ : అబ్బాఁ!

ఇ . తృప్తిలేక పోతే జీవించలేం ?

ఒ : పరోక్షంగా విసిగించక - నాకు ఈర్ష్య వున్నా నా హద్దుల్లో వీలైనంత వరకూ అణచి వేస్తాను. డెస్డిమోనా అందకత్తె అని, గాయకి యని, సుగుణవతి అని పొగిడినా నేను అభినందిస్తాను.

ఇ : మీ హృదయం విప్పి చెప్పారు నేను తేట తెల్లం చేయాలి-కాసియో శీలాన్ని గురించి నాకు అనుమానం వుంది. డెస్డిమోనా, కాసియోల, ప్రవర్తన జాగ్రత్తగా గమనించాల్సిన అవసరం వుంది! నిదర్శనాలు, నిలకడమీద నిర్ణయింప బడగలవు !

ఓ : శీలం !-

ఇ : ఆమె ప్రేమ అభిమానయుతం కంటే, భయానక జనకమని ప్రతీతి.

ఓ : ప్రతీతి.

ఇ : మీమీద నా అవ్యాజానురాగంకొద్దీ ఇంత దూరం మనవి చెయ్యాల్సి వచ్చింది. అయినా మనం ఏదీ తొందరపడి చేయరాదు ...

ఓ : అయినా డెస్డిమోనా నిష్కళంక చరిత్ర అనే నా విశ్వాసము - అది ప్రకృతి శాసనముగా నాభావన!

ఇ : తథాస్తు ! ప్రకృతి బహు చిత్రమైనది ! -

ఓ : నిద్రాణమైన మమతని మేల్కొలిపావు. ఇది ఏలా పరిణమిస్తుందో ?

ఇ : ప్రభూ - భవిష్యత్తుకోసం-ఎదురుచూడండి. అందరూ సజ్జనులుగా మనకు గోచరించాలని నా ప్రార్థన ! - మనము నిమిత్తమాత్రులము.

ఓ : కాలం ప్రసాదించే ఆనందం, దుఃఖం రెండూ మానవుడు స్వీకరించాలి కాబోలు ! ఇయాగో నిర్భయంగా, సత్యాదర్శంతో వెల్లడించిన అభిప్రాయాలకి కృతజ్ఞుణి. మానవ మనస్తత్వ పరిణితులు ! ప్రళయరుద్రుడు డెమురుపడినా, ఆమె దోషజనిత శిక్షని అరికట్టలేడు ! ఆ వన్నె చిన్నెలకు తీర్చిదిద్దే అందగాణ్ణికదూ-మృదుసంభాషణలో నైపుణ్యాం కొరత పడవచ్చు - ఇవే నా ప్రియురాలి తిరస్కరణకి కారణాలయితే, దుర్భరం ! - కక్కిన కూటికి ఆశపడటంకంటె ఘోరం ఏముంది ? - అదుగో డెస్టిమోనా !

[డెస్టిమోనా, ఎమిలియా ప్రవేశం]

ఆమె అసత్యశీల అయితే ప్రకృతే మూగవోతుంది.

డె : ప్రియా - విందు సంగతి మరచిపోయి ఆలోచనా గ్రస్తులై వున్నారు ! -

ఓ : ఏం ? -

డె : ఆ నిస్పృహ ఎందుకు ? -

ఒ : నాకు (బాధగా) శిరో వేదనగా వుంది.

డె : ఎప్పుడూ ఎడతెగని సంప్రదింపులు ? – నా రుమాల చుట్టనీయండి – తగ్గిపోతుంది

ఒ : ఆ చిన్న రుమాల చాలదు – (పారేస్తాడు)

డె : అయ్యో – పడిపోయిందే? –

ఒ . అది అలా పోనీ – రా విశ్రమించాలి.

డె : ఈ అస్వస్థత మనోవ్యాకులతని పెంపొందిస్తుంది ... రండి.

[ఒథెల్లో, డెస్టిమోనా, నిష్క్రమణ]

ఎ : మహదానందం! – ఈ రుమాల ఒథెల్లో తొలి ప్రణయ కానుక – ఇయాగో దీన్ని ఎలాగ్గైనా సాధించి – తెచ్చిపెట్టమని పోరని క్షణంలేదు! – ఆయనకి ఎందుకో–? కాని యిది సఖికి ఎంతో ప్రియమైంది!–ఆ ప్రేమతమకంలో దానితో మాట్లాడడం, ముద్దుపెట్టుకోవడం, అన్నీను. అయినా ఒకసారి ఇయాగోకి చూపిస్తాను.

[ఇయాగో ప్రవేశం]

ఇ : సంగతేమిటి ! .... చిలకా ... ఒంటరిగా వున్నావు!

ఎ : మీ చిరకాల వాంఛితం నెరవేరింది యిదుగో ఆ రుమాలా.

ఇ : దొంగిలించ లేదుకదా? (భయంగా).

ఎ : ఆఁ లేదు - ఏదో సందర్భ వశాత్తు ఇక్కడ పడి పోయింది.

ఇ : ఆహాఁ ప్రియసీ - మహోపకారం చేసి ఈ నాడు నీ భర్త జోహార్లు పొందావు.

ఎ : రాణి విచారిస్తుందేమో! చూశారుగా - దానితో మనకేం పని! తిరిగి యిచ్చేస్తా- ఇవ్వండి.

ఇ ; పరహస్తం గతం, గతః - ప్రియా - వెళ్ళిరా - తర్వాత చెబుతాగా?

[ఎమిలియా నిష్క్రమణ]

ఆహాహఁ! ఈ రుమాలు ఒక మానవ జీవితాన్ని మార్చేస్తుంది. దీనికి విలువ ఆపాదించి, ఇయాగో- ఒక నాటకం ఆడిస్తాడు - దీన్ని కాసియో యింటిలో పడేస్తాడు. అతడు గ్రహించటం - అనుమానాలు రేకెత్తడం-వహ్వాఁ.

[ఒథెల్లో ప్రవేశం]

ఉపశమనం కలిగిందా ప్రభు! - ఏ మధుర పానీ యము ఇవ్వలేని...

ఓ : అదంతా భ్రాంతి.

ఇ : ఇంతలోనే దౌర్భాగ్యమా.

ఓ ; (విరక్తిగా) అంతా మిథ్య.

ఇ ; ప్రభు! ఆ పరివర్తన.

ఒ ; ఈ అనుమాన పిశాచం-కాని నా డెస్డి పెదవులపై కాసియో ముద్దులు చూడలేదు - ఇయాగో.

ఇ : అదే వరాయ!

ఓ : ఈ నాడు విముక్తణి.

ఇ : సుసాధ్యమా?

ఓ : ఛా - కుటిలుడా - ఈ ఆరోపణలు ఋజువుకానినాడు క్షుద్రపశ్వాగాని కంటే హీనుడివి కాగలవు.

ఇ : (కోపంగా) - అవును - అనండి - ఎందుకు ఈ వ్యథ నాకు - ఎవరు అపవిత్రులైతే నాకేం బాధ - అన్నిటికి ఒక్క నమస్కారం!

ఓ : నిరూపించు - ఋజువు - ఋజువు!

ఇ : మహా ప్రభూ!

ఓ : నీ ఆపదలకు ప్రతి ఘటన తప్పక పోవచ్చు.

ఇ : పాపము శమించుగాక! ఎంత మాట వినవలసివచ్చిందీ? కానీండి - మీలో మానవత్వం శూన్యమా? మీ ఆత్మ అన్యాయాల్ని చూసైనా ఆక్రందించ లేదా? దైవము కరుణించుగాక! ప్రేమ మాయ అటువంటిది! మహా మహావారికే ఆ సంకట పీడన తప్పలేదు. ఇంక మన సామాన్యులకో! ఓ లోకమా - ఎన్నడు స్వాతంత్ర్య ప్రియులను హర్షిస్తావు? ఇంక నాకు లోకంలేదు; మిత్రుడు లేడు!

ఓ : శాంతించు మిత్రమా! నువ్వు నిజాయితీ దారుడివే!

సందేహం లేదు - దేనికైనా ఋజువు కావాలని నా అభిమతం.

ఇ : యేమైనా కాసియోలాంటి ఉత్తముడు, రాణిలాంటి లావణ్యరాశీ....

ఓ ; ఆహాఁ బాధ - మృత్యువు.

ఇ : ఇప్పుడే ఇలా కృంగిపోయే మీరు ఋజువుని భరించగలరా! - అయినా నేను ఎలా చెప్పను ? - ఏం చెప్పను ?-ఎక్కడికి సంతృప్తి? - ఆనాడు ఊహించుకోలేరు. తమాయించుకోనూ లేరు

ఓ : ప్రత్యక్ష నిదర్శనం!

ఇ : కాగల కార్యం గంధర్వులే చేశారు. సావధానులై చిత్తగించండి. ఒకనాటి కాళరాత్రి ఆలశ్యంగా కాసియో ఇంటిలో శయనించటం, నాకు జరిగింది. మానవుడు ఆత్మస్వాతంత్ర్యాన్ని అన్నివేళలా అరికట్టలేడనడానికి కాసియో నిదర్శనం!-అలాంటి కాసియో నిద్రలో "ప్రియా, చిలుకలకొలికీ, డెస్టి - మన ప్రణయాన్ని ప్రచ్ఛన్నంగా వుంచు - స్వర్గధామంలో లోకాన్ని మరిచి, స్వేచ్ఛా జీవులమై విహరిద్దాం - " అనేటప్పటికి నా తల తిరిగిపోయింది. ఇంకా అలా

అంటూ యథాలాపంగా ప్రక్కనున్న నా చేతిని పట్టుకొని ముద్దుల వర్షం కురిపించాడు. నేను చీత్కారంతో వారించే లోపల "ఓ మనోహారి - నీ జీవిత జ్యోతిలో కారుచీకట్లు రాసులు కప్పిన ఆ విరసాత్ముడెవడు? _" అని విలపించాడు - ప్రభు!

ఓ : మహాపచారం! - ప్రళయం:

ఇ : అదంతా ఒక కలయేగా? ....

ఓ : అది కాసియో కుటిల స్వభావ వ్యక్తీకరణ? జాప్యం ఎందుకు?

ఇ : ఇది భావి సరాగానికి ఒక ఉపశ్రుతి —

ఓ : ఆమె - ఓ - అంతమొందిస్తా ...

ఇ : శాంతం - ప్రత్యక్ష నిదర్శనం ఇంకా కాలేదు!? - అయితే రాణి చేతిలో ఓ రుమాల వుండేది - ఎరుగుదురనుకుంటాను.

ఒ : నా తొలి ప్రణయ కానుక! -

ఇ : మరి ఏమోగాని అలాంటి దాంతో కాసియో గడ్డం సవరించుకుంటుండంగా చూశాను. ఎవరిదోగాని

ఓ : అదేగనక అయితే-

ఇ : నిర్ధారణ అవుతున్నట్లే!

ఓ : తీరని ప్రజ్వలన, అశాంతి. ప్రేమకి ఇక్కడ స్థానం లేదు. ప్రతీకారం. ఆవేశించు నన్ను!-

ఇ : ప్రభు! నిదానం—

ఓ : రక్తదాహం రక్తదాహం—దాహం—తృష్ణ...

ఇ : మనస్సు-చలనం.

ఓ : కట్టలు తెగిన నా ఉద్రేక ప్రవాహం!

ఇ : (మోకరిల్లి) చిరస్థాయి అగుగాక మీ ఉద్రేకం!- న్యాయాల్ని రక్షించుగాక!

ఓ : మూడురోజుల్లో కాసియో పరలోకగతుడని నువ్వు చెప్పగల మహదవకాశం - ఆలస్యం-మర్భరం—

ఇ : కాని రాణిని కనికరించండి.

ఓ : ఒక్కసారీ— (ఈసడింపుగా) ఒక్కసారీ—

ఇ : అంతా లీల! చివరికి....

[ఓ థెల్లో, ఇయాగోల నిష్క్రమణ]

(కోట ముందర భాగం)

(మూడవ దృశ్యం)

[డెస్డిమోనా, ఎమిలియా]

డె : కాసియో ఏం చేస్తున్నాడో పాపం ! - ఎవరక్కడ? ప్రతీహారీ, సేనానికి చెప్పవలసిందంతా చెప్పాననీ, అన్నీ సవ్యంగా పరిణమించగలవని ఆశిస్తున్నాననీ చెప్పు- ఒక్కసారి రమ్మనమను.

ఎ : అమ్మా ! కాసియో రాకపోడు. ఖేదపడకండి.

డె : (ఒక్కసారి) నా చేతిరుమాల ఏమైందో ?

ఎ : ఏమో ?

డె : నాకెందుకో అకారణ భయం ఆవేశించిందే ?- ఏది పోయినా చింతలేదుగాని.... (దుఃఖంగా) అందుట్లో సేనాని మనస్సు బాగుండలేదు. అన్నీ చెప్పలేనన్ని సందేహాలు !

ఎ : అంత ఈసడింపూ, ఈర్ష్య ఎందుకమ్మా, సేనానికి?

డె : ఆయన గాఢ ప్రేమకి ఎదురులేదు. ప్రేమ, ఈర్ష్య లేకుండా జీవించలేదు. ప్రేమకి స్వార్థం ఎక్కువ - గాఢంగా ప్రేమించేవాడు, ఈర్ష్య వహించడం. సహజం !

ఎ : అడుగోనమ్మా - సేనాని.

డె : మంచి సమయం. కాసియో సంగతి చెప్పాలి.

[ఓథెల్లో ప్రవేశం]

డె : ప్రియా....

ఓ : ప్రియూట....ప్రియా....ఆహాః ఎంత సంఘర్షణ నాకు!

డె : అలసట చెందారు ?

ఓ : నీ హస్తాన్ని ఇటు ఇవ్వు దేవీ....

డె : హస్తాన్నా !

ఓ : ఉదార హృదయాన్ని హస్తం వ్యక్త పరచదా ?

డె : అవును....హస్తం....నా హృదయం.

ఓ : పూర్వం హృదయం, ప్రస్తుతం హస్తం.

డె : ఎందుకో ఆ ఎద్దేవా ? మరి ప్రమాణం మరిచేరా ?

ఓ : ఏం ప్రమాణం ?

డె ; కాసియో సరుస్యా పరిష్కారం!

ఓ ; అది అనవసరం. (ఒక్కసారి) నీ రుమాలా ఏది ?

డె ; ఇక్కడెక్కడో వుండాలి, ఎందుకూ ?

ఓ : అంత తిరస్కారమా ? నీకు తెలీదూ ?

డె : నా దగ్గర ఇప్పుడు లేదు.

ఓ : (ప్రళయంగా) లేదూ ? లేదా ?....

డె : కొంత వ్యవధి యివ్వండి ప్రభూ....

ఇ : స్వయం కృతాపరాధానికి వ్యవధి. రక్షణ యివ్వ లేదు. నా తల్లికి ఈజిప్టు మంత్రకత్తె భర్తను వశవర్తనుడుగా చేసుకోవడానికి యివ్వగా, ఆమె అవసానకాలంలో తన కోడలుకు యివ్వమని నాకు ఆదేశిస్తూయిచ్చింది- ఆ పవిత్ర కానుక యిప్పుడు...

డె : విధివశాన, రుమాలా అగుపడని కారణాన ఎంత నింద ! ....

ఓ : నిందట ? ఆ మాంత్రిక ప్రాబల్య భూషణాన్ని

నేను చూడలేదనుకున్నావా ? ఒక్కసారి, పోయింది. అది తిరిగిరాదు. మనల్ని విడనాడింది.

డె : (భారంగా) అలా అనకండి - దైవమా ? -

ఇ : నీకూ - దైవమా ? అకారణంగా - రుమాల చూపించి నీ ర్దోషిత్వాన్ని ఋజువు చేసుకో —

డె : అసహాయురాల్ని పీడించకండి.

ఇ : రుమాలు - నా రుమాలు.

డె : ఓపిక పట్టండి — తెచ్చియిస్తాను. కాసియో సంగతి - ముందు చూడండి.

ఓ : (గర్జిస్తూ) నా రుమాలా ! —

డె : ఎంతైనా కాసియో మీవాడే—

ఓ : (గర్జిస్తూ) నా రుమాలా ! —

డె : కుమార్తురాల్ని — అజాగ్రత్తకు-

ఓ : ఛీ —

(వెడతాడు)

ఎ : అమ్మా, అయ్యగారు పూర్తిగా మారిపోయినారు.

డె : సఖీ — నా జీవితం సిటి పాలైంది —

(విలపిస్తుంది)

[ప్రవేశం — ఇయాగో, కాసియో]

ఇ . రాణిగారే నీకు మోక్షం ... సర్వస్వం ... సాధించు ఆమె ద్వారా.

ఇ : కులాసాయేనా కాసియో ? ....

కా ; ఎక్కడి కులాసా ? —

ఇ ; సేనాని యిప్పుడు అన్యమనస్కులై యున్నారు .... నా నివేదన అశాంతికి కారణమౌతుంది.

ఇ , సేనానికి ఈ చికాకు ఎందుకో ? ....

ఎ ; ఆయన వైఖరిలో చెప్పలేని మార్పు !

ఇ ; అలా అయితే ఉపశమింప జేయాలి ... ఒకసారి సంప్రదించి వస్తా (నిష్క్రమణ)

ఇ ; దేహంలో ఒక భాగం దెబ్బతిన్నా అన్ని భాగాలు గాయపడినట్లే బాధపడతవి. మానవుడు ఎంత భాధో న్నతుడో అప్పుడే అంత క్షుద్రుడునూ ?

ఎ : అమ్మా - సేనానికి రాచరిక కార్యాల వత్తిడి ఎక్కువగా వున్నట్లు తోస్తుంది.

డె : అది నా హింసకు తోడ్పడాలా? ఏమైనా, కాసియో ఆయన్ని తీసుకువస్తా. ఈ ప్రాంతంలో పిలుపందు దూరంలో తిరుగాడుతూవుంటు, సమయం కోసం నిరీక్షిస్తా.

కా : రాణి....మీరే ఈ అంధకార జీవితానికి ఆశా జ్యోతి !_

[అందరు నిష్క్రమణ]

(సైప్రసులో కోట ముందర)

[చతుర్థరంగం]

(మొదటి దృశ్యం)

[ఒథెల్లో, ఇయాగో]

ఇ : అలా అనుకుంటున్నారా, ప్రభూ -!

ఓ : మరి....

ఇ : ఏకాంతంగా చుంబించిం దంటారా ?...

ఓ : దొంగతనంగా అను...

ఇ : ప్రణయ శయ్యపై సల్లాపాలుకూడానా ?

ఓ : అవును. స్నేహం !-నమ్మిక - ఇవి అడ్డం పెట్టుకొని.

ఇ : ఇలా పరిణమిస్తుందని ఎన్నడైనా తలపోశామా ?

ఓ : మతి విహీనమై....

ఇ : ఇంక ఆ కాసియో డాంబికాలు వినగలిగితే ఏమనే వారో ?

ఓ : వాడా !

ఇ : ఎందుకు అవన్ని పనికట్టుకొని త్రవ్వి పోసుకోవడం ?

ఓ : (గర్జిస్తూ) చెప్పు ! చెప్పవూ ?....

ఇ . శయనించి....

ఓ : ఆమెతో....

ఇ ; చెప్పలేను !.

ఓ ; హుం పిశాచీ. శయనించావా ? (ఒక్కసారి) ఏదీ రుమాలా చూపించు, చంపేస్తాను. కౌగలింతలా .... ముద్దులా ! హుం రాక్షసీ ! ఏదీ రుమాలా ! గొంతు నులిమివేస్తాను ! (మూర్ఛపోతాడు.)

ఇ ! ప్రభువుకి ఎంత ఆపద! (మెల్లగా మనస్సులో) పని చేస్తోంది. ఈ ఇయాగో మందు బాగా పనిచేస్తోంది.

[కాసియో ప్రవేశం]

కా ; ఏమైంది సేనానికి ఇయాగో....

ఇ : ఉద్వేగ ప్రేరితులై సొమ్మసిల్లారు ....

కా : తలదగ్గర రాయి – నీళ్ళు చల్లు - చేతులు ఆడించు.

ఇ : శ్శ్! - నేను చూసుకుంటా - నువ్విక్కడుండ రాదు. చూస్తే ప్రమాదం ! కాసియో.

[కాసియో నిష్క్రమణ]

(ఒథెల్లో తెప్పరిల్లగా)

తలమీద గాయం కాలేదుకద !.

ఓ : అపహాస్యమా ?

ఇ : హతవిధీ - (ఆదుర్దా) - అంతే సేనాని !

ఓ : నా వశంలో నేను లేను !- ఆ దుష్టుడు ఏమన్నాడు !

ఇ : ఇప్పుడు కాదు,....

ఓ : ఏమైనా....

ఇ : ఓర్పు - ఇప్పుడు కాసియో కాలు కాలిన పిల్లిలా ఇలా వచ్చాడు. వెళ్ళిపొమ్మని గదమాయించాను. వాడినొక కంట కనిపెడుతుండండి! ఎందుకైనా ?

ఓ : ఇంకా, గా తాత్సారం !.

ఇ : ఇదిగో వాడితో అన్ని విషయాలు మాట్లాడుతాను. విని సంగతులు తెలుసుకుంటుండండి....

[ఇయాగో నిష్క్రమణ]

ఇ : కాసియో ప్రియురాలు బియాంకా ప్రసక్తి తెచ్చి.... చక్రం తిప్పుతాను. నాతడాఖా (బిగ్గరగా) కాసియో మహావీరా !

కా : ఆ పేరుతో నన్ను పిలువకు. తగను.

ఇ : (మెల్లగా) అమ్మగారు నీ కోసం ఎంత అవస్థ పడు తున్నారని ! (బిగ్గరగా) —ప్చ ! అదే నీ ప్రియు రాలు గయ్యాళి బియాంకా అయితేనా (చిటుకవేసి) క్షణంలో తేల్చేసును ! హాఁహాఁ...

కా : (నవ్వుతూ) అహో పిచ్చి మాలోకం !—

ఓ : (తెరలో ప్రచ్ఛన్నంగా) ఆ నవ్వా? అవును. పతిత అంత చులకన! కానీ...

ఇ : అదేమిటి కాసియో — ఆ బియాంకా! (మెల్లిగా అని) తనని ఒకళ్ళు ప్రేమించడం మాని తనే తిరిగ్గా ప్రేమిస్తోంది. దాని తస్సాదియ్యా! -

కా : ప్రేమాంధుడా - ఆమెకు నేనే సర్వస్వం! -

ఓ : (తెరలో) అలాగా! — ఓసి డెస్డిమోనా - ఎంత పతనం పొందావే! — సేనాని భార్యవై యుండి కూడా.

ఇ : కాసియో, కాస్త నీ ప్రణయ కబుర్లు చెబుమ- ఎంత సేపు ఈ అల్ప వ్యవహారాలేనా ?

(తెరలో)

ఓ : ఇయాగో - ఘటికుడు - సూక్ష్మగ్రాహి.

కా : దాన్ని పెళ్ళిచేసుకోక తప్పదు - తప్పించుకుందా మన్నా వదలదేం అస్తమానము!

(తెరలో)

ఓ : దౌర్భాగ్యం! — కానీ — కానీ.

ఇ : అలాగే వింటున్నాను.

కా : దాన్ని తప్పించుకోవడం కష్టంగా వుంది. ఎక్కడికి వెడితే అక్కడికి తయారు. పగలని - రాత్రని - తెలుస్తేగా! —

ఇ : పెద్ద కథే.

(తెర లో)

ఓ : నా పరాజయం! -

కా : బలే చిత్రమైన మనిషి - ఇక్కో కోపం - అక్కో ఓ దార్పు.

ఇ : అంతా ప్రణయ లీలలు! -

కా : పోతాను, అది అలిగిందా ఓపట్టాన లేచి రాదు ...

(వెడతాడు)

[ఓథల్లో ప్రవేశం]

ఓ : (కోపంగా) వాణ్ణి చంపేయనా ... ఇయాగో!

ఇ : ఆ వెకిలి నవ్వు చూశారా? ...

ఓ : అబ్బా ... ఇయాగో!

ఇ : ఆ రుమాలా భార్యకి అల్లిపెట్టమని ఇచ్చాడుట. ఆమె ప్రణయ కోపం వహించిందట; ఎవరినో ప్రేమించి తెచ్చి యిచ్చాడని.

ఓ : నా రుమాలా కదూ ?

ఇ : ఆ రుమాలే ? - ఇంకా సందేహమా ? ...

ఓ : ఉప్పుపాతర వేయిస్తా వాడికి — ఆ కాసియోకి.

ఇ: మీ కెందుకు అంత శ్రమ - ఈ దాసుడుండగా!

ఓ : ఇంక నాకు డెస్టిమోనా లేదు. ఆమె నా కనవసరం. పరాయత్తమైన ఆమెను చూడలేను - భరించలేను. ఈ గాథ ప్రేమ - విధి, నా కెందుకు ప్రసాదించావు. ఆమెకు నేను అనర్హుణ్ణి. నిజం - ముమ్మాటికి నిజం. ఒక మహారాజునకు ఆమెను భార్యను చేయక పోయి నావా ?

ఇ : అపకారం చేయవద్దు సేనాని ....

ఓ : ఆమెను భరించలేను.

ఇ : మనకు సంబంధించినది కాదని వూరుకుంటే మంచిది.

ఓ : నా బలహీనత కావచ్చు ... ఓసీ నిన్ను హతమారుస్తాను. నాలో నరకం చూస్తావు ? - ప్రియుణ్ణి కాదు ... ముమ్మాటికి ? -

ఇ : ఆలోచించుకొని మరి దిగండి.. రంగంలోకి.

ఓ : నాతో పరియాచకాలా ? ఓథెల్లో నమ్మిన ఆశయానికి తిరుగులేదు.

ఇ : మహా పాపి - కాసియో !

ఓ : ఇయాగో, ఆమెకు విషం ఇచ్చేయనా ఈ రాత్రి..

ఇ : విషమెందుకు; రక్తానికి రక్తమన్నారు. కత్తికి కత్తి !. ఏ తలంపుతో కాసియోతో ఆమె ఘోరం తలపెట్టిందో అక్కడ ఆమెను గొంతు నులిమి....

ఓ : గొప్ప సలహా !

ఇ : కాసియో పంతం పడతా ! సున్నంలోకి ఎముక లేకుండా ?

[బ్రాబిన్‌టో సోదరుడు లాడ్‌విగో -
డెస్టిమోనా అనుచరులతో ప్రవేశం]

లా : ప్రభువులకు - జయము జయము.

ఓ : స్వాగతం - లాడ్‌విగో.

లా : వెనీసు - జోహార్లు-ఈ రాజుగారి జాబు మీ కోసం.

ఓ : మంచిది.

డె : బాబాయ్ - వెనీసు విశేషాలు చెప్పవూ !

ఇ : లాడ్స్ లికో— ఆయాగోకి నే కాసందంకలిగించావయ్యా!

లా : కాసియో, కుశలమా ?

ఇ : ఆc బ్రతికేవున్నాడు. (ఈసడింపు)

లా : బ్రతికే వున్నాడా ? ఏం ప్రమాదం—

డె : ఇప్పుడు సేనానికి, కాసియోకి ఏం పొసగటంలేదు.

లా . విరోధమా ? అరేc, ప్రభు ! మీ బోటివారికి ఇది తగునా ?

డె : ఎంతో చెప్పి చూశాను. కాసియో ఎంత పరితాప పడుతున్నాడని.

ఓ : క్రోధాగ్ని !—

డె ; నాధా !—

ఓ : ఆపు... నీ ప్రలాపం...

లా : రాజుగారు, కాసియోని సేనాని పదవికి నియమించారు. చిత్రం ! ఇప్పుడెట్లా !

డె : ఎంత ఆనందం. వారికి మంచిరోజులు వచ్చాయ్.

ఓ : ఆలాగా—

డె ; సేనాని !—

ఓ : ఉన్మాదీ!

డె : ప్రియా — ఓథెల్లో.

ఓ : వంచకీ !

డె : వంచకినా ! (ఏడుపు)

లా : ఆ సుకుమారిని ఓదార్చండి సేనానీ, కుమిలిపోతుంది పాపం !—

ఓ ; వగల ఏడ్పులకి ఓదార్పా !—

డె : నా మాట, నా రూపూ మీకు సరిపడనప్పుడు, ఇక్కడ ఎందుకు నేనూ.

(వెడుతుంది.)

లా : అహాఁ అమ్మాయికి ఎంత వినయం ? కాస్త అనునయించు సేనాని.

( క ఠి న ం గా )

ఓ : ఓగృహిణీ — నిన్ను అనునయించాలా ? అయ్యో — నీ మాయా నాటకం, దొంగ ఏడుపులూ తెలియని ఇతరులకు ఎంత జాలిని కలిగిస్తున్నదో ! నాకు అవతల చాలా పనులు వున్నాయ్ — లాడలికో మహాశయా, శెలవు.

[నిష్క్రమణ]

లా : ఆహాఁ మార్పు! ఆనాడు తండ్రిని సైతం కాదని, రాజసభలో ఈ కరిముణ్ణా, డెస్డిమోనా ప్రేమించింది?

ఇ : పరిస్థితులు మనిషిని మారుస్తుంటవి.

లా : ఓథెల్లోకి వచ్చిన అపాయమేమిటాఅని! ప్రియురాలు తృణప్రాయంగా వుందే!

ఇ : రాజుగారి జాబు ఆయనకి రుచించక పోవచ్చు.

లా : ఏమైనా, సేనానిలో నేను మానవత్వం చూడలేక పోతున్నాను.

(రెండవ దృశ్యం)

[కోటలో ఒక గది. ఓథెల్లో ఎమిలియా ప్రవేశం]

ఓ ; అమ్మగారిమీద నీకు ఏం సందేహం లేదన్నమాట?

ఎ ; ఆమె ఏ పాపము ఎరుగదు!

ఓ ; కాసియో, ఆమె కలసివున్నట్లు ఎప్పుడూ చూడలేదు!

ఎ ; చూడకేం? దాంట్లో దాచాల్సిన అవసరం ఏమీ లేదు?

ఓ ; వాళ్ళ రహస్య మంతనాలు జరపడం గ్రహించావా?

ఎ ; ఊఁ హుఁ ....

ఓ , నిన్ను దూరంగానన్నా పొమ్మనలేదా ?

ఎ : బొత్తిగా.

ఓ : వింతగా వుందేఁ — ఆమెనోసారి పిలుచుకురా ?

[డెస్డిమోనాతో ఎమిలియా ప్రవేశం]

డె : పిలిచారట!

ఓ : అవును.

డె : మీ ఆజ్ఞ !

ఓ : ఆజ్ఞ! - సరే ఇలా నా వంక సూటిగా చూడు.

డె : మీకు మతిభ్రమణ కలుగుతోంది.

ఓ : ఎవరన్నా వస్తే కబురుచెయ్యి - అంతదాకా వాకిలి దగ్గర వుండు.

ఎ : చిత్తం.

డా : నన్ను ఇలా హింసించి ఏం తృప్తి పొందుదామని?

ఓ : ఓసీ - ఎవరు - ఎవరునువ్వు.

డా : మీదాన్నే - మీ భార్యని ! అలా చూస్తారేం ?

ఓ : ప్రమాణం చెయ్యి...వన్నెలాడి ! - పో అవతలకి.

డా : ఎందుకా కన్నీరు ! నానుంచేనా - ఒక్కసారి చంపే యండి - మీ హృదయం తేలికపడుతుంది.

ఓ : సృష్టికర్త చేతుల్లో నే నో ఆటబొమ్మను. ఒకనాడు దారిద్ర్యం, బానిసత్వంతో అలమటించాను. ఈనాడు, మరో బాధ ! ...

డా : నన్ను శంకిస్తున్నారా ? - -ఎలాగు - నేను విశుద్ధమైన క్రైస్తవురాల్ని - నే నేపాపం ఎరుగను ! ....

ఓ : ఎలాగు ! ఎక్కడ ! ఎప్పుడు ! ఎవరు చెప్పగలరు. కాలగతి !——

(వెడతాడు)

[ఎమిలియా ప్రవేశం]

ఎ : అమ్మా, నీ బాధ చూడలేను.

డె : జీవచ్ఛవాన్ని.

ఎ : ప్రభువు ఏమన్నారు ?

డె : ఆయన చెప్పింది నాకు అర్ధంకాదు; నేను చెప్పేది వారికీ అర్ధంకాదు. ఏడ్వలేను. కన్నీరు లేదునాకు! కాని ఈ రాత్రి నవ వధువు వలె అలంకరించు నన్ను. తొలినాటి రాత్రి పాన్పువలె అమర్చు. ఇయాగోని ఒక్కసారి లోపలకి పిలు..

ఎ : విడ్డూరం! –

(ఇయాగో ప్రవేశం)

ఇ : రాణి!

డె : జీవితాధ్యాయ అంతిమ దినం సమీపించింది.

ఇ : ఎంత పాపం చేసుకున్నానో క్రీస్తు ప్రభు! ఈ మాట వినడానికి.

డె : ఈ అకారణ వైరానికి ఎవరన్నా కారకులై వుంటే వారిని సైతం క్షమించమని దైవాన్ని ప్రార్థిస్తాను. నా కెవరిమీద కినుక లేదు.

ఎ : ఎంత పిచ్చిదానివి సఖి! — వాళ్ళని నువ్వు క్షమించినా, దైవం మాత్రం క్షమించడు!

ఇ : మెల్లిగా.

డె : ఇయాగో - నువ్వంటే ఎంతో నమ్మకం. నాథుడికి నా మీద దయ కలిగేటట్లు విన్నవించు.

ఇ : అయ్యో చెప్పలా రాణి.. 'ఇదేం విలయామా' అని ఎంత అలమటిస్తున్నానో! పోయి రామ్మా...

(డెస్టిమోనా, ఎమిలియా నిష్క్రమణ)

[రాడిరిగో ప్రవేశం]

ఇ : మిత్రమా .. రాడిరిగో!

రో : చాల్లేవయ్యా. నీ నక్క వినయాలూ!

ఇ : ఏమిటా ఈ సడింపు!

రో : ఆఁ నమ్మకుంటే గంగలో దిగినట్లే. ఎంతడబ్బు, ఎంత సంపద! ఒక్క పనన్నా సానుకూల పడిందా?

ఇ : నీవిచ్చి ది కానందం. కాస్త విందూ? అన్యాయంగా నన్ను నిందిస్తున్నావు?—

రో : వింది ఇలా అఘోరించింది; ఇంక వినబోయేది — ఎలా మండిపోతుందో? డెస్టిమోనా దగ్గరికి నేనే ముఖాముఖిని వెళ్ళి "నగలన్నీ యివ్వు ... ప్రేమిం చన్నా ప్రేమించు..." అంటాను. మధ్య ఈ కుంటి రాయబార మెందుకు ...? "దోచాడు బాబు ... దోచేశాడు" అని ని సంగతి నలుగురికి అప్పుడే తెలుస్తుంది.

ఇ : ప్రాణాలపై తీపి వదలుకున్నావా? —

రో : బాబ్బాబు — అంతమాట అనకు ... (లాలనగా) ఏదో అలా సర్దాగా అనేశాను.

ఇ : అలా దిగరా? గురువుకే పంగనామాలా? (మెల్లిగా) ఈ రాత్రి నే చెప్పినట్లు చెయ్యి....

రో: మళ్ళీ ఏదో పెటకం పెట్టావే ? ...

ఇ : నీ దగ్గర "కలేజా" వుండే "రంభైనా" దిగి రావాలి సిందే ?.... కావాలోయ్.... పౌరుషం_ ప్రజ్ఞా !

రో: అదేమన్నా మనవల్ల అయే పనేనా ?

ఇ : కాసియోకి సేనాని పదవి వచ్చింది. ఇంకా ఆ విషయం తెలియదు వాడికి_ ఆ సంగతి చెప్పడానికి రాత్రి వాడి ఇంటికి వెళ్లి ఇలా పంపిస్తాను. చీకట్లో ఎదుర్కొని_

రో: నే నొక్కణ్ణే. చస్తాను._

ఇ : నేనూ సాయం వస్తాగా అన్నీ గుప్తంగా వుంచు. జాగ్రత్తగా నెరవేర్చాలి!

(ఇయాగో, రోడెరిగో నిష్క్రమణ)

(కోటలో ఒక గది)

మూడవ దృశ్యం

(లాడ్‌విక్కో, ఓథెల్లో, డెస్డిమోనా, ఎమిలియా)

లా: ఇంత రాత్రి షికారు వెడతారా?- విశ్రమించండి.

ఓ : తప్పదు- డెస్డిమోనా- వెంటనే శయనించు-త్వరలో తిరిగి వస్తాను. పరిచారికను వెళ్ళిపొమ్మను.

డె : మంచిది- ప్రభూ !-

(లాడ్‌విక్కో, ఓథెల్లోల నిష్క్రమణ)

ఎమి : ఈనాడు ఆయన పిలుపులో తిరస్కారం వుంది. లాలనలో ఆజ్ఞ వుంది: అయినా ఆయన వాక్కు నాకు శిలా శాసనం !- ఈ రాత్రి పాత స్మృతులే జ్ఞాపకం చేస్తోంది.. మా అమ్మ దగ్గర "బార్బరా" అనే సఖి వుండేది.. ఆమెకు ప్రియుడు కాకుండా పోయినప్పుడు, అవసాన దశలో, కాకలీ స్వనంతో ఓ విషాద గీతం ఆలాపించింది ఆ రాత్రి. ఎందుకో ఆ పాట నా గుండెల్లో ప్రతిధ్వనిస్తోంది.. ఆ కాళ రాత్రి. ఆ పాటే !

[పంచమ రంగం]

(సైప్రసులో ఒక వీధి)

మొదటి దృశ్యం

(ఇయాగో, రోడిరిగో)

ఇ : ఇక్కడ.. ఈ గుప్త స్థలంలో దాక్కో... రోడిరిగో... ధైర్యంగా వుండు.. కాసియోని చూడగానే నిశ్చయించి, ఒక్కసారి దూకు..

రో: నువ్వు దగ్గరే వుండు. ఖర్మంచాలక తగ్గినా- అందుకు నేందుకు !- (నిష్క్రమణ)

ఇ : (తెరలో ప్రచ్ఛన్నంగా) అటో యిటో తేలిపోవాలి. ఎవరి చేతుల్లో ఎవరు పోయినా పీడ విరగడౌతుంది. డెస్డిమోనాకి కాసియో లేడు.. నన్ను నగలు తిరిగి ఇమ్మనే రోడిరిగో వుండడు !- అదుగో- దూరాన కాసియో -

రో: వస్తున్నాడు.. విఱ్ఱవీగుతూ, చచ్చావురా ఈ దెబ్బతో ధూర్తుడా..

(కాసియోని ఎదుర్కొంగా)

కా: నామీదికే !... కాసుకో ?...

(పోరాటం)

రో: అబ్బా. పొడిచేశాడు... చచ్చాను బాబో..

(ఆ క్రం ద న)

[ఇయాగో చీకట్లో ప్రచ్ఛన్నంగా కాసియో కాలుపై
పొడిచి పరారి]

కా: అయ్యో.. హంతకులు కుట్ర చేశారు.. అబ్బా..
కాలు విరిగింది.. హత్య.. రక్షించండి...

(ఓథెల్లో ప్రవేశం)

ఓ : అదుగో కాసియో రోదన లాగుందే ?.. మిత్రుడు
ఇయాగో.. అనుకున్నంత పనీ చేశాడు.. ఏమైనా
విశ్వాస పాత్రుడు ...

రో: అయ్యో.. కరుణించండి.. అబ్బా.. ఈ గాయం.

(లాడ్ విగో ప్రవేశం)

లా: ఏదో దెబ్బలాట జరిగింది. ఆఁ ఆర్తనాదాలు ఏమిటి
(ఆగి) అయినా ఈ ప్రదేశం క్షేమకరం కాదు.

(ఇయాగో దీపంతో ప్రకాశం)

ఇ ; ఎవరిక్కడ "హత్య" అని అరిచేది ..

కా: ఇక్కడ.. ఇక్కడ.., ప్రమాదం... కాపాడండి.

రో: బాబూ! నన్ను రక్షించండి..

ఇ: (కాసియోని సమీపించి) మిత్రమా! ఎంత పని జరిగింది...

కా: ముష్కరులు దొంగచాటుగా ఎదుర్కొన్నారు...ఆ మాగాన మూలిగే నీచుడు ఆ హంతకుల్లో ఒకడు. ఎదుర్కొగా గాయపరిచాను..

ఇ: (రోడిరిగోను సమీపించి) హంతకా! ఇదే నీకు శిక్ష!...

రో; (విఫలంగా) మహాపాపీ! ఇయాగో.. నరరూప రాక్షసీ! అబ్బా.. పాప ఫలం.. నీచ సాంగత్యం.. (మరణిస్తాడు)

ఇ: వీరి మిగతా దుష్టులు.. అంతా సందేహంగా వుంది. ఎవరక్కడ పట్టుకోండి..

లా; (ప్రవేశిస్తూ) అయ్యో నేను.. లాడ్ లికో.. ఆ ర్తనాదము విని వచ్చాను.. అంతే...

ఇ: అనుమానించినందుకు క్షమించండి. మన ప్రియ కాసియోకి వైద్య సహాయం జరగాలి.. సాయం పట్టండి. లోపలికి.. (అంతా నిష్క్రమణ)

## రెండవ దృశ్యం

[కోటలో శయనాగారము. నిద్రా ముద్రాంకితయై డెస్డిమోనా- రూపం-వెలుతురులో]

ఓ ; ఈనాడు.. ఈ రాత్రి.. ఈ గంట.. ఈ నిమిషం.. కాదు ఈ క్షణం.. నాకు జీవన మరణ సమస్య. డెస్డిమోనా జీవించరాదు.. నా డెస్డిమోనా పురుషులను వంచించదు.. ప్రియా.. నిన్ను చంపేస్తాను. తరువాత స్వార్థ రహితంగా ప్రేమిస్తాను..

డె ; (మేల్కొని) ఎవరూ.. ప్రియా...

ఓ : ఆఁ రాణి !-

డె: విశ్రమించరూ ?...

ఓ : (నవ్వి) కానీ, కానీ (ఒక్కసారి) ఈ రాత్రి ప్రార్థన చేశావా, దేవీ ?

డె: ప్రార్థించని దెప్పుడు ?-

ఓ : పాపోపశమనార్థం ఆయత్తపడని నీ ఆత్మను హత్య చేయువలెను.

డె: హత్యా !— దైవమా !— ఇదా నీ భిక్ష !

ఓ పాపాత్ముల దైవం అదే శిక్ష విధిస్తాడు! నీ మరణం: అనివార్యం....

డె: ఎంత అసహజంగా తలపోస్తున్నారు.

ఓ : (కోపంతో) నా ప్రణయ కానుకనా కాసియో కిచ్చేది ?

డె: దైవసాక్షిగా నే నివ్వలేదు.. పిలచి కనుక్కోండి....

ఓ : మరణశయ్యపై బూకరింపు ?—

డె: కానీండి- మరణం అనివార్యమైతే ఆరుమూలుగా ఎదుర్కొంటాను. మీచేత చంపబడ లేను— కాని నిజం పల్కి చనిపోతాను.

ఓ : కన్నులార నీ రుమాలు కాసియో చేతిలో చూశాను అప్పుడే ఇయాగో, అతడిని అంతమొందించాడు.... మిగిలింది నువ్వు ?—

డె: అయ్యో— కాసియో....

ఓ : ఛా- కపటీ-ఆ నీచుడికోసం నాముందు విలపిస్తావా?

డె : సిద్ధమే. కాని లక్షమంది ఓథెల్లోలైనా డెస్టిమోనాని చంపలేరని ఉద్ఘాటిస్తున్నాను.

ఓ : కాలాతీతం-రక్కసీ (గొంతు నులిమిన ఆక్రందన)

ఎమి: (తెరలో) ప్రభూ! సేనాని ప్రభూ!

ఓ : ఆఁ ఏమిటా ధ్వని! త్వరగా ముగించనీ(ఆక్రందన) ఎవరక్కడ?

ఎ : మహాప్రభూ! ఒక్క మాట. ఒక్క మనవి.

ఓ : ఎమిలియాగొంతు. ఆ కోలాహలంయేమిటి? (తెర దించేసి) ఎమిలియా?

ఎ : ప్రభూ! నా విన్నపం. దూరాన అక్కడ హత్యలు జరిగినయ్. క్షతగాత్రుడై కాసియో మరణించిన రోడిరిగో. ఆ మూలుగేమిటీ? నా రాణిది కాదు కద!

ఓ : (తమాయించుకొని) అదా! రాణిదే. హత్య చేశాను.

డె : (వెనకనుంచి) నిరపరాధిగా మరణిస్తున్నాను (మర ణిస్తుంది.)

ఎ : మీరేనా ? మహాప్రభూ ! (ఆక్రందిస్తూ) వజ్ర హృదయులు.

ఓ : హత్య చేయలేదు. తనన్న తానే చంపుకుంది, కాసి యోని వలచి. నీ భర్త ఋజువుచేశాడు.

ఎమి : అయ్యో ! నా భర్తా ! మహాద్రోహం. హత్య ! ప్రజలారా ! హత్య.

[ఓలాడ్ లినో, ఇయాగోల - ప్రవేశం]

లాడ్ : సేనాని, ఆ విచారం !

ఎమి : ఇయాగో, వచ్చావా ? నువ్వా ! రాణి కాశియోని వలచిందని చెప్పావా ఓథెల్లో సేనానికి?

ఇ : నా సందేహం వెలిబుచ్చాను. అది నిర్ధారణ క్రమ క్రమగా అయింది. సరేగాని యిక్కడినుంచి తక్షణం వెళ్ళిపో ఇంటికి.

ఎమి : ఛా ! ద్రోహి. నా రాణి హత్య చేయబడగా, నేను పోతానా ?

అందరు: ఘోరం.

ఎమి : ఈ దుఃఖం భరించ లేను. ఆత్మహత్య శరణ్యం.

ఇ : అయ్యో ! నా భార్యకి మతిభ్రమణ. ఎమిలియా! (గర్జిస్తూ) పోతావా, పోవా?

ఎమి : మహనీయులారా ! ఈ అకారణ దౌర్జన్యం చూడండి భార్య అయినంతమాత్రాన మాట్లాడే హక్కే లేదా ?

ఓ : హా హా హా !

ఎ: ఛీ! విషపు నవ్వు-దుష్టప్రేలాపన.

ఓ: ఎమిలియా! అనుభవరహితంగా నిందించకు— కాసియోదగ్గర నా ప్రణయకానుక రుమాల చూశాం. యింకా ఏం వివరించి చెప్పాలి!

ఎ: ఇయాగో నేను ఆరోజు నీ కిచ్చిన రుమాలా! అయ్యో! దైవమా!

ఇ: నోర్మూయ్! నీచురాలా! బుద్ధి తెచ్చుకొని ఇంటికి నడు. ఊఁ.... (పొడవబోగా)

లా: ఛీ! స్త్రీపైనా నీ కత్తి! ఆగు.

ఎమి: పొడవనీయండి - బ్రతికి ఏం బావుకోవాలి? ఓ మందమతీ! మూఢుడా, ఒథెల్లో! ఆరుమాల యియాగో కోరికపై నేను దొంగిలించి యిచ్చాను.

ఇ : ఓసీ! అసత్యవాదీ!

ఎమి : దాన్ని కాసియో యింటిలో పడవేసి ఈ కుట్రకు కారకుడైనాడు.

ఓథె : ఆఁ ఇదా? ఓరీ యియాగో, పయోముఖ విష కుంభమా! నిలువునా తహా మారుస్తా పిరికిపందా! (యియాగో వెంట దూసిన కత్తితో దూకగా, అతడు పక్కవాటుగా ఎమిలియాను పొడిచి, పరుగెత్తుకు పోతాడు.)

లాడ్ : ఆఁహా ఎమిలియాకి ప్రాణాపాయం! ఎవరుగా— పట్టుకోండి ఆ దుర్మార్గుణ్ణి.

ఎమి : ఎమిలియా! నిశ్చింతగా ఆనందమయులోకంలోకి పోతున్నాను. లేవు ఆలోకంలో యీ గాయాలు.

వో: ఆహా, వంచన!—జీవితాన్ని బలిచేసుకున్నావు— (వెర్రిగా) ఏది న్యాయం—ఏది ప్రేమ!

ఎ ; ప్రభూ! రాణీదగ్గరికి పోతున్నాను. (విషాద గానం)

నా సఖి పాడిన ఆనాటిపాట వినవస్తోంది—

(మరణిస్తుంది)

వో; ముగిసింది నా జీవయాత్ర!—పిశాచాల్లారా! నన్ను పీక్కు తినండి. ప్రళయాగ్ని, నన్ను భస్మీపటలం చెయ్యి—ప్రేయసీ—రాణీ—ఈ పాపిని చూడ గలవా? మన్నించగలవా?—నా దేవతా!

ప్ర వే శం :

[బంధితుడైన ఇయాగో, లాడ్వికో.... కాసియో]

ఓ: పిశాచి ఇయాగో,వచ్చావా....పొడుస్తాడు(ఆక్రందన)

ఇ : గాయపడ్డాను, ఇంకా మరణించలేదు.

ఒ : పాపీ, మరణించడం సుఖం....ఏ మరణం ఎమిలియా, డెస్డిమోనా పొందారో ఆ మరణం నిత్య శోభితం—నువ్వు చచ్చిపోరాదూ— నీ పాపాలన్నీ

విస్మరించి....కుళ్ళిపోయి— జీవించు — ఆదర్శం అని నమ్మిక చేసిన ఘోరం చరిత్రలో మరొకటి వుంటుందా?

(విలపిస్తాడు)

లా: ఈ పాపి తప్పిదాలు చెప్పుకున్నాడు — కాసియో డెస్టిమోనాల ప్రేమగాథ, కల్పించాడు డెస్టిమోనా ప్రేమకు ఎర చేసి, అమాయకుడైన రోడిరిగోని హత్య చేశాడు దోపిడీచేసి.

కా: ప్రభూ— ఈ కాసియోని సైతం తుదముట్టించ దలచాడు. ఇయాగో....మానవజాతి నీపుట్టుకతో కళంకం చెందింది.

ఇ; తెలుసుకున్నది తెలుసుకున్నారు. నానుంచి యింక ఏమీ తెలుసుకోలేరు—

వో; కాసియో—మిత్రులారా! ఒక్క విన్నపం; ఈ

వ్యధిత హృదయంతో నేను జీవించలేను—ఏదో దేశానికి చేయగలిగిన సేవ చేశాను అదంతా గత చరిత్ర. ఒకనాడు నా ప్రస్తావన వచ్చినప్పుడు— ఏమీ దాచకండి. జరిగింది జరిగినట్లు వివరించండి. నేనూ ప్రేమించాను. కాని—ఆ ప్రేమ గులాబీ వాసన చూడలేక పోయాను. ముల్లు కాఠిన్యాన్ని చవిగొన్నాను — కానీ, నా ప్రేమకి హద్దులు లేవు. డెస్డిమోనా కళంకం భరించలేను... ఆమె కీర్తి కోసం ఆమెను హత్యచేశాను. ఆమె అమరురాలు. నేను హంతకుణ్ని. కాని నాలో స్వార్థం ఒక ఆశ యం కోసంగాని, నాకోసం కాదనే నా విశ్వాసం. ఆ విశ్వాసం కోసమే నేనూ మరణించాలి. ప్రియా, ఒక నవవధువువి నువ్వు. పరితాపాన్ని నౌకని చేసి ఈ కన్నీటి సముద్రంలో నీ స్వర్గ ద్వీపానికి వస్తు న్నాను—ఈ నూతన వరుడు, అనుమాన పీడితుడు కాడు—ప్రియా.

(పొడుచుకొని మరణిస్తాడు)

కా; హా, ప్రభూ!

లా; (ఉద్వేగంగా) ఇయాగో—నీచాతి నీచుడా—నీ ఈర్ష్యకి హద్దులు లేవు—ఓ ఈర్ష్యా!....ఈ స్వరూపాన్ని దాల్చావా? నీకేం శిక్ష విధించాలి? .... (ఆగి వికటంగా నవ్వి) అవును—అసలు నీకు విధించాల్సిన శిక్ష వుందా, ఈ లోకంలో!

# తమ్ముడు

పాత్రలు :

* విమల — అక్క
* రవి — తమ్ముడు
* శోభ — రవి స్నేహితురాలు
* సుధ — విమల పెంపుడు కూతురు

# తమ్ముడు

## ప్రథమాంకము

[రోగి వెంకయ్య గది - మూలుగుల సవ్వడి.
గోపీ సపర్యలు చేస్తూ గదిలో]

వెంక : (ఆయాసంగా) అబ్బా.....మళ్ళీ నెప్పులో పోటు వచ్చిందిరా!...నాపని అయిపోయిందిరా అబ్బాయ్.

గోపి : (దీనంగా)...కాదు నాన్నా...నువ్వు మరీ నిస్పృహ చెందితే, నా కెవరున్నారు?...ఇదిగో...డాక్టరుగా రిచ్చిన మాత్రలు మళ్ళా వేసుకో...

వెంక : (నిస్పృహగా) ఆఁ...ఇంకా ఎందుకురా అవన్నీ!...ఇంకా ఎందుకు డబ్బు బూడిదలో పోయటం!..ఎలాగూ బతకనుగదా?... (తేరుకుంటూ)......అమ్మాయిని రమ్మనమని టెలిగ్రాం యిచ్చాను...ఎన్నో జాబులు వ్రాశాను అంతకుముందు... (విచారంగా) చివరికి దాన్ని చూస్తానో లేదో?...

గోపి : దానికి ఎన్ని పనులున్నయ్యో?...బహుశ ఈ బండికి వస్తుందనుకుంటూ...

వెంక : ఏమో?...అయినా ఆ త్రాష్టుడు దాన్ని పంపొచ్చాడూ!...ఆ బంగారపు బొమ్మని రాక్షసుడికి కట్టబెట్టానురా? ..(ఆయాసంగా)... ఈ పాపఫలితం నన్నెప్పుడు పీడిస్తూనే వుంటుంది...

గోపి : (అదుర్దాగా)...నాన్నా...ఈ సమయంలో ఇవన్నీ మనస్సుకి తెచ్చుకొని...కుమిలి పోవట మెందుకు?..

వెంక : నా కింతకంటె ఆలోచించాల్సిన సమస్యలు ఏవి బాబూ?... (ఉద్రేకంతో) నా సంతానం... నేను ఊహించుచున్న కలలు...అన్నీ.... (ఆయాసంతో కళ్ళు మూసుకుంటాడు.)

(వాకిట్లో బండిచప్పుడు. .)

ఒకగొంతు : ఒరే... అబ్బీ...సామాను లన్నీ లోపలికి తీసుకురా ..

గోపి : (సంతోషంతో)...అదిగో...అదిగో......అక్కయ్య వచ్చింది...(సరుగెత్తి)...... ఇప్పుడేనా రావడం అక్కయ్యా—వెయ్యేళ్ళాయుస్సు !...

విమల : (ఆత్రంగా) సరేగాని...నాన్నకి ఎలావుందిరా... గోపీ...(వెంకయ్యను సమీపించి)...నాన్నా...విమలని వచ్చాను...

వెంక : (మెల్లిగా) వచ్చావా. అమ్మా...ఇంతకీ ఈ కాస్త అదృష్టమన్నా దేవుడిచ్చాడు...బాగున్నావా తల్లీ..

విమ : నాకేం నాన్నా...ఎంతో సుఖంగా వున్నాను...

వెంక. మీ ఆయన ఏడీ?...( ఆ( ఎందుకు అడగటంకూడా?

విమ : ఆయనకేవో తొందరపను లున్నాయన్నారు...... నాన్నా...

వెంక : ఇంతకన్నానా?...అయినా నా పిచ్చిగాని వాడెందుకొస్తాడు!...నా దగ్గరమాత్రం ధనరాసులు మూల్గుతున్నాయా ? పట్టుబట్టటానికి...ఇంతకీ గోపి...ఒకడున్నాడుగా...

విమ : అదంతా ఎందుకు చెప్పండి... ఇప్పుడు మళ్ళీ!...

వెంక : వాడికి... గోపికి...తల్లిలేదు కదా!...ఇంక నేను లేక వాడు ఎల్లా బ్రతుకుతాడు?... ఇదిగో .. ఇకనుంచి వాడికి (గద్గదముగా) . తల్లివి నీవేనమ్మా ..

విమ : వాడి భారం నా కొదిలిపెట్టు నాన్నా.. నాకు శాంత ఎంతో వాడూ అంతే...

వెంక : (కుమిలినట్లు) అమ్మా .. దేవుడు బాధపడటానికి హృదయం యిచ్చాడు కాని తినడానికి నీకు తిండి ఇవ్వలేదే...

విమ : హృదయ సంతృప్తిలేని డబ్బు ఎందుకు నాన్నా...నాకు ఆ విచారం ఎప్పుడూ లేదు.

వెంక : (ఆయాసంతో) నువ్వెంత సుఖపడుతున్నావో నిన్ను చూస్తే తెలుస్తుందమ్మా... వేరే చెప్పాలా?...ఒక్క నగ నాణ్యం...ఏమీ లేవు. అవును ఎందుకుంటయ్?... ఎప్పుడూ ఆ రాజామణి ఇంటికి అర్పణచేస్తుంటే వాడు.

విమ : నాన్నా...ఆయన మీ దృష్టిలో అంత మంచివారూ కాకపోవచ్చు . అయినంతమాత్రాన నా దృష్టిలో అవాలని లేదు...ఆయన్నేమీ అనకండి ..

వెంక :(నిస్పృహగా నవ్వుతూ). .అవును .అనను...పతివ్రతా శిరోమణివికదూ .అబ్బా ..అయిపోయింది.

(మూలుగుతూ ..)

విమ : (ఆత్రంగా) గోపీ . గోపీ...మందు.... తెర వచ్చింది.... డాక్టరుని పిలు....

విమ : (కష్టంగా) వ... ద్దా... ఇ.... లా.... రా...గోపీ... అక్కయ్య ఇంకనీకు

విమ:నాన్నా...నాన్నా...ఇటుచూడు...గోపిని నాకియ్యి...
వాడి సంరక్షణే నా జీవితాశయం

వెంక.: ధన్యుణ్ణి అమ్మా...ఇదిగో...గోపి... నీ కొడుకు నీ
సర్వస్వం...అయిపోయింది...అబ్బా...

విమల
గోపి } ఒకేసారి నాన్నా...నాన్నా...

—:౦:—

## ద్వితీయాంకము

[ ఒకనాడు గోపి శాంత ]

(విమల ఇంట్లో)

శాంత : మామయ్యా ఆడుకోటానికి రావటా? ?...

గోపి : (చిరాగ్గా) నన్ను పలకరించవద్దు...

శాంత : (బింకంగా) ఎందుకన్నా అంతకోపం?... నువ్వు
లెఖ్కలు చెయ్యకపోవడం నా తప్పేనా ఏమిటి ?...

గోపి : మాష్టరు నన్ను కొడుతుంటే... ముసిముసినవ్వులు
నవ్వాలా మేం ... ఎక్కిరింపులు కూడా మరి...

శాంత : ఊరికే అన్నాను... గోపీ......

గోపీ : ఎందుకు శాంతా... నాన్న పోయిందగ్గిరి నుంచి...
ఆటల మీద ధ్యాసే లేదు.

శాంత : తిండి మీద కూడానా ?

గోపి : పోవే, పరిహాచకాలు... నేను రాను ఏమన్నా
గాని...

శాంత : రాకపోతేనా అమ్మతో చెబుతా తెలుసా !

గోపి : ఒట్టి మొండిదానివి- నన్ను బావ నీతో ఆడుకోవద్దన్నాడు. నేను మొద్దబ్బాయినట.

శాంత : (కోపంగా) నాన్నగారు అలా అన్నారా? నేను అడిగొస్తానుండు.

గోపి : వద్దు శాంతా! ఆయనకు అసలే నా మీద కోపంగా వుంది

శాంత : ఊఁ... అడగాల్సిందే...

(వెళ్ళింది)

నాన్నా... నాన్నోయ్...

రంగా : (విసుగ్గా) ఏమిటి గోల... పని చేసుకుంటుంటే.

శాంత : (షాక్ తిన్నట్లు) మరి...

రంగా : గారాబం ఎడవకపోతే అఘోరించరాదా?...

శాంత : నువ్వు ... (సంకోచంగా) మరే..

రంగా : చెప్పు...తొందరగా... నీ భిడియమూ... నువ్వూ

శాంత : గోపిని నాతో ఆడుకోవద్దన్నావా నాన్న...

రంగా : (వెటకారంగా) ఆ మొద్దు సన్నాసితో నీకు ఆటలు కూడానా ?

శాంత: (సూటిగా) ఆడుకుంటే ఏం నాన్నా?...

రంగా : (కఠినంగా) ఏమీవద్దు...వాడితో అసలుమాట్లాడ వద్దు...

శాంత: ఎందుకేం...?

రంగా : నేలకున్నానో లేదో... నీకు అన్నీ చెప్పాలా ఏం ?...

శాంత : (నిశ్చలంగా) వాడు ముద్దేం కాదు... మంచివాడు.

రంగా : వెళ్ళమంటుంటే... నా కొట్టే కోపం తెప్పించావా తంతాను... పో...

(శాంత ఏడుపు ఆపుకుంటూ పోతుంది.)

---

## తృతీయాంకము

(నారం రోజుల తర్వాత)

(విమల రంగారావు)

రంగారావు : (రోషంగా) మర్యాదగా చెబుతున్నా... ఆ చంద్రహారం యిచ్చేయ్...

విమల : మీరు నిదానంగా మాట్లాడండీ...మన గోలపిల్లలు కూడా వినటం దేనికి ?...

రంగా : (వెటకారంగా) వింటే విన్నారు ! ... నాకేం భయమా ?...

విమల : భయమూ అంటున్నారూ! లోకంలో ఎవ్వరూ ఎవ్వరికి అకారణంగా భయపడాల్సిన పనిలేదు.

రంగా : ఆ !... ఈ శ్రీరంగనీతుల కేమిలే... ఇవాళఅటో ఇటో తేలిపోవాలి.

విమల : నా దగ్గరున్నవన్నీ యిచ్చాను... (నెమ్మదిగా) నా మాట వినండి... మీరూ ఆలోచించండి... వాడి డబ్బు మనం ఖర్చుపెట్టటం న్యాయమేనా ?...

రంగా : ఆ చంద్రహారం వాడిదా యేమిటి !... మహా

రక్తం నోడ్చి సంపాయించాడా వీడు! మా అమ్మ సొమ్ము నీ కొస్తుందిగాని వాడికెలా అవుతుందేం!

విమల : రేపు, వృద్ధిలోకి రావాల్సినవాడు, పెళ్ళికావల్సిన వాడూనూ... మా అమ్మగూడా కోడలు పెట్టుకో వాలనుకుంటుం దేది...

రంగా : నీ పిచ్చిగాని, వాడు బట్టకట్టి పెళ్ళిచేసికొని మనల్ని అడిగినప్పుడూ!

విమల : నేనీ అన్యాయూని కంగీకరించను.... (యాదృచ్ఛి కంగా) ఒకవేళ యేదైనా తీసికున్నా వెంటనే సద్దె య్యాలి గాని వరసగా ఈ దోపిడి చెయ్యడం ఆత్మ విద్రోహం చేసికోవటమే...

రంగా : ఆరు నూరైనా, నూరు ఆరైనా నా మాటకు తిరుగు లేదు... మళ్ళా చేయి చేసికోవటం దేనికి?...

విమల : ఈ దెబ్బలేనా నా విశ్వాసాన్ని సడలించేవి?... హింసించండి, ఎన్నాళ్ళు హింసిస్తారో!...

రంగా : హింసిస్తానా నల్లిని రాచినట్టు రాస్తానా!...మాటల్లో చింతకాయలు రాల్తాయూ!... (చెయ్యి పట్టుకొని గుంజి) ఇమ్మంటుంటే...

విమల : (గాద్గదికంగా) నే నియ్యను ఏమన్నా గాని...

రంగా : యియ్యవూ!... చూస్తాగా!... దేవుడో స్తాడో! (పెనుగులాడిన చప్పుడు...)

"యియ్యి!...

యిప్పటికన్నా ..."

"నా మాట వినండి ... వద్దు

"ఈ జన్మకు వినేవాక్కసారే ! . . . కొట్టిన దెబ్బలకు
(అమ్మ ఏడుపు)

(ప్రవేశం శాంత)

శాంత : అమ్మా ! ఎందుకే ఏడుస్తున్నావ్ ? ... ఎందుకు నాన్నా! అమ్మను కొట్టటం ! ఒరేయ్ గోపీ ! చూడరా అమ్మని . . . .

(ప్రవేశం గోపీ)

గోపీ : ఏమిటీ బావ . యిదంతా . . . ఊరుకోవే అక్కయ్యా ! . . .

విమల : మీరంతా ఎందుకు . . . . పోండి.

రంగ : ఒచ్చారు న్యాయమూర్తులు . . . తీర్పు చెప్పటానికి . . . (గోపీని నెట్టి) చెప్పుకో మీబాబుకి . . .
(ఏడుపు ఊరుకోవే అమ్మా అన్న ఓదార్పు - వెళ్ళిపోతాడు)

## నాలుగవ అంకము

(శాంత, విమల)

శాంత : అమ్మా . . . అమ్మా . . . ఓ సారి యిక్కడికి తొందరగా రావే . . . .

విమల : ఎందుకే పని తెమలక చస్తుంటే_

శాంత : చూడమ్మా బావ గోపీని ఎలా కొట్టాడో . . .

విమల : ఏం నాయనా గోపీ! ఎందుకు కొట్టాడు బావ ?...

గోపీ : (ఏడుస్తూ) ఒక లెక్క తప్పు చేశానే (చూపిస్తూ) అందుకని ఎట్లా కొట్టాడో చూడు...

విమల : మా నాయనగా...ఏడవాక...

(ప్రవేశం... రంగారావు)

రంగా : ఏమిటీ గోలంతా...

విమల : చేసింది చాలక చెప్పొచ్చావు సిగ్గులేక...ఎందుకు చెప్పండి వాణ్ని ఊరికే కొట్టటం ... వాడి ఉసురు పోసుకోటం...

రంగా : ఆ మంచీ చెడ్డా నాకు తెలుసులే ... ఆ ఇనప్పెట్టి తాళం చెవ్విలా పారెయ్...

విమల : ఎందుకూ !...తీసికెళ్ళినదంతా చాలకా !...

రంగా : ఇక్కడ పెత్తనం నాది ... నా యిష్టమొచ్చినట్లు చేస్తా...చూస్తావేం... యియ్యి...

విమల : ఇదంతా రాజామణికి పొయ్యటానికేనా ?

రంగా : ఛీ...నోర్ముయ్...తిక్క తిరిగిందంటే దాన్ని సడి మింట్లో గూడా దంపుతా...ఇష్టముంటే ఉండు ... లేకపోతే వెళ్ళు...

విమల : మీ కంత కష్టంగా ఉంటే పోతాలేండి ... (గాద్గదికంగా) ఉంటేమాత్రం ఎవరికి సుఖమనీ...

రంగా : యీ యేడుపు మొహం నాముందరెందుకు...(ఒక్క-తోపు తోస్తాడు...)

విమల : రా గోపీ...రావే శాంతా !... (బాధగా) ఏం చేశానని, తండ్రీ, ఈ శిక్ష !...(వెళ్ళిపోతుంది.)

# అయిదవ అంకము

[12 ఏండ్ల తర్వాత...గోపీ ఇంట్లో...శాంత]

(రాధ ప్రవేశం)

రా : గోపీగారు వున్నారాండి?...

శా : (ఆశ్చర్యంగా) రండి...ఇలా కూర్చోండి...మీ పేరు...

రా : రాధ, దానికేంగాని?...అయితే లేదన్నమాటేగా...

శా : భోజనానికైనా రారా?... వేళఅయింది... నా కభ్యం తరం లేకపోతే ఇక్కడ వుండొచ్చు...

రా : మాకేం అభ్యంతరాలు వుంటాయిలెండి...యిప్పుడు. ..."అక్కర తీరినతర్వాత తెప్ప తగలెయ్యరా" అన్నారు.

శా : ఏమిటో నిష్ఠూరంగా మాట్లాడుతున్నారు?

రా : అసలు నా పేరే "నిష్ఠూరం..."

శా : ఏమిటో?...(విచిత్రంగా) నాకేం బోధపడకుండా వుంది...

రా : ఇప్పుడు అదంతా కలియబోయటం దేనికి లెండి? ... అసలు నాకికే శ్రద్ధ లేనప్పుడు ...

శా : మిమ్మల్ని అర్థంచేసుకుంటే చేతనైన సాయం చేయ డానికి ప్రయత్నించవచ్చు—

రా : గోపీకోసం ఎన్ని చోట్లు వెతికాను - తప్పించుకు తిరిగే నాకికి - ఒక నీతి వుంటేగా - చోటు అటుంచి —

శా : మీ ఇద్దరి ఆప్యాయత ఎంతో ఆనందంగా వుంది సుమండి - వింటుంటే !—

రా : పచ్చివెల్లుగా వుండనండి - ఎన్నో చెప్పాను - మన ఇద్దరికి పొత్తు కలవదని - కులం, సంస్కారం, డబ్బు-

దీనికి సంధి కుదరలేదు – అయినా "ప్రేమ-ఆశయం" అంటూ ఒక నినాదం లేవదీశాడు—

శా : గోపి యేనా ?

రా : ఆ (శ్రీ) గోపాలరావుగారు – అక్షరాలా – చిన్నారికి, అసలు మావాళ్ళకీ నచ్చినదాన్ని కాలేదు – నమ్మిన తనూ – మోసంలోకి దిగాడు – ఏం చెయ్యడం – రెంటికి చెడిన రేవడిలాగా అయింది నా కలాపం—

శా : అయితే గోపి మిమ్మల్ని ప్రేమించాడంటారు—

రా : ఇంకా మెల్లిగా అంటారేం ? – ఇప్పటికి నా పెళ్ళి – అయిదారుసార్లు వాయిదా పడింది – ఎప్పటికప్పటికి రిజిస్ట్రారుఆఫీసు అనడం – తప్పించుకు తిరగడం—

శా : (బాధగా) ఏం నాటకం ఆడుతున్నావు గోపీ – (కఠినంగా) ఇది ఆత్మవంచన కదూ—

రా : (ఆప్యాయంగా) మీరైనా చెప్పండి ? —

శా : (విముఖంగా) నేనా ?– అయినా పురుషప్రకృతికదూ! –

రా : నిజం – ఒకసన్నటయం వచ్చిందా – అంతే; సాధించాలి – నునుకేగాం – మరచిపోతారు —

శా : క్షమించండి – కాలేజి వయస్సు ఇలా ప్రేమకలాపంగా చేసుకోవాలి, ఎవీ స్థానం వదిలి పోయిందా గోపీ ? – ఇంక నా ఆశలన్నీ – బూడిదేనా ?

రా : మీ ఆశలు ఏమిటండీ ?—

శా : నేనేం చెప్పలేను – ఇంతకంటే "విషం" యిస్తే చావమని సంతోషంగా తాగుతాను – గోపీ – ఇదేనా

నీ - విజ్ఞానం - విచక్షణ - ఇంక నీదాన్ని కానన్న మాటేగా ?...

రా : నేను మొదటిదాన్ని కానన్నమాట - సరే - ఈ వంచకులకి లొంగుతానా ? - ఈ గర్భం - వీటితో - కోర్టులో చూస్తాను నా తడాఖా !—

శా : ఏమండోయ్ - రాధగారూ - నే నేదో ఆవేశంలో అన్నాగాని - అర్థాలు తీయకండి - గోపి కేం తెలీదు నిజంగా—

రా : అబ్బో - అలాగా - నిజం - ఎవ్వరికి ఏమీ తెలీదు - థాంక్సు - వస్తాను—

శా : రాధగారూ - రాధగారూ - ఒక్కమాట—

(రాధ వెళ్ళిపోతుంది)

## ఆఱవ అంకము

[ఆ రాత్రి ఆలస్యంగా - గోపి - ]

గో : (కోపంగా) శాంతా - శాంతా—

శా : ఏమిటి - మామయ్యా ?—

గో : ఏమిటేమిటి ? - సిగ్గు లేకుండా !—

శా : ఏం చేశానని ?—

గో : ఇంటి వాసాలు లెక్క పెడతానని అనుకోలేదు-రాధతో ఏవో కూతలుట - ఇంటికొచ్చిన వారిని అంత అవమానం చెయ్యడమూ ?

శా : నేనా ? - అవమానం చేశానా ?

గో : పైగా నటనకూడాను — కొద్దిలో జైలు తప్పింది — వాళ్ళా నీ మోచేతినీళ్ళు తాగుతున్నారనా నీ ధీమా ?—

శా : పెద్దవాడివైనావు ? — ఆలోచించి మరీ మాట్లాడు ? — నీకు నేను చెప్పాల్సిందేముంది ?—

గో : నావిషయం నేను ఆలోచించుకోగలను — మీరంతా మారి పోయ్యారు — లోకంలో నీతులన్నా — పైగా— నిన్ను పెళ్ళిచేసుకుంటానని బూంకరింపుకూడాను—

శా : పొరపాటే — కాని మావయ్యా — నువ్వెంత మారి పోయ్యావ్ ? అన్న మనస్సు కష్టపడుతుందని — అసలే నాన్న వెళ్ళగొట్టిం దగ్గర్నించి — మనస్సు — మన స్సులో లేదు—

గో : నన్ను గురించి ఒకళ్ళెందుకు కష్టపడటం ?—

శా : అదేమిటి అలా అంటావు ? — సిగరెట్లు అలవాటుచేసు కున్నావు — ! దుబారాఖర్చు — చదువంటే చిరాకు— ఏమిటో యిదంతా అయోమయంగా వుంది—

గో : చాల్చాలు — ఈ గ్గా నీతులు వినటానికి టైం లేదు

శా : అవును . సహజంగా వుండదు — ఇష్టమైతే గంటల కొద్దీ చర్చించవచ్చు — అసలా రోజులు జ్ఞాపకం వున్నయ్యా . మావయ్యా — వెన్నెల్లో — ఎన్ని కథలు — ఎంత నవ్వు—

గో : "కలలు !" — అంతా భ్రమ- త్వరగా తేరుకోవడం - నీ ఆరోగ్యానికి చాల అవసరం — (ఒక్కసారి) రాధ నాకోసం— ఇయిదింటికి వస్తానంది క్లబ్బుకి- వెళ్ళాలి —

శా : మంచికో చెడ్డకో — నీమేలు కోరేదాన్నికనుక చెబు
 తున్నా — ఈ స్నేహాలు నిన్నెక్కడికి తీసుకు
 పోతయ్యో? —

గో : కాలంతోపాటు మనస్సు మారుతుంది — అది జడపదా
 ర్థం కాదు—

శా : నిజం ఎప్పుడూ ఒకటే? - దానికి మార్పులేదు-

గో : ఏమిటి సొద ?

శా : నేను చెప్పేదంతా అదేకదూ ? కొత్తదాన్నిప్పుడు ?—
 ఏం చేస్తాం ? —

గో : నాకేం తెలీదు—ఎవరిదారి వారిది—వాళ్ళే నిర్ణయించు
 కోవడం — మంచిది — [వెడతాడు]

(విమల ప్రవేశం)

శా : (భారంగా) అమ్మా - గోపీని చూశావా ? - ఎలా
 మారి పోయ్యాడో? —

వి : అవునమ్మా — చూడకేం! — నాకూ కష్టంగావుంది —
 ఏం చెయ్యను ?

శా : నా కలలన్నీ కూలిపోయాయ్ !—

వి : ఎవరిపిచ్చి వారి కానందం — వాడి అధికారాన్ని మనం
 నిర్ణయించలేంకదా — అందుట్లో ఈ భారతదేశంలో
 వినుతికెక్కిన పురుషుడుకూడాను !! అతనికేంలోటు!—
 కొందరు పాలకులువుంటే — పాలితులు వుండడం అవ
 సరం — బహుశ సహజమేమో? — వాడి యిష్టప్రకా
 రమే కాని !—

శా : అమ్మా - ఈఇంట్లో - ఈ అవమానంతో వుండలేనే-
ఏదో చదువుకున్నాగా-మన కడుపుకు సంపాదించలేనా?-

వి : నాకేం తోచటంలేదు - అమ్మాయ్ -

శా : కాదమ్మా - నేను వెళ్ళక తప్పదు-

వి : మా గోపితో చెప్పావా ?-

శా : గోపీయే నాకు చెబితే !! - వెళుతున్నా - ఉద్యోగం రాంది - ఇంటికి రాను - (వెళ్ళింది)

వి : (ఆనుర్దాగా) ఆలోచించు శాంతా - శాంతా-

## ఏడవ అంకము

[మర్నాడు అర్ధరాత్రి]

(గోపి - రాధ)

గో : 'బ్యూటిఫుల్' అంటే నమ్ము !...కళ్ళు చెదిరిపోయాయ్ - నీ డాన్సుకి-

రా : నువ్వొ - అదేమిటో - చాలా బాగా చేశానోయ్- చాల 'టైర్' అయిపోయాను !-ఎలా ఇంటికెడతానో-

గో : నాన్సెన్స - యింకా ఇంటికే! - యిక్కడే వుండిపో-- రాత్రికి -

రా : ఓ పెళ్ళిగాని మగాడిదగ్గర అర్ధరాత్రి వుండటమే !-

గో : అబ్బ - కోతలు - డాన్సు చెయ్యంగాలేంది ? - కిస్ లియ్యంగాలేంది కూడాను!-

రా : మీవాళ్ళు వుండగానే ? 'అర్చకుడి వరం కావాలి! - అసలు...

గో : ఏమిటి సంబంధం ?-
రా : మీ అక్కగారు ఏమంటారో ? - మీ గార్డియన్!-
గో - ప్చ్! - దానిపనల్లా వంట జేసి వార్చడమేగా ?-
(విమల ప్రవేశం హఠాత్తుగా)
వి : ఈనాటికి - (ఉద్వేగంగా) - మాటలక్క నయ్యాయా -
నాయనా ?-
గో : నీతో వాదించదలచలేదు-
వి: సరే-నా ఆశయం అర్థంచేసుకోలేనివాడవు వాదించలేవులే!-
గో : పోనీ! - ఆ బావదగ్గర వుండలేకపోయావా ? - స్వర్గ తుల్యంగా వుండేదిగా !-
రా : ఇదంతా ఒక ప్రిటెన్షన్ ! - అదీ అసలుకథ !-
వి : నీచానికీ ఒక హద్దువుంది - నీకు కావలసింది భౌతికం - నాకు మానసికం - ఒకటి అనుభవించేది , మరొకటి ఊహించేది !-
గో : ఇక్కడ ఎవ్వరూ - నన్ను బెదిరించనక్కర్లేదు-
వి వెళుతున్నా - నేను లేకపోవడంగా నీకు కావలసింది !-
గో : అర్థాలు తీసేవారికి అన్యాయాలు తక్కువా ?-
రా : మరే - అదంతా ఒక టెక్నిక్ -
వి : (పరధ్యానంగా) నాన్నా - సమయంవచ్చింది - నీ మాట నిలబెట్టటానికి నాప్రయత్నం చేశాను. నీకిచ్చే 'అంజలి' ఇదే - వాడిఆనందమే - నా ఆనందం !—
(వెళ్ళిపోతుంది) (కొంతనిశ్శబ్దం)
గో : (ఉప్పెనగా) అక్కయ్యా - నిన్ను వెళ్ళమనటంలేదు-

వి : (దూరాన్నుంచి) నాకు ఆశయం ప్రధానం. ఆదర్శం కాదు. స్త్రీలో దేహాన్నే కాదు - ఆత్మనుసహితం అర్పించే త్యాగంవుంది - తమ్ముడూ-

రా : (ఎక్కిరింపుగా) చాలా తెలివిగా మాట్లాడుతోంది—

గో : అక్కయ్యా-(హఠాత్తుగా)-అక్కయ్యా-(పోబోతాడు)

రా : (ఎదురుగానుంచోని వారిస్తూ (ఇంకా ఆ భ్రాంతి ఎందుకు ? - ఆ మనుష్యులువేరు - వారిలోకం వేరు-వారికీ మనకూ సమన్వయంలేదు - ఏమిటోయ్ - ఆ వెఱ్ఱిచూపు - ఇలా చూడు - గోపీ-

గో : (అయోమయంగా) అంతే ?-

రా : (బుగ్గలు సాగతీస్తూ) అంతేనయ్యా - అంతే - అబ్బ!-ఇప్పుడే మమతలోంచి ఈ లోకంలోకి వచ్చావ్ !-(లోపలికి తీసికెడుతుంది.)



# వీర వనిత

జోన్ ఆఫ్ ఆర్కు ఫ్రాన్సు వీర వనిత - నాయిక శిఖామణి. దేశ స్వాతంత్ర్యము నెదుర్కొని నిర్మూలించిన సంరక్షకురాలు. మూఢమతమును త్యజించి సత్యమార్గము నిర్దేశించ వెరువని తాత్వికురాలు.

స్వార్థపరులు, పదవీ వ్యామోహితులైన రాజకీయ వాదులు, సంకుచితులు, అపవిత్రులైన మతాచార్యులు సహజ కీర్తి ప్రతిష్టలచే వెలుగొందు జోన్ కన్య మనుగడ తమ స్వప్రయోజన విధానములకు ప్రతి బంధకముగా భావించి, అపరాధిని జేసి అంత మొందించిరి - కాని ఆమె అమరవాణి మానవాళికి చిరస్థాయిగ ప్రబోధము సల్పుచునే యుండును.

—। పాత్రలు ।—

జోన్ ఆఫ్ ఆర్కు — ఫ్రాన్సు పల్లెపడుచు

రాబర్టు — సేనాని

చార్లెసు — పరాసు రాజు

ఆర్చి బిషప్ — క్రైస్తవ మతాధిపతి

ఆంగ్ల రాయబారి; ప్రతీహారి తదితరులు.

# వీర వనిత

## మొదటి దృశ్యం

[రాబర్టు సేవనాని భవనం - ప్రవేశం జోన్ కస్య]

జోన్ : ప్రభూ! ప్రభూ!

(నిశ్శబ్దం)

(ఆవేదనతో) అయ్యా! ఇక్కడ ఎవ్వరూ లేరా?

[ప్రవేశం - సేవకుడు]

సేవ : ఎవరమ్మా నువ్వు? ఇంతరాత్రి ఎందుకొచ్చావు?

జోన్ : నేనా .... ఎవరైతే ఎందుకు ... సేనాని కోసం, దేశాన్ని రక్షించడానికి వచ్చాను.

సేవ : నువ్వా! దేశాన్ని రక్షించడానికి - ఫ్రెంచి సేనాని దగ్గరకా వచ్చింది - చిత్త చాంచల్యం కాదు గదా - అమ్మాయి -

జోన్ : (గంభీరంగా) ఇదే నా ఆజ్ఞ! సేనానికి చెప్పు.

(ఆ గంభీర స్వరంలోని ఉద్వేగాన్ని పసిగట్టి వెడతాడు - క్షణం నిశ్శబ్దం - అడుగుల చప్పుడు)

సేవ : లోపలికి రా - అమ్మా సేనాని అనుజ్ఞ అయినది.

[జోన్ అలంకరించి యున్న గదిలోకి ప్రవేశ పెట్టబడినది]

రాబ: (చలింపక) కూచో అమ్మాయి వచ్చిన కారణం - నీ పేరూ?

జోన్ : (ఉద్వేగంగా) ఫ్రాన్సుని రక్షించడానికి వచ్చాను. నా దేహంలోని ప్రతి అణువు ఉద్వేగంతో ప్రకంపిస్తోంది. దేశం ఆంగ్లేయుల దోపిడికి ఎర అయిన ఈ సమయంలో దేవతలు నన్ను రక్షించ మని ఆదేశ మిచ్చారు ఇంక ఆగను - ఆగలేను. సమర భూమికి సరిపోయే సైనిక దుస్తులు, అశ్వాన్ని అందజేయండి సేనానీ.

రాబ: (గంభీరంగా) నీ ఆదర్శం మెచ్చుకో తగిందే అమ్మాయి - కాని కార్యాచరణలోని సాధక బాధకాలు ఆకళింపు చేసుకోని దానిలా కనపడు తున్నావు! - అసలు నువ్వెవరూ? నీ పేరు చెప్ప లేదేం ?

జోన్ : నేనా? నన్ను దేవకన్య అనండి! పేరెందుకు? ఫ్రాన్సులోని శౌర్యానికి సజీవ నిదర్శనాన్ని!

రాబ: (విసుగ్గా) చెప్పవలసిన విధం అది కాదు.

జోన్ : నన్ను జోన్ కన్య అంటారు. ప్యారిస్ పశ్చిమ భాగంలో నివాసం,

రాబ: అశుభమూ, శుభమూ ఎరుగని వయస్సులో నీకీ పెద్ద మాటలు ఎవరు నేర్పారమ్మా? అందులో యుద్ధాలంటే భయం వెయ్యటం లేదూ?

జోన్ : (నిర్భయంగా) ధర్మ యుద్ధాలంటే భయ మెందుకు? దేవతలు నన్ను ఆశీర్వదించి ఈ అల్లకల్లోలం నుంచి దేశాన్ని కాపాడ మన్నారు. అందుకే మీ దగ్గరికి ...

రాబ: (కటువుగా) దేవతల్లో? దయ్యాల్లో? రాజాజ్ఞ లేనిదే నేను ఏదీ చెయ్యటానికి సంసిద్ధుణ్ణి కాను.

జోన్ : (చెటుకున్న) ప్రభూ! దేశం నాశనం కాబోతుంది. రక్షించమని, ఈ అనాథ ప్రజలని కాపాడమని మీ కే దేవతా సందేశం ఇవ్వలేదా?
(నిదానించి) అదుగో - ఆ స్వనము వినండి - ఎలా హెచ్చరించి ఉద్రేక పరుస్తుందో?

రాబ: ఎందుకు అలా మోకరిల్లుతావు? లే - నిదానంగా ఆలోచించు. నాకు మనస్సు పూర్తిగా చలించింది.

జోన్ : (జాలిగా) తండ్రీ! నన్నర్థం చేసుకోండి. ఒక్క- సైనికురాలుగా యుద్ధం చేయడానికి అనుమతించండి. చిరునవ్వుతో నా వంకకి చూసి విజయీభవ - అనండి. అంతే చాలు.

రాబ: (చలించి) అమ్మా! నిన్ను యుద్ధానికి పంపించడానికి మనస్సు రావడం లేదు. ఎంత సుకుమారివి? నీ కళ్ళల్లోని కారుణ్యాన్ని చూసి ఎలా పంపగల నమ్మా? అందులో స్త్రీ యుద్ధం చేస్తుందట? ప్రజలు విముఖత చూపించవచ్చు. ఒకవేళ నేను వప్పుకున్నా అవమానితుణ్ణి అవుతాను కదా?

జోన్ : ప్రజలు ఉద్రేక పూరితులు. నిజాయితీ కంటె సంఘ కట్టుబాట్లకే ఎక్కువ విలువ యిస్తారు. క్రీస్తుప్రభు త్యాగం కంటే వేరే నిదర్శనం ఏం కావాలి, ప్రభూ !

రాబ: అమ్మా! నా హృదయం ఆనందంతో పొంగి పోతున్నది. ఫ్రాన్సు దాస్య విమోచనానికి, నీ లాంటి ఒక్క మహాశక్తి చాలు.

జోన్ : ప్రభూ! దైవం మీలో తెచ్చిన మార్పుకు కృతజ్ఞురాల్ని. కాలాతీతం కాకుండానే పరికరాల్ని సమాయత్తం చేసుకుంటే మంచిది.

రాబ: అమ్మా! మతాధిపతి ఆశీర్వాదాన్ని నువ్వు స్వీకరించాలి. యుద్ధరంగంలో నువ్వు విజేతవై ఫ్రాన్సు పతాకాన్ని పునః ప్రతిష్ఠిస్తావని నా దృఢ నమ్మకం.

జోన్ : (పులకితయై రాబర్టు చేతిని ముద్దు పెట్టుకుంటుంది) నాకు లోకంమీద విశ్వాసం కుదిరింది. నా ప్రజల కోసం వెయ్యి జన్మలైనా యెత్తి - స్వాతంత్ర్యం కోసం, సత్యాదర్శం కోసం పోరాడుతాను. మహాత్ముల త్యాగ దీక్షయే నా జీవితానికి మార్గదర్శి. హాని సాంధకారంలో నుంచి వెలుగులోకి తెచ్చే ఆశా జ్యోతి.

రాబ: (ఆనందంతో) పరికరాల్ని సిద్ధం చేశాను. ఆ మహత్తర ఆశయమే నీ విజయానికి నాంది అగుగాక!

జోన్ : శెలవు ప్రభూ! చార్లెసు రాజును సింహాసనాసీనుణ్ణి చేసి కాని అగుపడను. విజయమో! వీర స్వర్గమో!

రాబ: (కంపిత స్వరంతో) సత్యాన్వేషులైన మహాత్ములు లోకహింసకి గురైనారు. నీ భావిని గురించి నా కెంతో సందేహం వుంది. అయినా ...

జోన్: (గంభీరంగా) అయ్యా! సత్యాదర్శం ముందు మరణం లెక్కలోనిది కాదు. చావునైనా ప్రజల కోసం త్యాగంగా భావిస్తా.

రాబ: (ధైర్యంగా) నీకు విజయం కలుగు గాక! ఫ్రాన్సు చరిత్రలో నీ పేరు చిరస్థాయి అగుగాక! ఏసు ప్రభువు నిన్ను సదా గాపాడుగాక!

* * *

## రెండవ దృశ్యము

[పరాసు రాజు చార్లెసు రాజ మందిరం]

ఆర్చి: అబ్బా! యుద్ధవార్తలు చాలా భయాన్ని కలిగిస్తున్నాయ్. ఆంగ్లేయులు నావికా దళంలో ఒక్కలాగ తుపానులాగా విరుచుకు పడ్డారు, వారం రోజులలో ఆరు పట్టణాల్ని భస్మీపటలం చేశారు. ఎంత మంది చచ్చిపోయారో? ఎంతమంది స్త్రీలు తమ భర్తల్ని, పిల్లల్ని కోల్పోయారో? ఎంత మంది క్షతగాత్రులై .... అలమటిస్తున్నారో? (విచారంగా) ఎందుకో నాకు ఫ్రాన్సు భవితవ్యం అంధకార

పూరితంగా వుంది. నా హృదయంలో ప్రజ్వరిల్లే అశాంతి జ్వాలలు నన్ను దహిస్తున్నాయేమో? (మోకరిల్లి) ఏసుప్రభూ, నా దేశాన్ని కాపాడు. నాకు శాంతిని ప్రసాదించు.

[ప్రవేశం: చార్లెసు]

చార్లెసు: గురువర్యులకు అభివాదాలు.

ఆర్చి: రాజకుమారా! నీకు శుభం కలుగుగాక.

చార్లెసు: ప్రభూ! యుద్ధవార్తలు యిప్పుడే చారునిద్వారా విన్నాను. ఆర్లియన్సు పట్టణం కొన్ని గంటలలో మన పట్టు తప్పిపోతుంది. పరాసు సేనలు ఆత్మబలాల్ని నైతికబలాన్ని కోల్పోయాయ్. చిందర వందరగా పలాయనాన్ని చిత్రగిస్తున్నాయ్. సరిగా క్రమశిక్షణ ప్రకారం ప్రవర్తిస్తున్నట్లు లేదా?

ఆర్చి: చార్లెసు రాజును అనుసరించే ప్రజల నడవడిక ఆధారపడి వుంటుంది. నువు కత్తిపట్టి నీ సైన్యాన్ని నడిపి యుద్ధం చేయనినాడు, నీకు రాజార్హత వుందని అనుకోలేను. నీ పూర్వీకుల చరిత్ర నిన్ను సిగ్గుపడేట్లు చేయటంలేదా, రాజా!

చార్లెసు: (భయంగా) అవును గురువర్యా! కాని నేను యుద్ధప్రియుణ్ణికాదు. శాంతి ప్రియుణ్ణి. అంత మాత్రంచేత నాకు సింహాసన అధికారాన్ని మీరు కించపరచడం అనుచితంకాదు.

ఆర్చి: యువరాజా! దేశ స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లి నప్పుడు రాజులకు, మతాధిపతులు ఆదేశించడం సహజం. నువ్వు యుద్ధంలో నీ ప్రజలకి అండగా నిలిచి శత్రువులని ఎదుర్కోలేనినాడు. నేను అవమానంచేత తల వంచుకుంటున్నాను.

చార్లెసు: అయినా నా కెందుకో యుద్ధం అన్న శబ్దం నా గుండెల్లో వికృతంగా, ఘోరంగా ప్రతిధ్వనించి కల్లోల పరుస్తుంది. దేవా! నా రాజ్యాన్ని రక్షించే వారు లేరా?

ఆర్చి: నీకు రాజ్యకాంక్ష వుంటే నా మాట విను. ఫ్రాన్సులో సింహాసన ప్రతిష్ఠాధికారం నా చేతులో వుందని జ్ఞాపకం చెయ్యనీ! అందుల్లో నీ ఆస్తిని దుర్వినియోగం చేసుకున్నావు. నీ శీలానికి స్త్రీ ద్వారా కళంకితం చేసుకున్నావు చర్చి సిద్ధాంతాల ప్రకారం నీ వ్యభిచారం, త్రాగుడు అన్నీ నిషిద్ధం! అయినా కరుణతో ఇంతవరకు సహించాను. ఇంకెన్నాళ్ళు సహించగలను?

చార్లెసు: (మోకరిల్లి) గురుదేవా! నాకు మీరే శరణ్యం.

[ప్రవేశం: సేవకుడు]

ప్రభూ: తమ దర్శనార్థం ఎవరో కన్య ఎదురుచూస్తోంది. సైనిక దుస్తులలో వున్నది. రాబర్టుసేనాని దగ్గరి నుంచి, సందేశం తెచ్చినారట.

ఆర్చి: వెంటనే ప్రవేశపెట్టు.

[ప్రవేశం: జోన్ కన్య]

జోన్: యువరాజులకు, గురుదేవులకూ నా వినయపూర్వక నమోవాకములు.

ఆర్చి: అమ్మాయి శుభం. నీ రాకకు కారణం?

జోన్: దేవా! రాబర్టుసేనాని ఆదేశానుసారంగా దేశభక్తి ప్రపూరితనై మీ ఆశీర్వాదంకోసం వచ్చాను. ఇదిగో సేనాని మీకు అర్పించమనిన జాబు.

ఆర్చి: (నిశ్శబ్దం చదువుకొని) మంచిది జోన్. ఎవరి ప్రేరేపణ వల్ల నీకీ ఉద్రేకం కలిగిందో తెలుసుకోవచ్చునా?

జోన్: సాయంకాలమప్పుడు గొర్రెలని ఇంటికి తోలుకొని పోతున్నప్పుడు. మందమారుతం. నా మీదికి ప్రేమగా వీచినప్పుడు, ప్రకృతిమాత తన గంభీర్య సహజ సౌందర్యంతో తొణికిసలాడే ఆ నిర్జన ప్రదేశంలో జలకన్య ఆ పచ్చటి బయళ్ళలో స్వేచ్ఛగా విహరించేటప్పుడు, సూర్యుని బంగారు కిరణాలు జాలిగా నా నుంచి సెలవు తీసుకునేటప్పుడు దేవతలు దేశాన్ని రక్షించమని ఆదేశించినారు.

చా: జాన్ నువ్వు మాట్లాడేదాంట్లో అర్థం గ్రహించావా? దేవతలు మాట్లాడటమే జరిగితే, అది మతాధిపతిపతుల వినా మరొకరితో జరగదని తెలియదా!

జోన్: యువరాజా! నేను అనుభవించనది, చూడనిది ఎలా మాట్లాడగలను మీ సమక్షంలో? నా

హృదయారాటాన్ని అవగాహన చేసుకోడానికి ప్రయత్నించండి ప్రభూ!

ఆర్చి: అమ్మాయి జాన్ అనుభవంలేని పసిపిల్లలా, మతి భ్రమణం కలిగినా వ్యధిత హృదయురాలివలె మాట్లాడి నీ నిర్భయత్వానికి అమాయకత్వానికి ఒకవైపు జాలి, చర్చిని అతిక్రమించే నీ మాటలకి విచారం కలుగుతున్నాయ్?

జోన్: దేవతలు ప్రతి హృదయంలోనూ వున్నారు. కాని వారు ఘోషిల్లే సత్యాన్ని ఆకళింపు చేసుకోడానికి పరిస్థితులు నిమగ్నత కావాలి. ఆశీర్వచనం లభించిన నాకు ఇంక అపజయ భయము లేదు. పరాసు వీరుల ప్రతిభ ద్విగుణీకృతంచేసి ఆంగ్ల శత్రు మూకల్ని వీరమాతవలె చెండాడుతాను. చార్లెసు రాజును సింహాసనంమీద పునఃప్రతిష్టచేసి దేశ గౌరవాన్ని, జాతి గౌరవాన్ని మారుమ్రోగిస్తాను.

ఆర్చి: అమ్మా నీ అకుంఠిత దేశభక్తి, ఆత్మ విశ్వాసం నన్ను విభ్రమ పరుస్తున్నయ్.

సేవ: (ప్రవేశం) ప్రభూ! ప్రభూ! ఆంగ్లసేనలు అర్లి యన్సు ఆక్రమించినవి. పట్టణం పట్టణం అగ్ని జ్వాలలకి ఆహుతి అవుతోంది. సైనికులంతా లొంగి పోయ్యారు. ఎచ్చట చూచినా దోపిళ్ళు, అరాజకం హింస, మానభంగం జరుగుతోంది.

(హాహాకారాలు, అలజడి ధ్వని)

ఆర్చి: అమ్మా! జోన్ నీ మత సిద్ధాంతాలు నాకు పట్ట రీత్యా అంగీకారం కాకపోయినా రాబర్టు సేనాని అభీష్టాన్ని అనుసరించి దేశ కల్లోలాన్ని అర్థం చేసుకుని, ఇదిగో నా శుభాశీస్సులు యిస్తున్నాను విజయీభవ.

జోన్: తండ్రీ! కృతజ్ఞురాల్ని చార్లెసు యువరాజా ఇదే నా ప్రతిజ్ఞ. మిమ్మల్ని సింహాసనాధిష్ఠులను చేయడమో లేక మరణాన్ని కౌగలించుకోవడమో జరుగుగాక!

చా: జోన్ నువ్వెందుకో నాకిప్పుడు దేవ దూతలాగా అగుపిస్తున్నావ్. నీ ముఖం చుట్టూ వెలుగొందే ఆ కాంతిపుంజాలు నిన్ను వీరమాతగా తలపింప చేస్తున్నయ్. ఇదే నా ఆజ్ఞ. జోన్ నువ్వు పరాసు సైన్యాలకి ఆధిపత్యం వహించు. రణరంగంలో చిచ్చరపిడుగువై మా జోహారులు అందుకో. జోన్ ఇప్పుడెందుకో నాకు ఆనందంగా వుంది.

జోన్: ఇదే నా వినయాంజలి ప్రభూ!

చా: ఎవరక్కడ?

సేవ: చిత్తం ప్రభూ!

చా: ఇదే నా ఆజ్ఞగా సర్వసైన్యాధ్యక్షుడికి చెప్పు. ఈ క్షణంనుండి యుద్ధం ముగిసేవరకూ పరాసు వీరమాత జోన్ ఆధ్వర్యం వహిస్తుందని.

సైని: దేవా! ఉత్తరువు.
(కోలాహలము వీరమాతకి జై. పరాసు దేశ భావి భాగ్యవిధాతకు జై.)

♦ ♦ ♦

మూడవ దృశ్యం.

(జోన్ కన్య నాయకత్వాన రాజభవనము, రాజు చార్లెసు, ఆర్చి బిషప్ దూరంనుంచి వీరమాతకు జై అన్న కోలాహలం.)

చా: దేవుడు మనల్ని కాపాడి, దేశాన్ని రక్షించాడు. జోన్ దైవస్వరూపిణివి.

ఆర్చి: ఇంక శత్రుబాధ తప్పింది. కాని....

చా: ఆర్యా! ఇంకా.... కానీ.... అంటారేం?

అర్చి: మెల్లిగా – అదికాదు. జోన్ మత ప్రచారం ప్రజలలో సంచలనం కలిగిస్తోంది. ఈ భూత వాక్కులు విన్న ప్రజలు ఇంక చర్చిమీద మత గురువుమీద భక్తి నిలుపుతారా! రాజా!

చా: అవును. అది అంత మంచిపనికాదు.

ఆర్చి: (రహస్యంగా) – మెల్లిగా అంటారేం? కొన్నాళ్ళయేటప్పటికి ప్రజల్ని పూర్తిగా వశం చేసుకుని, మీ సింహాసనానికే ముప్పు తెచ్చేటట్లు వుంది.

చా: నిజంగా!

ఆర్చి: యువరాజా! దేశంలో అరాచకం రావడం నాకిష్టలేదు.

చా: మీ అభీష్టం.

ఆర్చి: జోన్ ప్రచారాన్ని అరికట్టాలి. లేకపోతే ఆమె మనల్ని అరికట్టుతుంది.

చా: ఆ భారం మీకే వహించండి.

ఆర్చి: జోన్‌కన్యని రహస్యంగా పదవీచ్యుతినిచేసి ఎదురు తిరిగిన పక్షంలో ఆమెపై నేరారోపణ చెయ్యాలి.

చా: జోన్‌పైనా నేరారోపణ కూడానా.

అర్చి: అవసరమైతే తప్పదు. ప్రభూ! మత గౌరవాన్ని రక్షించడానికి ఏదీ అడ్డురాకూడదు. అది దైవశాసనం.

[ప్రవేశం: సేవకుడు]

సేవకుడు: ప్రభూ! ఆంగ్లేయ రాయబారి తమకోసం .... వేచియున్నాడు.

చా: ప్రవేశపెట్టు.

[ప్రవేశం: ఆంగ్ల రాయబారి]

రాయ: ప్రభువులకు, వినయాంజలి—

చా: మంచిది — మంచిది, రాయబారి, నీ ఆదేశం.

రాయ: ఆంగ్లప్రభువు, వార్విక్, తమకు సంధి రాయబారం ఆదేశించమని నారు.

చా: గురువర్యా—(మెల్లగా,) మీ అభిప్రాయం ....

అర్చి: సంధి షరతులు విని నిర్ణయించవచ్చు, రాజా—

చా : రాయబారీ, వినిపించు ....

రాయ: పరాసు దేశ ప్రభువులు, విక్రమశీలురునకు, చార్లెసు యువరాజులకు, ఆంగ్లప్రభుత్వాంతరపున వార్విక్ ప్రభువు చేయు విన్నపములు, స్వేచ్ఛా నౌకావ్యాపారము తీరమంతట కొనసాగించుకొనుటకును, రెండు పశ్చిమరేవులు వ్యాపార సౌకర్యము నిమిత్తము ఆంగ్ల ప్రభుత్వానికి ఇచ్చినపక్షమున, ఉభయపక్షములకు రక్తపాతం ఇంకా జరగకుండా యుద్ధం విరమింపబడును. ఆంగ్లప్రభుత్వం, చార్లెసు రాజుల యువరాజుగా అంగీకరించినది. ఇంక, ప్రజలలో మత విష ప్రచారం జరుపుతున్నజోను కన్యను, విచారణ సల్ప కోరుతున్నది.

చా : ఆర్యా, మీ నిర్ణయం?

అర్చి: నాకింకా రక్తపాతం జరగడం యిష్టలేదు, అయినా ఇంక మీ మీ రాజ్యం దక్కింది; గౌరవం దక్కింది.

చా : అయినా జోను విచారణ నాకు సమ్మతంలేదు.

అర్చి : లేదు యువరాజా, వెతికే తీగ కాలికి తగిలినట్లయింది. జోను వున్నంతకాలం మా హృదయానికి శాంతి వుండదు, దేశంలో, అరాచకం తప్పదు.

(సేవకుడు ప్రవేశం)

సేవ : ప్రభూ; జోను వీరమాత, మీకోసం నిరీక్షిస్తోంది.

చా : ఆర్యా ... ఆ విషయం—ఇప్పుడే జోనుతో తేల్చుకుందాం.

అర్చి : మంచిది - ప్రవేశపెట్టు-

జో : ప్రభువులకి అభివాదాలు.

చా : మంచిది, జోను, ఆ ఆసనాన్ని అలంకరించు-వచ్చిన పని?

జోను : (గంభీరంగా)-ఆంగ్లేయుల్ని దేశాన్నించి పూర్తిగా పారదోలండే పరాసు ప్రజల అభిప్రాయాన్ని లెక్క చెయ్యకుండానే, మీరు శత్రుపక్షంతో సంధిచేసుకోడం శోచనీయం - ఇది పరాసుజాతి తలవంపు ...

చార్లె: రాజ్యాంగ వ్యవహారాలలో జోక్యంచేసుకోవలసిన అవసరం - బాధ్యతలేవు.

అర్చి: అమ్మాయి - ఇంకో విషయం - నువ్వు నీ దేవతల అపభ్రంశ సందేశాలని ప్రజలలో ప్రచారం చేస్తున్నట్లు తెలుస్తోంది - దీనికి క్షమాపణ చెప్పుకోని-చర్చి కట్టుబాట్లకు లోబడితే నీకు భవితవ్యం వుంటుంది....

జోన్: (ఉద్వేగంగా) ప్రభూ - ఎంత ఘోరం - జాతివంచన చేయడంకాకుండా - ఆత్మవంచన చేసుకోమంటారా?

అర్చి: తప్పదు.

జో : అయితే ఈ సైన్యాధిపత్యం నాకు వద్దు - శెలవు-వెళ్ళిపోతుంది.

అర్చి : అగు - నీపై మత విద్రోహనేరాలకి ఏం సంజాయిషీ చెబుతావు? .... ఇప్పటికైనా పశ్చాత్తాపం పడతావా?

జో : నేను నేరస్థురాల్ని కాను. నేను అంగీకరించను...

అర్చి : యువరాజా - ఇంక శృతిమించిపోయింది- జోనుని ఖైదీని చేసి విచారించవలసిన అవసరంవచ్చింది.

చార్లె: జోను - నా మాటగా నీ తప్పిదాన్ని అంగీకరించు....

జో : చంపినా సరే - ఒప్పుకోను—

చార్లె : ఎవడురా అక్కడ- ఆమెను ఖైదుచేసి తీసుకుపో-

జో : (విచారంగా) చక్రవర్తీ! - ఇంత విద్రోహమా?

[వెళ్ళిపోతుంది]

చార్లె : రాయబారీ - సంధి షరతులు మా అంగీకారంగా చెప్పు -

రాయబారి: చిత్తం... రాజా....

♦ ♦ ♦

[నాలుగవ దృశ్యం]

[మత న్యాయస్థానము. చార్లెసు, ఆర్చిబిషప్, కానన్....]

కానన్: (పెద్దగా)-ఒడంబడిక ప్రకారము ఆంగ్లసేనలతరఫున రాజుకుబదులుగా వార్విక్ ప్రభువుయున్నూ, ఫరాసు ఆంగ్లరాజు తరఫున అర్చిబిషప్‌యున్నూ జోను అను ఇరువదివత్సర ప్రాయముగల ఫరాసు వనితపై, మాంత్రికురాలు మత విద్రోహిఅనే నేరాల్ని ఏకగ్రీవంగా అంగీకరించినారు గనుక ఆ విషయమై విచారణ నిమిత్తము జోను ఈ న్యాయస్థానమునకు తీసుకొని రాబడును - కారాగార అధికారీ,—

కారా: చిత్తం.... ప్రభూ—

కాన : ఖైదీని తీసుకురమ్మని—

కారా: చిత్తం....

[ప్రవేశం - జాను - నీరస స్థితిలో]

కాన : జోను - నీకు నిర్దేశింపబడిన ఆసనాన్ని అలంకరించు- విచారణలో పాల్గొనే ఆరోగ్యంవుందని భావించవచ్చునా?-

జో : దేవతల కటాక్షంవల్ల నాకింకా మనోనిబ్బరం క్షీణించలేదు! — మీ దయకు కృతజ్ఞురాల్ని.

కాన : నీ మీద మోపబడిన నేరాలు రెండు ... ఒకటి— మాంత్రిక మోసము — రెండు—చర్చి ఆజ్ఞా తిరస్కారము —

జో : (గంభీరంగా) - ఈ రెండు నేరములు నా సత్యాదర్శానికి విరుద్ధం గనుక అంగీకరించలేను.

కాన : ఇవి అంగీకరించడం అసన్న ప్రశ్న లేదు. ఇవి అసత్యాలు అని ఋజువు చేసుకోవాల్సిన అవసరం గురించు—యువతీ—

జో : నేను ఎటువంటి మంత్రాలు ఎరుగను - దైవ ఆదేశాన్ని ఎన్నడూ తిరస్కారం చేయలేదు.... దీనికి నా అంతరాత్మ సాక్షి—

అర్చి : అమ్మాయి ... జోను - నువ్వు నా పుత్రికవంటి దానవు - నువ్వు చూపిన సాహసానికి మేం అభినందిస్తున్నాం. కాని నీ విజయాన్ని దేవతల సందేశాలకి జతకలపడం, చర్చిమతానికే విరుద్ధం గనుకనూ

అశాస్త్రీయం గనుకనూ అది ప్రజలపతనానికి నాంది కాగలదని భావించటంవల్లనూ, మేము ఈ నేరాన్ని నీమీద ఆపాదించినాము.

జో : గురూ - సిద్ధాంతాలు కాలానుగుణ్యంగా మారకూడదా? - సత్యాసత్యాలు మానవ నిర్ణయాన్ని అధిగమించకూడదా?... మతానికీ ఆత్మవిశ్వాసానికీ వుండే అవినాభావ సంబంధాన్ని విస్మరించారా?

అర్చి : నేను.... మతాధిపతిని - యీ దేశంలో మతానికి సంబంధించిన యావత్తు నిర్ణయము నాద్వారా జరగవలసియున్నది ...

జో : (నిశ్చలంగా)-వసుదేవా, నిన్ను నా హృదయంలో నిర్మించుకున్నా! తండ్రీ, నాకు వివేకాన్ని, విజ్ఞానాన్ని ప్రసాదించు—ప్రభూ, నా కోరిక యీడేరింది. చార్లెసు యువరాజును సింహాసనాధిష్ఠుణ్ణి చేశాను. జాతిగౌరవాన్ని పోరాడి కాపాడాను — దీనదయాళో! ఈ ఇంక - దేహంతో నాకు నిమిత్తం లేదు....?

కాన : అమ్మాయి, ఇక్కడ అన్యప్రసంగానికి తావులేదు- నీ సిద్ధాంతాలని దేవతలని అసత్యమని అంగీకరించు—

జో : అది ఆత్మవిద్రోహాకరమైతే? ....

అర్చి : పిచ్చిపిల్లవు!—పూర్తిగా పిశాచాపీడితవై పరిస్థితిని

ంర్థం చేసుకోలేకున్నాను....

జో : న్యాయాధిపా - ఇది మీరు గమనించండి. చార్లెసు యువరాజా! - (మోకరిల్లి) - మీ కోసం నా సర్వస్వాన్ని అర్పించి సింహాసనం యిప్పించి నందుకా యీ ప్రతిఫలం? ఏ దైవ బలంవల్ల మీరు రక్షింపబడ్డారో ఆ దైవానికే నిందమోపుతున్నారా?- సామ్రాట్-

చార్లెసు: జోను - నేను రాజుని-రాజుమతాన్ని గౌరవించాల్సిన బాధ్యతవున్నది మతాధిపతిని తిరస్కరించడం రాజధర్మం కాదని తెలియదా?

జో : ఆత్మ విద్రోహకరమైనసంధిచేసుకుని ఆంగ్లీషు వారికి గుడ్డిమతానికి దాసాను దాసుడవై పదవీ వ్యామోహంలోపడి ఎంత విద్రోహం చివరికి తల పెట్టావు, రాజా?

చార్లె: యుద్ధం చేయాల్సింది ప్రజలు - సంధిచేసుకోవాల్సింది రాజులు. చరిత్రలో జరుగుతూవున్న విధానం అదే!

జో : ప్రజలకి ఆత్మ ప్రాణం వివేకం నిర్ణయం మీ దృష్టిలో లేవుకదూ? - ప్రభూ, చరిత్రలో యీ అన్యాయం మరుగుపరచబడి గొప్పచేయబడినా, సత్యాదర్శం వున్నంతకాలం ఏ మానవహృదయం కూడా యీ ఘోరాన్ని సహించదు!

ఛా : (కోపంగా) జోన్ - నీ నీతి బోధ వినడానికే

మేమిక్కడ కూచోలేదు — నువ్వు పశ్చాత్తాప పడతావని, నిన్ను రక్షిద్దామని నా అభిమతం ....

జో : నన్ను రక్షించేది ఏసునాథుడు. ఆ దయామయుడు నా భవితవ్యాన్ని నిర్ణయిస్తాడు.

చా : ఇంక నామీద బాధ్యతను వదులుకుంటున్నాను -

జో : అహో — ఎంతపంసన?

చా : అయితే నీ తప్పిదం అంగీకరించు —

జో : (దీనంగా) ఎలా? - ఆత్మవంచనంకంటే మరణం మేలు ....

చా : మంచిది - న్యాయాధిపా - యీ మనిమీదగల నా అధికారాన్ని వదిలి వేసుకుంటున్నాను. శెలవు.

[వెళ్ళిపోతాడు]

జోన్ : మహారాజా ! ఇలా అసహాయను చేసి నన్ను వదిలి వెడుతున్నారా ?

అర్చి : వనితా ! ఇప్పటికైనా మించిపోయింది లేదు. అంగీకరించు. (బెదరిస్తూ)- లేకపోతే నీ శరీరం సజీవంగా అగ్నిజ్వాలలకి ఆహుతి అవవలసి వస్తుంది

జోన్ : (గాద్గదికంగా)- దేవా, నాకు పరీక్షా సమయం వచ్చిందా ?.... ఈ భౌతిక శరీరంతో .... ఈ క్షుద్ర లోకంలో అసత్యంలో మూలిగే బదులు నీలోనే ఐక్యమై పోతాను — తండ్రీ.... దేవతలారా .... నాకు ఆదేశ మివ్వండి .... (నిశ్శబ్దం) .... ఆఁ, సత్యానికి నిలబడమని చెబుతున్నావా.... తల్లీ — ధన్యను.

అర్చి : న్యాయాధిపా— ఈ సందేశం అంతరార్థం, దాని లోని న్యాయా గ్రహించండి— ప్రజలలో ఇది ఎటు వంటి విప్లవాన్ని మతధిక్కారాన్ని కలిగిస్తుందో వివ రింప పనిలేదు ....

కానన్: గ్రహించాను— జోన్, ఒక నిశ్చయానికి రావడా నికి వ్యవధి యిస్తున్నాను. త్వరగా చెప్పు.

జోన్ : అబ్బ, ఇంక ఆలోచన లేదు. ఏసు దేవా- నీ లీలలు ఎంత విచిత్రాలు! ఏమని చెప్పను ?

కానన్: నీ నిర్ణయం చెప్పు- అసత్యాలని అంగీకరించు-

జోన్ : అంగీకరించను-

కానన్: మతాధిపా- తీర్పు చెప్పమని శెలవా?

అర్చి: అబలలు చపలు చిత్తులు-చంచలులు- తీర్పు కాలం వచ్చేసింది- ఇప్పటికైనా-

జోన్ : (నిశ్చయంగా)- అసహాయను-

అర్చి : సరే నీ నరకం !- న్యాయాధిపా-తీర్పు చెప్పవచ్చు ఇంక-

కానన్: (కఠినంగా, బిగ్గరగా)- ఆంగ్ల పరాసు ప్రభుత్వాలు సమిష్టిగా జోన్ కన్యపై మోపబడిన నేరాలు విచా రణ వల్ల స్థిరపడినవి గనుక చట్టరీత్యా ఆమె నేరస్థు రాలుగా పరిగణింప బడినది. ఈ విషయమై జోన్ కన్యను రక్షించుటకు చేసిన ప్రయత్నాలు అన్నీ వ్యర్థము లైనవి. కాన మత చట్టరీత్యా ఆమె సజీ వంగా ... అగ్నిజ్వాలలో ఆహుతి అగునట్లుగా తీర్మానించబడినది.

జోన్ : (నిశ్చలంగా)- నా సహచరా-ఏసూ- నా సర్వస్వం నీదే- ఈ త్యాగంలో ఎంతో ఆనందం పొందు తున్నా- కృతజ్ఞురాల్ని-

కాంనన్: ప్రతిహారీ- నేరస్థురాల్ని తీసుకు పో-

ప్రతి : చిత్తం- ఆజ్ఞ—

జోన్ : (ఉద్వేగంగా)- రక్షకా.... సత్యాదర్శాన్ని లోక ములో సుస్థిరం చేయడానికి నువ్వు అవలంబించే మార్గం ఇప్పటికి తెలుసుకున్నాను- తండ్రీ...

(సేవకుడితో వెళ్ళిపోతుంది.)

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)

స మా ప్తం



# క రి గి పో యి న క ల

పా త్ర లు :

గౌతముడు

నారదుడు

ఇంద్రుడు

అహల్య

వకుళ

# కరిగిపోయిన కల

## ప్రథమాంకము :

[వనంలో—అహల్య, వకుళ—అహల్య సరస్సు లోకి ఒక రాయి విసిరింది తిన్నెమీదనుంచి.]

అ : చూడు వకుళా - ఆ కెరటాలెలా విస్తారించాయో; ఉంగరాలు ఉంగరాలుగా ఒక రాయి విసిరేసరికి. మళ్ళీ అలాంటి కెరటాలు రావుకద !

వ : కెరటాలు మళ్ళీ రాయివేస్తే వస్తాయి. అలాగే మనస్సూ అహల్యా ! అదీ ఒక సరస్సే ననుకో. భావాలు కెరటాలు. అది సృష్టివికాసనం. జీవితం, ఆనందం ఇలాగే విస్తరించి, ఒకనాటికి అచేతన స్థితికి వస్తాయి.

అ : ఏమిటో ఈ సృష్టి, ప్రకృతీను? వీటి ఆది అంతాలు ఎక్కడో ? ఎప్పుడోగద!

వ : (నవ్వుతూ) నీ పెళ్ళెప్పుడు ?

అ : (చిరుకోపంగా) అన్నిటికీ పెడర్థాలు తీస్తావు.

వ : అబ్బో, ఆ విషయమే అంత యిష్టంలేనట్లు ...

అ : యిష్టమని నీకు బొట్టూ, కాటికా పెట్టి చెప్పానా?

వ : అవును. పాపం అలా ఎందుకు చెప్పాలి? బిక్కముఖం వేసుకుని, తుమ్మెదల వంక చూడ్డం, అప్పుడప్పుడు తనలో తను నవ్వుకోవడం, ఏమీ తెలియనట్లు 'ఫలానా వాడు ఎటువంటి వాడే' అని అడగటం, (నవ్వు) యింకా....

అ : ఛీ! అల్లరిదానా, ఏదీ పట్టుకోని చెప్తా.. (యిద్దరూ నవ్వుతూ తోటంతా పరుగెత్తుతారు. వకుళ అందకుండా పరుగెత్తుకుపోయింది. అలిసిపోయిన అహల్య నల్ల పాలరాతి తిన్నెపై ఒరిగిపోయింది.]

ఇంద్ర: (ప్రవేశించి ప్రచ్ఛన్నంగా) ఆ నల్ల పాలరాతిమీద ఎవరో ఈ అపరూపదేవత! నల్లని మేఘంపై మెరసిన మెరుపుతీగలా వుంది. నా పిచ్చి మమకారంలో యిలా ఉద్యానవనం మర్యాదాతిక్రమణం చేసి ప్రవేశించాను. ఏం చేయను? యిది తెలిసి చేసిన తప్పే. అవును, ఎవడైనా చేస్తాడు. ఇది తెలిసిచేసిన తప్పే. అవును. ఈ అహల్య సౌందర్యం కోసం ఎంతమంది సర్వత్యాగులు కాలేదు? అలసిపోయిన నా వనరాణికి ఈ వనమాలి రాక తెలియదేం! ఈ హృదయారాల ప్రతిధ్వని నాదేవి కర్ణపుటాల్లో మారు మ్రోగిక లేదా అని?

[అహల్య మెల్లిగా లేస్తుంది]

అ : (పరధ్యానంగా) ఎక్కడ దాకున్నావే వకుళా! రావే. ఎంతగా పరుగెత్తావు! కాస్త దాహం తెచ్చిద్దూ.

ఏమిా అననుగా! (తామరాకు దోనెలో నీళ్ళతో ఇంద్రుడు ప్రవేశం)

ఇం: క్షమించు రాజకుమారీ! ఈ దోన తీసుకోండి.

అ: ఆఁ, ఎవరు?

ఇం: (సహజంగా) నేను ఇంద్రుణ్ణి. త్రిలోకాధిపతిని.

అ: మీరా? యిక్కడికొచ్చారా?

ఇం: ఇంద్రుడికి ఆ లోకాలతో పనిలేదు. అతడు నివసించే లోకంలో పాలించే రాణి వేరు. ఆ రాణిసేవే అతడి జీవితాశయము.

అ: నాకేమిా అర్థంగాకుండావుంది. మీరిలా రాచమర్యాద అతిక్రమించటం, అవమానించడం.

ఇం: (సాభిమానంగా) అవును. నేను జీవన్మృతుడను.... యింకా ఎందుకు చంపుతావు? ఏ ఆత్మత్యాగం యిలా నన్ను చేయమని ప్రోత్సహించిందో అర్థం చేసుకోండి.

అ: మీ ఆశయం ఉన్నంత కావచ్చు- కాకపోవచ్చు. నా కా మీమాంసతో పనిలేదని చెప్తే అపార్థం చేసుకోరనుకుంటాను.

ఇం: అహల్యా, నా సాహసాన్ని మన్నించు. నా బలహీనత కొద్దీ వచ్చానని చెప్పడంకంటె నేను చెప్పేదేముంది? యింకా నా ప్రార్థనని అర్థం చేసుకొని ఆలోచించలేవా?

అ: వ్యక్తిగత సమార్పణ లోకాంగీకారం కాక

పోవచ్చు. పోనీండి. మీ ప్రార్థన అంగీకరించడంలో నా స్వతంత్ర బాధ్యత ఎంతవరకో, నిర్ణయించ లేకున్నాను.

ఇం: అహల్యా, అరచేతిలో వైకుంఠం చూస్తూ, దాని కోసం వెతుక్కోవడ మెందుకు? చూడు. నా ప్రార్థన, నీవు నా దాన వవడమే.

అ: విపులీకరించండి ....

ఇం: ఇంకా ఏలా విప్పిచెప్పను? నీకోసము కార్చిన కన్నీరు ఒక సముద్రమై నా హృదయము ఒక చిన్న నావయై నీకోసము వెదికి వెదికి ఈ దేశము చేరు కున్నాను, కాలాన్నే ఒక తెడ్డుగా ఉపయోగించి.

అ: మీరు రాజులని మర్చిపోయారా? ఇదేనా, రాజ కుమారులు అర్థించే వైఖరి?

ఇం; నిజమే. రాజ్యాలను ప్రేమించే ఆభరణాలను చూచి మురిసే రాజకుమారికల సామాన్యము నీకు వర్తించదు. అహల్యా త్యాగం, ధైర్యం ఇవే నాఆయుధాలుగా నీ ప్రేమరాజ్యంలో ప్రవేశించాను.

అ: కావచ్చు. ఆ పరీక్ష నిర్ణయం స్వార్థం కావటం నాకిష్టంలేదు. మీకు వున్నహక్కు ప్రతిరాజ కుమారుడికి వున్నది. స్వార్థంలో రాజవంశానికి, తండ్రికిఅప్రతిష్ట తేలేను—. అసహాయయను.

ఇం: (ఆత్రంగా) చెప్పు నాకంటే నీ దృష్టిలో అర్హుడెవ రన్నా యున్నాడేమో?

అ : ఒక విజ్ఞాపన. అలా నిర్ణయ ప్రయత్నం రాచసాంప్రదాయానికి, ఉత్తమ సాంప్రదాయానికి అపచారం చెయ్యడం కావచ్చు

ఇం: ఇదంతా ఒక కలే....నీగుండెనుంచి మధుర వాక్కులు వస్తాయని ఆశించానుగాని, ఈ గంభీర నినాదాన్ని ఎదురుచూశానా? ఓ రాకుమారి, నీ హృదయం అగాధం ...నాకు అజ్ఞాతం ....అందుకే అర్థంకాని ఈ లోకంలో, పవిత్ర ప్రణయాన్వేషులు బలియైపోతున్నారు

అ : పవిత్ర ప్రేమకి, ఏ హృదయమన్నా జోహార్లు అర్పిస్తుంది. అది బలవంతాన్ని సాధించేది కాదు. మీరు గాఢంగా ప్రేమించామని చెప్పినంత మాత్రాన నా ప్రేమ స్వాతంత్ర్యాన్ని బలవంత పరచాలనుకోవడం అనుచితం కావచ్చునని మనవి.

ఇం: మంచిది. ఈ కాలమే సాక్షిగా ఋజువుపరచి లేదా ఈ నగ్నసత్యాన్ని ఒకనాడు....

అ : ఒకనాడు ఈలోకంలో మనం జీవించి వుండమని, ఈ ప్రస్తుత జీవనాన్ని కలతపెట్టుకోవడం దేనికి ? ఆ ఒకనాడు కోసం వేచియుందాం.

ఇం: అహల్యా, నా ప్రేమ ప్రకటన నీకు చులకనై యుండవచ్చు అయినా నేనా త్రిలోకాధిపతినే.

అ : అయినంతమాత్రాన?

ఇం: ఇదే నా ప్రతిజ్ఞ. నీ జీవిత నిర్ణయానికి నేను కార

కుణ్ణి అవుతాను. సరే... ఇంక వెళ్ళడానికి అనుజ్ఞా.

అ : రావడానికి నా అనుజ్ఞ తీసుకొని వచ్చారు గనక?

ఇం: మంచిది — బ్రహ్మపుత్రీ! పునరాలోచించుకో. ఇద్దరి జీవితాల భవిష్యన్నిర్ణయం నీ చేతుల్లో వుంది.

అ : నా బాధ్యత నాకు తెలుసు.

ఇం: ఇదే ఆశాభంగంగా పరిణమిస్తే నాకు మరణమే సుఖమనుకుంటాను.

అ : ఋజువు చెయ్యండి, నిజం ఆమోదించేటట్లుగా!

ఇం: ప్రయత్నిస్తాను — అంతదాకా శెలవు.

(నిష్క్రమణ)

అ : ఆయన గాలిలా వచ్చారు. పరిమళంలా శోధించి వెళ్ళిపోయారు. ఇది ఎలా పరిణమిస్తుందో! ఎందుకో ఆయనకంత గర్వం - నా జీవిత నిర్ణయం, ఆయన మీదే వుందిట.... అయినా అహల్యా, ఎంతమందైనా నీ జీవిత నాటకంలో ప్రళయనృత్యం చెయ్యని — అది సత్యాదర్శమైన నీ నిశ్చల నిర్ణయ సమాధిని భగ్నపరచలేదు.

## — ౨ ద్వితీయాంకము ౨ —

[ఇంద్ర భవనంలో]

సే : దేవా, తమకోసం నారదులవారు.

ఇం: నారదులవారా? (ఆగి) మహామునికి నమస్కారాలు.

నా: శుభమస్తు! త్రిలోకాధిపతీ విచారంలో మునిగినట్లున్నారు?

ఇం: గురువర్యా.... మీకు తెలియనిదేముంది? బ్రహ్మ ప్రకటన విన్నతరువాత నా ఆశలు అడుగంటే చిహ్నాలు గోచరిస్తున్నాయ్.

నా: నీఅంతవాడే భయపడితే సాహసించేదెవరు చెప్పు? శుభస్య శీఘ్రం అన్నారు ఇంక ఆలస్యం దేనికి?

ఇం: ఎంతైనా మూడులోకాలు మున్నూరు ప్రదక్షిణం చెయ్యడమా! ఎలా సాధ్యమా అని?

నా: ప్రయత్నిస్తే అన్నీ తేలికే....

ఇం: ఈ మరతు ప్రేరేపణ నీనుంచి వచ్చింది కాదు కదా!

నా: అలా మభ్యపడకు. నేను సలహాలిచ్చే నిమిత్తమాత్రుడినే వాళ్ళకువుండాలికాని, నిర్ణయం?

ఇం: అహల్యకి అన్నివిధాలా తగిన నాకే ఈ శిక్షా ...

నా: ఇది శిక్ష కాదు-పరీక్ష.

ఇం: పరీక్ష నాలాంటివారికా?

నా: ని ప్రేమ తద్వారా వెల్లడి అవుతుంది - ఇంద్రా!

ఇం: స్వయంవరంలో వెల్లడికాదా? ముని!

నా. నీకు రూఢి ఏది? పోయి కార్యసాఫల్యం చేసుకో.

ఇం: నా సర్వస్వాల్నీ అర్పించ దలచుకొన్నప్పుడు, ఈ జాగెందుకు? వెడుతున్నా, ఆశీర్వదించు మునీ.

నా: కార్యసిద్ధి....(ఆగి) వెళ్ళాడు పిచ్చిఇంద్రుడు.ఇప్పుడే

నా ప్రయత్నం సాగించాలి. ఆలస్యం చేస్తే అహల్య గౌతముడికి దక్కదు.

—॥ తృతీయాంకము ॥—

[గౌతమ ఋషి ఆశ్రమము]

నా: మహామునులకు శిష్య పరమాణువు అంజలి ఘటిస్తున్నాడు.

గౌ: నాదీవనలు ఎప్పుడూ నీకేకదా? ఎన్నాళ్ళకు నేత్రానందం.

నా: గురువులకు తపోభంగం కలుగుతుందనేగాని, లేకపోతే మీ నిరంతర దర్శనాభిలాషినని తెలియదూ?

గౌ: నారదా, విశేషాలు?

నా: ఈ మహాభారం మోయలేను స్వామీ! మీరే రక్షించాలి.

గౌ: నీకా ఆపత్తు?

నా: నాకు ఆపత్తు వస్తే మీకు శ్రమ కలిగిస్తానా?

గౌ: సర్వసంగ పరిత్యాగిని, నాకు బాధలు దుఃఖాలు కూడానా?

నా: లోకోద్ధారణకోసం మహనీయులు, సామాన్యులై కార్యసాధకు లవుతూండే విషయం మీకు అపరిచితం కాదు.

గౌ: నిజమేననుకో.

నా: ఇదంతా బ్రహ్మకి చెందింది. కొద్దో గొప్పో నాకూను.

గా: దాషరికాలు దేనికి-కాసీ....

నా: అహల్యా వివాహ నిర్ణయం.

గా: దానికి, నాకూ ఎలా సంబంధం ?

నా: వుందిలే - అదంతాను.

గా: నీ కలహప్రియత్వం యీనాటితో పోయేదా ?

నా: అహల్య మహా శీలవతి - ఆమె భర్త మహర్షివినా, మరొకరు అర్హులుకారని మా అభిమతం.

గా: (ఆశ్చర్యంగా) ఇంకా ?

నా: అందరు ఋషులు ఎలా తగుతారు ? త్రిలోకాలు ముమ్మారు తిరిగినవారే అర్హులని బ్రహ్మ ప్రకటించారు.

గా: బాగానేవుంది.

నా: నా ఎరికలో ఆ ప్రయత్నంచేసి నెగ్గగలవారు, మీరు తప్ప ఎవరూ లేరు.

గా: నా మెడకే వుచ్చు బిగించావా, ఈ సంసార బంధాన్ని ?

నా: గురువులు మన్నించాలి. అహల్యకీ, ఒక అర్హుణ్ణి సంపాదించలేకపోతే మేం అపహాస్యం పాలవుతాం.

గా: నేనా ఋషిని. వార్ధక్యంలో పడబోతున్నాను. ముల్లోకాలు ప్రదక్షిణ ఎలా సాగుతుంది.

నా: శతకోటి దరిద్రాలకు, అనంతకోటి ఉపాయాలు. అన్నీ ఆలోచించే వచ్చాను.

గా: నువ్వు సమర్థుడివే గాని, ఎందుకీ బలవంతపు బ్రాహ్మణార్థమని.

నా: మీరు నిమిత్తమాత్రులు. మాకోసం, లోకంకోసం గాని, మీకెందుకీ తాపత్రయాలన్నీ? ఇంక ఈనే గోవుచుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేస్తే ముల్లోకాలు ప్రదక్షిణ ఫలమని వేదవాక్యం.

గా: అహల్య నన్ను యిష్టపడగల దంటావా?

నా: మీ శుశ్రూష లభించిందని మురిసిపోతుంది.

గా: ఎటూ చెప్పలేకుండా వున్నాను.

నా: యింకోమాటకి ఆస్కారం లేదు.

గా: అంతేనంటావా?

నా: కాక? వశిష్టాదులు వివాహం చేసుకోలేదా? పున్నామ నరక విముక్తులు కాలేదా? ఇది మానవధర్మం. అంగీకరించండి.

గా; నాకేం తోచడంలేదు—(బరువుగా) నీ ఇష్టం.

నా: ధన్యోస్మి, ధన్యోస్మి. అదిగో పర్ణశాలలో గోవు సిద్ధంగా వుంది. గృహస్థాశ్రమంలో కూడా నిష్కామ కర్మలే-పదండి.

[గౌతముడిని గోవుచుట్టూ ముమ్మారు ప్రదక్షిణ చేయించి నారదుడు అఫలం ఫలితం బ్రహ్మారు తెలియచెబుతాడు. తదనుసారంగా గౌతముడితో అహల్యా వివాహం జరుగుతుంది.]

## — ॥ చతుర్థాంకము ॥ —

[నారదుడి ఆశ్రమం, ఇంద్రుడి ప్రవేశం]

ఇం: మహామునికి అభివాదాలు.

నా: శుభం. కాని చాల అలసినట్లు అగుపిస్తున్నావు?

ఇం; మొదటి ప్రదక్షిణకే శల్యావశిష్టుణ్ని అయినాను.

నా: ఇంకెందుకు ఈ శ్రమ? అహల్యా గౌతముల వివాహం అయింది.

ఇం: ఆc! గౌతముడికే? ఎలా సంభవం! నేనేగా అందరి కంటె ముందు బయలుదేరింది!

నా: ముమ్మారు గో ప్రదక్షిణద్వారా ఫలం పొందారు ఋషి. అంతా దైవనిర్ణయం! మనచేతిలో ఏముంది?

ఇం: ఎంతవిచిత్రం జరిగింది! .... నా ఆశ .... నిరాశ అయింది. ఇంక పిచ్చివాణ్ని అవడమే కొరత.

నా: ఇంతమాత్రానికే ....

ఇం: చాలదా? బ్రహ్మచారికి యీ బాధేం తెలుస్తుంది? యీ ప్రేమ పగగా మారదుకదా?

నా; ఇందా!.... తొందరపడకు. నిప్పుతో చెలగాటం సుమా!

ఇం; అగ్నే మేలు-విరహాగ్నికంటె.

నా: త్రిలోకాధిపతీ ఇలా ప్రకటించడం శ్రేయస్కరం కాదు.

ఇం: అహల్యా హృదయాధిపతి కానిదే త్రిలోకాధిపతి ఎలా ఔతాడు?

నా: నీ మంచికోసం చెప్పాను.... పునరాలోచించుకో.

ఇం; (నిస్పృహగా) ఏమో.... పిచ్చివాణ్ని.

—। పంచమాంకము ।—

[గౌతముడి ఆశ్రమం]

[నిశీథ సమయంలో దూరాన కొక్కొరకో కూతలు]

గౌ: అహల్యా!

అ ; ....

గౌ; ప్రేయసీ!

అ ; ఎందుకూ పిలుస్తున్నారు? ఇంత రాత్రప్పుడు—

గా : కోడికూత వింటున్నావా? తెల్లవారింది.

అ : అప్పుడేనా... పడుకొని ఒక జామైనా కాందే!

గా; ఆc, దానికేమి? కాని నిద్రసుఖం ... కాలగమనాన్ని తెలుసుకోలేదు.

అ ; కొంతసేపు విశ్రమించండి.

గా; కర్మకాండకి అలస్యమా? వెళ్ళాలి .... తీసుకురా, పూజాసామగ్రి.

అ : ఒక్కదాన్ని యీ చీకట్లో నాకు భయంకాదూ?

గా: అకారణభయం-స్త్రీల సహజ లక్షణం.

అ : ఎడం కన్నుకూడా ఎన్నడూ లేంది అదురుతోంది. ఇప్పుడు వెళ్ళొద్దు.

గా: గౌతమపత్నికి భయమా? ఇదంతా భ్రమ.

అ : నేనుకూడా వస్తా మీవెంట. (లాలనగా) ఏమి జిజ్ఞాస? ... అలా చూస్తున్నారు- రాకూడదనా?

గా: వెంటనే తిరిగొస్తా, నామాటవిను. ఏం అహల్యా.

అ ; సరే, మీ ఇష్టం. (నిదానంగా) ఆయన వెళ్ళిపోయారు. నిద్రంతా పోయింది. శిరోవేదన తెచ్చి యిచ్చి...

[కొంత విరామం మళ్ళీ తలుపు తట్టిన చప్పుడు. ప్రచ్ఛన్నంగా గౌతము వేషంలో ఇందుృడు]

అ ; ఎవరూ?

ఇం; నేనే అహల్యా!

అ : మీరా, అప్పుడే వచ్చారా?

ఇం; నీకోసం, భయపడతావని—

అ; అయ్యో నా పిచ్చిభయంతో, మీరు పూజా అన్నీ సరిగా చేశారో లేదో ?

ఇ; చెయ్యకేం గాని-

అ; అలా చూస్తారేం బడలికగా? నిద్రచాలలేదా ఏం?

ఇ; కొంచెం శిరోభారంకూడా - దేహం అస్వస్థతగా వుంది-

అ; ఈ కఠోర నియమాలకి వుండకుమరి, ఇలా విశ్రమించండి.

ఇ; అయినా నీకెందుకు శ్రమ - నా బాధ నేను పడనీ.

అ; అంతా కొత్తగా మాట్లాడుతున్నారు. అన్నీ క్రొత్తే ఇవ్వాళ.

ఇ; నిద్రవస్తోంది. అబ్బా ఎంతహాయిగా వుంది అహల్యా. నా జీవిత తపః ఫలానికి ఒక కారణ జన్మవు, నా అపురూపభాగ్యరాశివి.

అ. అవన్నీ తవ్వితేవడం ఎందుకూ?

ఇ; నిన్ను వదలి ఒక్కక్షణం వుండలేను నిజంగా.

అ: ఆయాసపడుతూ మాట్లాడకండి.

ఇ; నన్ను వదలద్దు, ఇలాగే నీ చేతుల్లో ఆనందంగా మరణిస్తా.

అ; మీ మనస్సు నిశ్చయంగా చలించింది - విశ్రాంతి చాల అవసరం - ఆ కాలువ పూర్తిగా కప్పేసుకోండి.

ఇ; ఇటుచూడు - ఆ కలువ కన్నులలో కాంతి లేదేం? ముఖపద్మం వాడిపోయిందేం? చెల్లా చెదరైనాయ్ కురులు!

అ: అబ్బ - ఇంక మాట్లాడితే నా మీద ఒట్టు - అదంతా గతచరిత్ర - వాతావరణంలో ప్రశాంతత లేదు -

ఇ; నేను వెడతా?

అ; ఎక్కడికి?

ఇ; ఎక్కడికో-

అ; అమ్మయ్యో, మతిభ్రమించే చిహ్నాలు గోచరిస్తున్నాయ్.

ఇ; వెళ్ళనీ.

అ; వద్దు, పోతానను, వదలను.

(తలుపుకొట్టిన చప్పుడు)

గౌ; అహల్యా - అహల్యా!

అ; ఎవరో పిలుస్తున్నట్లున్నారు?

ఇ; ఆ పిలుస్తున్నారా? వెళ్ళి తీస్తానుండు.

అ; తలుపుతీసివస్తాను. మీరు కదలద్దు.

[గౌతముడు ప్రవేశం]

గౌ; అహల్యా నీకన్ను అదిరిందన్నావు. నిజం కాక పోతే ఈ అర్ధరాత్రి కోడి కూయడం; నేనూ పూజకు బయలుదేరడం - అయోమయంగా లేదూ? నాకూ అశుభచిహ్నాలు గోచరించాయ్.

అ; (ప్రళయంగా) - మీరా?-ఇందాకా నా దగ్గ రున్నారుగా—ఆ పక్క మీదవుంది మీరు కాదూ? ఇదేం ప్రళయం.

గౌ; (కఠినంగా) - అసంభవం. ఇందాక నేను రావడం ఏమిటి? అందునాతిరిగి పడుకోవడం ఏమిటి?- ఇదంతా మోసం.

అ; నాకు తెలియదు. ఈ మాయలు నా కతీతం-ప్రభూ- రక్షించండి.

గౌ; ఆఁ తెలుస్తోంది. ఇంద్రా, ఇదా నీ వంచన! గురు పత్నికే యీ అపచారం? ఇదిగో నిన్ను భస్మీపటలం చేస్తున్నాను.

ఇ; ప్రభూ మీ దాసుణ్ణి - అంధుణ్ణి నా దైవసమానులు నన్ను నాశనం చెయ్యకండి.

గా; నీ సౌందర్యం, రాజ్యం, నిన్ను మతి విహీనుణ్ణి చేశాయి. దీనికి పరిహారం వుండాలి. ఆ వుంది- చిహ్నం. కురూపివై పో. ఇదే నీకు తగిన శిక్ష- అహల్యా ! నీవు శిలామయరూపివై పోదువుగాక !

అ; ఇదా యీపతి పవిత్ర ప్రేమకిచ్చే ప్రతిఫలం? ఇంద్రా, ఒకనాడు ప్రేమకోసం వాపోయి పిరికిపందగా, తయారైనారా? నన్ను వంచించినా ఆత్మవంచనవల్లకలిగే అవమానమన్నా లేదా? పైగా అన్నీ తెలిసినవారని గర్విస్తారా ? ఇదేనా ప్రేమ ఋజువు చేసుకునే విధానం మళ్ళీ "ధీరులు!" అని స్తోత్ర పాఠాలు పలికించు కుంటారే ?-

ఇం; కామానికి వినాశనం వుంది-అందుకే యీ మరణం. మహర్షి! నాకు విముక్తి లేదా ?

గా: తక్షణం నా దృష్టిపథంనుండి తొలగిపో-

(ఇంద్రుడు వెడతాడు)

అ. ప్రభూ, నేను నిరపరాధిని. అకారణంగా శిలారూపం ప్రసాదించారు- తపోసంపన్నులు మీ మాటకి తిరుగులేదు-

గా; చేసిన పాపం అనుభవించాల్సిందే ?

అ: పాపం నేనా చేసింది! - నా బాధ్యత ఎంతవరకూ? ఇన్నాళ్ళు మీ పత్నిగా గౌరవం పొందాను - నా మనస్సు మీకు తెలియక పోయింది. ఇదా భర్తగా నా కిచ్చే వరప్రసాదం ?

గా; ఇంద్రుణ్ణి కనిపెట్టలేక పోయావా ?

అ; నేను అబలను. అనాధను. మీ లాంటి తపోబలం శాపం యివ్వడానికి గాని; దివ్యదృష్టి భవిష్యత్తును తెలుసుకోడానికి గాని నా కెలా వుంటాయి ?

గా; నేను ఆమోదించినా లోకం ఆమోదిస్తుందా ?

అ: భర్తకి భార్యపై ఆత్మవిశ్వాసం లేనినాడు ఎవ్వరూ ఆమోదించలేరు. ఇంద్రులను, మహర్షులను లోకం ఆమోదిస్తుంది- అవసరమొస్తే లోకాన్నే భయపెడతారు వారు- ఇంకా అహల్యలో, శాపకారులు_

గా: అహల్య భర్తగా నిమిత్తమాత్రుణ్ణి. మానవాళికి మహర్షిని- అదే లోకానికీ నాకూ సంబంధం-

అ: అయిందేదో అయింది. నా ప్రేమ నిష్కళంకం- ఏ లోకపు దురాశ, కర్ణ బలి భీష్మాదుల్ని ఆహుతి చేసుకుందో; సుమతి పార్వతి మేనకలని తన

మాధ్యంలోకి బలిచేసుకుందో, ఆ లోకపు శాసనం నన్ను రక్షించదూ. -

గౌ: అహల్యా, నా కోపంలో శాప ప్రదానం జరిగింది- దానికి తిరుగు లేదు. యీ అన్యాయానికి నా అంతరాత్మ ఆక్రోశిస్తూనే వుంటుంది.

అ; ప్రభూ- మీ కిదే ఆనందం కలిగిస్తే నేను ఎన్నటికీ విచారించను- కాని భౌతికంగా మీకు సపర్య చేయలేని విచారం నన్ను కలత పెడుతూంది.

గౌ; అహల్యా- నీ త్యాగ ప్రేమతో- నాకు ఆరాధ్య దైవతంగా గోచరిస్తున్నావు- పరమాత్మ రామావతారంలో అడవిగుండా పోతూ నీ శిల తాకి, నీ స్వస్వరూపాన్ని ప్రసాదించుతాడు.

అ; మీ శాపానుసారంగా శిలవిప్పించండి-నిరపరాధిననే ఆనందం నానుంచి ఎవ్వరూ తొలగించలేరు.-

గవు; నన్ను చీకట్లోకి నెట్టి వెళ్ళకు - నా ఆశాజ్యోతి!

అ; మీ రిప్పుడు ఏం చెయ్యలేరు. తపస్సే శరణ్యం.

గవు; ఒక మధురస్వప్నం, పీడకలగా మారింది. అహల్యా! నీ క్షమాపణచెప్పి మరీ పో.

అ: అంత శక్తివంతురాలివా - మహాత్మా! ఇదే నా ప్రేమాంజలి.

గవు; వెళ్ళిపోయావా, అహల్యా - (హతాశుడై).... ఓ అమరజీవి! ....

సమాప్తం



# అమరాన్వేషి

పాత్రలు :

ఉమర్

సాకి

ఇతరులు

(విశ్వాంతరాళమే రంగస్థలంగా
అనంతమైన కాలవాహినితో
అమరులైన పాత్రధారుల చింత)

౧ ౧ ౧

# అమరాన్వేషి

(ఒక ప్రాతఃకాలాన)

(ప్రవేశం - ఉమర్, సాకి)

ఉ: జీవుని సంపద ఒకచో నిబద్ధమైలేదు. సర్వత్రా ప్రకృతియై వ్యాపించింది. అదో, చూడు-ఆ సువర్ణ విలసిత కాంతి పుంజాలు-

సా: రాజప్రాసాదాలపై తళా తళా మెరుస్తున్నాయ్...

ఉ: అంతేకాదు...బీదల పూరిగుడిసెలపై కూడ. స్వార్థపరుడైన మానవునికి తారతమ్యాలు. కాని, స్వార్థరహితమైన ప్రకృతికి అంతస్థులు లేవు...

సా: అక్కడ జీర్ణకుటీరం...ఇటు ప్రక్క రాజమహలు... మీ నివాసం సామాన్యమందిరంలో...

ఉ : కాదు. ఈ చెట్టునీడన ... నీ చెంత ఆగమించే టప్పుడు తెచ్చేదిలేదు ... నిష్క్రమించేటప్పుడు పట్టుకుపోయేదిలేదు...మిగిలింది వారధి వంటి జీవితం. శాశ్వతంకాకపోయినా అమూల్య క్షణాలు. దొర్లిపోతున్నాయ్ ... కాలవాహినికి విరామం... ఆ చక్రపరిభ్రమణ కొనసాగుతుండగా నీ మృదు హస్తాలతో, మధురపానీయం అందించు. మానిని ..

సా : (మధువు ఒంపుతూ)...నాకు మిగిలేది- మీరు- మీకు దక్కింది చివరికి ఒక హృదయసితార్... మనకు చెందిన ఆ సితారుధ్వనులతో మన జీవన రాగం మేళవించనీ..

ఉ : (మధువాస్వాదించి) ..ఇంకా...

సా: అతి ప్రమాదమేమో?... ఈ క్షణికసుఖంకోసం శాశ్వత సుఖం త్యజించటం వివేకమేనా?

ఉ : శాశ్వతమేది? ... అనుబంధమెక్కడ? ... ఆనాటి నూనూగు మీసాల ఉమరు ఈనాడు ధవళకాం తుల్ని వెదజల్లే వృద్ధమూర్తిగా నీ ఎదుట. ఒకప్పుడు క్షణికం, శాశ్వతంకావచ్చు; శాశ్వతం, క్షణికంగా మారవచ్చు .. దీనికేమి? .. పవిత్రహృదయంలో, నిష్కామకర్మలతో, ప్రశాంతజీవనం సాగించు... క్రూరమత నిర్దేశాలూ, కుటిల సాంప్రదాయ నియ మాలు నీ జీవనవనంలో పెంచబోకు, ఇంక .ఆల

యాలల్లో, మసీదులలో, చర్చిలలో కుళ్ళిపోయే ఏదైవాంశమని కృత్రిమంగా నిర్దేశింపబడేది నీ పాదాల్ని స్పృశించకుండుగాక!...

సా : చిరకాలంగా మీరు మతగురువులవద్ద అభ్యసించిన విద్య...

ఉ : అది విస్మృతచరిత్ర...ధూళిలో కలిసిన పరిమళం, అడవిన కాసినవెన్నెల. ఎవరికోసం? .. గాఢ సుషుప్తిలోవున్న ఉమరుని మేల్కొలిపింది నేనే.. నాలో నిబిడీకృతం గురుశిష్య స్వరూప వికాసం..

సా : మీరే సర్వజ్ఞులా?...అయితే ఈ అనంత విశ్వగమనంలో జీవరాశిని చిత్రించేశక్తి?...మానవుడు పరాధీనుడు.. జీవన మరణాలు అతడిశక్తి కతీతం కాదా?

ఉ : అందుకే మనచేతిలో వుంది ఈ క్షణం!-భవిష్యత్తు మానవాళికి ఒక ఎడతెగని ఆశ...మృగతృష్ణ... భారమైన గతాన్ని స్మరించడంకంటె, ఉజ్వలమైన ఈ క్షణాన్ని ఆనందమయం చెయ్యి.. జీవనఫలాన్ని నిమిత్తమాత్రులుగ అర్పించే వారికి నిశ్చింత.. ఈసుప్రభాతానా ఏమి జీవన మరణ జిజ్ఞాస?..

సా : అబ్బ...దుఃఖం!...ఆహా...ఆనందం!..

ఉ : దుఃఖంవల్ల అజ్ఞానం,ఆత్మవంచన- అది సంకుచితం,

వేదన..ఆనందంవల్ల జ్ఞానం, ఆత్మనికాసం...అది సార్వజనీకం... సుఖం... కోరుకో ఏదికావాలి? కొంచెంగా మదు!..

సా : రూపంప్రక్కనే నీడ, ఒకనాణానికి రెండుప్రక్కలు. ఒకటి తరువాత మరొకటి - ఏమిటీవింత?... దీని వెనుకనుండే చింత!.. ఆ చింతను నిర్మించే నిగూఢ, నిరాకారశక్తి! స్వర్గ నరకాలకి సరిహద్దులేవి? దేనిని అన్వయించుకొని కోరుకోవడం?

ఉ : కార్యానికి ప్రతికార్యం ప్రకృతినైజం...తర్కించిన వారికి తరగని మాయ, భ్రమ!...తర్కాతీతమైన ఆత్మబలంలో, త్యాగశీలంతో పురోగమించు... అంతరాత్మ అసలు మార్గదర్శి..తనకి నిజంకాని జీవి లోకానికినిజంకాలేదు. ఊహల్ని వాస్తవికతని సమన్వయించు... ఊహ నిజం అవచ్చు..కాని ప్రత్యక్షం గొప్పసత్యం...ఇక్కడిలేనిసుఖం మరెక్కడ?-ఉన్నా దీన్ని విస్మరించి సాధించే మహత్తరత దానికివుందా?...కోరుకో, నీకేం కావాలి?- [దూరాన్నుండి పిలుపు] ఆలసించకండి ... స్వాగత ధ్వానాలతో కవాటాలముందు నిలవండి. .మించి పోయిన ముహూర్తం మళ్ళీరాదు?...

సా : పిలుపు ?- వెల్లడించే వలపు- ఎవరిది ?-

ఉ : ఆక్రందించే మానవాళి ఆవేదన !-
పతితులు, పవిత్రులంటూ లే రెవ్వరీ జగాన!-
అదో, ఇరాను రాజు తోట ప్రేత భూమి-
సమీపాన పాదుషా సమాధులు -

సా ; (భారంగా) - పాదుషా- ఫకీర్- యింత మన్ను-

ఉ : నీటినుండి ఉద్భవించే ఆవిరి మబ్బయి వానగా కురియదూ ?-

(బుల్బుల్ మధుర కూజితం)

విను! ఆ కూజితంలో కూడ, 'మధువా' అనేనాదం-
ఎంతల వివశుణ్ణి చేస్తుంది?- ప్రకృతి-జీవి సంబంధం
సౌజన్యజనితం సుమా-

సా : బుల్బుల్ పాట!- నాలో ఏదో ఆట ?-
ఆ స్వరంలో వర్ణనాతీతమైన తీపి !

ఉ : పూర్వ జన్మలోని ఏ మహా గాయకి
ఈ రూపు. ఈ రోజు దాల్చిందో ?-

సా : అయ్యో- ఎగిరిపోయింది బుల్బుల్ మబ్బుల్లోకి-

వస్తుందో,- రాదో- తిరిగి- ఏ దూర తీరాల్లో విహ
రించ నున్నదో ?-

ఉ : ఈ అనుతాపం, అనిశ్చితం- గీతం వ్యర్థం- ప్రస్తు
తం ప్రమోదం-ఆ కొమ్మరెమ్మల్లో మకోబుల్బుల్
పలకరిస్తోంది, ఆహ్లాదంగా-

సా : కవీ, చూడు- ఆ తోట- పుష్పించి, శోభించే ఎన్ని
గోజాలు- మరి వాటి పాద తల్పాన వాడి, శోషిల్లి
రాలిన కుసుమాలు !-

ఉ : జీవనం- యౌవ్వనం- మృత్యువు !
ఇవి సమాగమమైన మాయ ఒక జీవితం-
ఆ మాయ వికల్పం కల్పించరాదు- నిరంతరానం
దానికి అదొక సంకల్పం -

[జమిషీద్ పాదుషా గోరీనుండి]

ఒక ధ్వని : ఉమర్ కవీ, ప్రణామం -

ఉ : (ఉత్తేజంగా) పాదుషా- కాదు, భ్రాంతి -

జ : జీవితం ఒక కల- రాజ్య కాంక్షతో పీడింపబడి
యుద్ధాలు, హత్యలు, చేసి అశాంతితో గడిపాను.
ప్రజల దృష్టిలో అఖండ వైభోగినైన నేను, నాకు
మాత్రం స్వతంత్ర ఆత్మవికాస శోభ నెరుగని
జడుడను మాత్రమే- శెలవు. (నిష్క్రమణ)

ఉ : జమీందారులలో నిండిన జగం!- యుద్ధానికి శాంతికి ఘర్షణ- సత్యం ద్వారా వినా విముక్తి ఏది ? కాని యుద్ధాలలోని హత్యలకి పరాక్రమ బిరుదం భుజకీర్తులు- యిది చట్ట సమ్మతం- యుద్ధ వీరులు దేశ భక్తులు- వారికి మరణ శిక్ష లేదు. చరిత్ర సువర్ణ పుటాల్లో మహోజ్వల కీర్తి రచనా ప్రదానం. పీడితులు చరిత్ర విహీనులు-విస్మృతులు-కాని లిఖిత చరిత్ర లేని పీడితుల అన్యాయ ఆక్రందన నిరంతరం వినగల కర్ణపుటాల్లో ప్రతిధ్వనిస్తునే వుంటుంది. సాకీ, నీ మానవ హృదయంలో దేనికి స్థావు, సముచిత స్థానం -

[మహావీరుడు రుస్తుమ్ సమాధి నుండి]

ఒక ధ్వని : జీవన రహస్యాన్వేషి- జోహార్- నా మనవి-

ఉ : వీరా- వివరించు -

ఒక ధ్వని : ఎవరు వీరుడు?-ఆ చిరుదానికెంత రక్తదాహం! ఆ కీర్తి కాంతి ఆనాడు నా చేతుల్లో నా కొడుకే సమర్పింప బడినాడు. చరిత్ర రుస్తుమ్‌కి మిగిలింది కీర్తి- మానవుడు రుస్తుమ్‌కి మిగిలింది వ్యథ- వేదాంతీ- ప్రబోధించు ప్రశాంతి. (నిష్క్రమణ)

ఉ : జయాపజయాల్ని సమదృష్టితో స్వీకరించే జీవికి

వైఫల్యం లేదు- జీవితం గురించి యింక జిజ్ఞాస దేనికి- ఎలుగెత్తి చాటుతా- 'స్వ'నుండే సంస్కరణ.

సా : ఎంతవారికెంత గతి !-
ఎవరికి స్వర్గం ?- ఎవరికి నరకం ?-

ఉ : షైకలీ,- ఇక్కడే- ఈ సుమశాఖ చెంగట నీ మధుపాత్రా, ఉత్కృష్ట సాహిత్య చర్చా సంపద, నీ అమృతగానం - మరెక్కడుండ గలదు స్వర్గం !

సా : ఇదేనా ముక్తి ?- ధన్యను -

[మరునాటి ప్రాతఃకాలమున]

సా : ఎడారిలో మంచు బిందువులు ముత్యాలలాగా మెరుస్తున్నాయ్. సైకతాల్లో-మనోహరమైన పరిమళం సులతాను ఒంటి మెత్తు పల్లాలు దాటి కనుమరుగౌతున్నవి క్రమ క్రమంగా-

ఉ : నీరైన మంచు బిందువులు !- ఉన్నవీ- పూలు ధూళిలో-ఒంటె దృష్టి పథం దాటిపోయింది.

సా : బైరాం పాదుషా సమాధిపై గార్ధభవిహారం !-
పవిత్ర స్థలంలో అపచారం !-

ఉ : వైరానికి లేని అపచారం నీకా ? సాకి – అతడు నిద్రనుండి మేల్కొన లేదు. రేపు, మన సమాధులపై ఏ బాటసారికి విశ్రాంతి ?

సా : మృత్యుదేవత పాద ధ్వని; ఒకరు ముందు, మరొకరు వెనుక; ఆ పూల రంగు కమనీయం కదూ ?

ఉ : ఏ అప్సరస అధరాల కాంతి, అరుణమై ఆవహించిందో ఆ సుమాల్ని. ఆ పుష్పలతను మాటుగా మాటకు; మనసు చెల్లని ముచ్చటలు ముసురుకొని ఏ ప్రియుని నిర్మల హృదయం లతగా ఆ పువ్వుని ఆశ్రయించిందో ? మధువేదీ ?

(ఉవ్వెత్తుగా దూరాన్నుంచి శోక గీతం)

సా : ఏమా స్పందన ?

ఉ : కఠిన శిలల్లో శయనించిన గాయనీ మణులు నవ్య నూతన జీవన రాగానికి చేసే ఉపశ్రుతి–

సా : ఉపశ్రుతిని మించే ఘోష ? ఎవరూ ?–

ఉ : జీవరాశికి అన్వయించే సూత్రాలు ఒకటేనని గుర్తించక, మత శుష్క తర్కాలతో ఒక నిర్ణయానికి

రాతీక, ద్వేషాలలో, అసూయలో, అశాంతిలో
అలమటించే మూఢ పండితుల విషాద రావం !-

సా : కవీ, యివ్వ నారికి సైతం విమోచన -

ఉ : విశ్వమానవ ప్రేమ !--

సా : ఎదురుగా కన్నారి .... రంగు రంగుల చిత్రాలతో
ఆ కలశాలు ముచ్చటగా లేవూ ?

[కుండను మీాటిన చప్పుడు.]

కలశంనుండిధ్వని : లలితంగా స్పృశించు- కోమలీ- నేనూ
ఒకప్పుడు నీవంటి దాన్నే- చీనీ చీనాంబరాలు నా
లావణ్య శరీరాన్ని అలంకరించగా, ఆనాటి నా
జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలూ ....
ఏ నా అంచుపై పెదవుంచి మధువు ఆస్వాదిస్తు
న్నావో, ఆ అంచే పెదవై ఎన్ని మిటారిముద్దులు
యిచ్చి వుంటో! నువ్వూ మధుపాత్రవి కాకముందే
సార్థపరుచుకో జీవితాన్ని !

ఉ : లోకం చదరంగపాళి .... జీవితం ఆట .... రాత్రి,
పగలూ గళ్ళు - ఆటకాడు విధాత .... జీవులు
పావులు- నాకు విశ్రమించే కాలం వచ్చింది,సాకీ-

సా : (కన్నుల నీరు నించి) ప్రభూ! నన్ను ఏకాకిని చేస్తారా?
ఇంతేనా ?....

ఉ : విధి! నీ పరితాప బాష్పాలు సముద్రమై కడిగినా విధాత కఠిన శిలాక్షరాలు చెరిగిపోవు. విధాత వింతయైన కుమ్మరి - పాతకుండ మట్టిలో కలిసిపోని చివరిసారి ... సాకీ .... మధువు!

సాకీ : (హతాశయై) కవీ! నా జీవితం.

ఉ : (సగర్వంగా) సాకీ ... తపఃఫలమా! జీవానికి, మృత్యువుకి భేదం మరిచిపో. ఈ జ్ఞానమే జీవిత విజయం. ఈ ఘడియ జీవాన్నిచ్చిన మధువు, మృత్యువై నా వాకిట నిరీక్షిస్తున్నది.
మధుర మృత్యుదేవీ !

ఈ నా అంతిమకాలంలో అధర పల్లవముల మంద స్మిత సుమాలు వికసించుచుండ, నిశీరాత్రి సుఖ స్వప్నమురీతి, జీవమై నావద్దకు వచ్చినప్పుడు ఎంత మనః పూర్వకంగా నిన్నాహ్వానించియుంటినో, అంత పవిత్రంగా, నిర్వికారంగా యిప్పుడు నా ప్రాణాన్ని నీకు నివేదిస్తున్నా- సమతా దృక్పథంతో

సర్వులకూ నిరపేక్షా చిత్తంతో పవిత్రానందాన్ని
సంధించే ప్రకృతికీ మూలకారకమైన జగత్తూ!
ఇదే నా తుది నివాళి....సెలవు....

[భారంగా సితార్ శ్రుతులు]



3246

ప్రసిద్ధ రచయిత

# షష్టి ఇతర రచనలు

---

| | |
|---|---|
| శాంతి ఘోష | రు. 6-00 |
| మిగిలినది ఒక్క సితార్ | 2-5 |
| విజయ విహారం | 1-0 |
| స్వాగతాలు - స్పందనలు | 2-5 |
| ఆమె చూపిన వెలుగు | 2-0 |
| సాహితీ లత | 4-0 |
| పునరాగమనం | 3-0 |
| దేశోద్ధారకులు | 2-0 |
| కన్నీటి కడలి (వివిధ రచయితలు) | 3-5 |

పై పుస్తకాలలో ఏ రెండు పుస్తకాలు తెప్పించుకున్నా పో. ఖర్చులు మావి. మొత్తం సెట్టుగా తెప్పించుకున్నవారికి మంచి కమిష యివ్వబడును.


## శ్రీ వాణీ పబ్లికేషన్సు
విజయవాడ-2